సెర్గేయ్ స్మిర్నోవ్



# బ్రెస్ట్ దుర్గ వీరులు



"ప్రగతి" ప్రచురణాలయం

మాస్కో

# విషయసూచిక

# యుద్ధం!

1941 జూన్ 22 వ తేదీన యింకా కొద్ది సేపట్లో తెల్లవారుతుందనగా సోవియట్ యూనియన్ పశ్చిమ సరిహద్దుల్ని రక్షిస్తోన్న గస్తీదళాల సైని కులూ అగ్రగామిస్థానాల సైనికులూ ఆకాశంలో ఒక విచిత్రమైన విష యాన్ని గమనించారు. అస్పష్టంగా కనిపిస్తోన్న దిఙ్మండలంమీద, సరిహద్దు కావల బహుదూరంగా, నాజీలు ధ్వంసం చేసిన పోలెండు భూభాగాలపై విచిత్రమైన నక్షత్రాలు ప్రత్యక్షమయ్యాయి. పొద్దు మరీ తక్కువగా వుండే ఆ నాటి వేసవిరాత్రి ఆకాశంలో వెలవెలపోతూన్న నక్షత్రవీధులమధ్య ఆ కొత్త నక్షత్రాలు ఆకుపచ్చ, ఎరుపు మొదలైన వివిధ వర్ణాలతో, వింత తేజస్సుతో ప్రకాశిస్తూ, మెల్లగా నిలకడగా తెల్లబారిన తారామండలాల నడుమనుంచి తప్పించుకు తిరుగుతూ తూర్పుదిశకు సాగిపోతున్నాయి. త్వరలోనే అవి యావత్ పశ్చిమ దిఙ్మండలంమీద చెల్లాచెదరైపోయాయి. దాంతో పశ్చిమదిశనుండి క్రమక్రమేణా హెచ్చవుతోన్న అనేక యింజన్ల గర్జన వినవచ్చింది.

ఆ చప్పుడు పెద్దదై, యింకా పెద్దదై చుట్టుపక్కల అంతటా నిండిపోయి నట్లనిపించింది. చివరికి ఆ చిన్న రంగు దీపాలు ఆకాశపు సరిహద్దు అదృశ్యపు రేఖని ఛేదించుకొని సరాసరి సరిహద్దు పరిరక్షకుల శిరస్సులమీదుగా ఎగిరిపోయాయి. అలా ఎగిరిపోతూ వున్న దీపాలతో వందలాది నాజీ విమానాలు సోవియట్ యూనియన్ ఆకాశాన్ని ఆక్రమించుకున్నాయి.

అప్రతతతో కావలికాస్తున్న సరిహద్దు పరిరక్షకులు ఈ దురహంకారపూరితమైన చర్యయొక్క అంతరార్థాన్ని సంపూర్ణంగా గ్రహించే లోపునే మెరుపులవంటి కాంతిపుంపుంజ పరంపరలు పశ్చిమదిశయందలి ఉషఃకాల ఛాయలని తెగటార్చివేశాయి. సోవియట్ యూనియన్ పొలిమేరను దాటిన కొద్ది మేరలోనే ధూళి నల్లని స్తంభాకృతులలో ఆకాశంలోకి లేచింది. నలుదిశలా కొన్ని మైళ్ళ మేరకు చెవులు చిల్లులు పడే గర్జనతో భూనభోంతరాలు కంపించిపోయాయి. గత కొద్ది రోజులనుండి సరిహద్దు సమీపంలో రహస్యంగా కేంద్రీకరింపబడిన వేలాది నాజీ ఫిరంగులూ మోర్టారులూ సోవియట్ సరిహద్దు ప్రదేశంపైకి కాల్పులు సాగించాయి. ఎప్పుడూ అతి జాగరూకతతో శాంతియుతంగా వుండే సరిహద్దు కొద్ది క్షణాల్లోనే దిక్కులు పిక్కటిల్లే శబ్దంతోనూ, అగ్నిజ్వాలలతోనూ నిండిపోయిన యుద్ధరంగపు ప్రథమశ్రేణిగా మారిపోయింది...

ఆవిధంగా సోవియట్ యూనియన్‌మీదికి హిట్లర్ జర్మనీయొక్క విశ్వాసఘాతుక దండయాత్ర జరిగింది. ఆవిధంగా జర్మన్ ఫాసిస్టు దండయాత్రకు ప్రతికూలంగా సోవియట్ ప్రజల దేశభక్తియుత మహాసంగ్రామం ప్రారంభమైంది.

ఆ రోజు వుదయం ఒకే సమయంలో బారెన్ట్స్ సముద్రంనుండి నల్ల సముద్రంవరకూ సుమారు మూడు వేలమైళ్ళ మేరకు సోవియట్ యూనియన్‌యొక్క అపారమైన పశ్చిమ సరిహద్దు వెంట యుద్ధ కార్యకలాపాలు ఆరంభమయ్యాయి. సరిహద్దు ప్రాంతంలో ఫిరంగి దళాలు, విమాన దళాలు విపరీతంగా కాల్పులు సాగించిన తర్వాత రెండువందలపైచిలుకు ఫాసిస్టు, ఫిన్నిష్, రుమేనియన్ డివిజన్‌లు హిట్లరు సైన్యాధిపతులు ముందుగానే తయారు చేసుకొన్న "బార్బరోస్సా పథకం" ప్రకారం సోవియట్ గడ్డపై దాడిచేశాయి.

మూడు ప్రబలమైన నాజీ సైన్యపు సముదాయాలు తూర్పు వైపుకు పురోగమించాయి. ఉత్తరాన ఫీల్డ్ మార్షల్ ఫాన్ లీబ్ తన సైన్యాలతో లెనిన్‌గ్రాడ్ వైపుకు వెళ్ళేందుకై బాల్టిక్ తీరాన్ని ఎదుర్కొన్నాడు. దక్షిణాన కీయెవ్‌మీదికి వెళ్ళేందుకై ఫీల్డ్ మార్షల్ రూన్‌డ్‌స్టెడ్ తన సైన్యాలను నడిపించాడు. కాని అన్నిటికంటే మహత్తరమైన శత్రు సేనా సమూహం ఆ బ్రహ్మాండమైన యుద్ధశ్రేణియొక్క మధ్య భాగంలోనే తన కార్యకలాపాలని వృద్ధిచేసుకుంది. అక్కడినుండే పెద్దరోడ్డు, సరిహద్దు పట్టణమైన బ్రెస్టునుండి ప్రారంభమై తూర్పుదిశగా బైలొరష్యా రాజధానియైన మిన్‌స్క్‌గుండా, ప్రాచీన రష్యన్ నగరమైన స్మొలేన్‌స్క్ గుండా వ్యాజ్మ, మొజైస్క్ పట్టణాలగుండా దేశం నడిబొడ్డున వున్న మాస్కో నగరానికి దారితీస్తుంది.

కేంద్ర సైన్య సముదాయానికి నాయకుడు ఫీల్డ్ మార్షల్ ఫాన్ బోక్ ఆధిపత్యంకింద యాభై డివిజన్లూ, అంతేకాకుండా జనరల్ గుడేరియన్, జనరల్ గోట్ నడుపుతూ వున్న రెండు బలీయమైన టాంకు సైన్యసముదాయాలూ వున్నాయి. కోటగోడలని పడగొట్టే బరువైన సాధనాలవలె యీ రెండు టాంకు సముదాయాలూ బ్రెస్టుకు ఉత్తర దిశనూ, దక్షిణదిశనూ వున్న సోవియట్ రక్షక సైన్యాలని ఛేదించి సోవియట్ సైన్యం వెనుకకు బాగా చొచ్చుకుపోయి, విశాలమైన వలయాకృతి గమనంతో, మిన్‌స్క్ బ్రెస్ట్ పట్టణాల మధ్యనున్న సరిహద్దు ప్రాంతాలలోని సోవియట్ డివిజన్లను ఛేదించివేస్తూ వాటిని ఉక్కువలయంలో బంధించివేస్తూ మిన్‌స్క్ వద్ద కలుసుకోవలసి వుంది. నాజీ హైకమాండ్ ఉద్దేశం ప్రకారం కేంద్ర సైన్యపు సముదాయంవారు, ప్రధాన సోవియట్ సైన్యాలు యింకా ద్నేపెర్ నది కుడిగట్టున ఉన్న సమయంలోనే వాటిని చుట్టుముట్టేసి చక్రబంధంలో యిరికించి వాటిని నాశనం చేయవలసి వుంది. ఆ తర్వాత స్మొలేన్‌స్క్

వద్ద మరో పోటుపొడిచి ఆ పిమ్మట మాస్కోమీదికి పురోగమించవలసి వుంది. ద్నేపెర్ నది గట్టున జరిగిన పోరాటంలో నాశనమైపోయిన సైన్యాల స్థానే సోవియట్ కమాండ్‌వారు తమ కొత్త డివిజన్లను సమీకరించి వాటిని యుద్ధరంగానికి బదిలీచేసేలోగానే నాజీ టాంకులు మాస్కో ప్రవేశించి ఆవిధంగా సోవియట్-జర్మన్ యుద్ధరంగపు సమర ఫలితాన్ని తేల్చివేయ వచ్చునని శత్రువులు అంచనా వేసుకున్నారు.

యుద్ధం ప్రారంభమై రెండు సంవత్సరాలు గడచిపోయినప్పటికీ ఓటమి ఎరుగని హిట్లర్ జనరల్స్, ఆ మధ్యనే బాల్కన్ దేశాలలో లభించిన విజయగర్వోద్రేకంతో ముఖాలు ఎర్రబారిపోయి, తమ తూర్పువైపు దాడి త్వరలోనే అంతిమవిజయంతో అంతమౌతుందని గట్టిగా విశ్వసించారు. యుద్ధంలోని ప్రతి దశసూ నియమిత కార్యక్రమం ప్రకారంగా పథకం వేసుకున్నారు. ఇంకో నాలుగువారాల్లో మాస్కో రెడ్‌స్క్వేరులో జరుగ బోయే విజయోత్సాహపు సైనిక విన్యాసాలను ఉద్దేశిస్తూ ఆఫీసర్లు తమ యుద్ధ సాయంతనపు విందుల్లో మధువును సేవించారు.

యుద్ధం మొదటి రోజుల్లో హిట్లర్ జనరల్స్ ఆత్మవిశ్వాసంతో వుండటం సబబే అనిపిస్తుంది. యుద్ధరంగంలోని సన్నివేశాలు హిట్లరు సైన్యాలకు నూటికి నూరు పాళ్ళూ అనుకూలంగానే పరిణమించాయి. మొదటి దాడి హుటాహుటిగా చాలా ఆశ్చర్యకరంగా సంభవించింది. సరి హద్దు ప్రదేశాలలోని సోవియట్ సైన్యాలు రాత్రిపూట తెలియకుండా అకస్మాత్తుగా సంభవించిన శత్రు దాడికి గురికావలసి వచ్చాయి. సోవియట్ టాంకులూ విమానాలూ యింకా రంగంలోకి దిగక మునుపే వాటిని ఎక్కువ సంఖ్యలో తొలి కొద్ది గంటల్లోనే నాజీ విమానదళాలూ నాశనంచేశారు. ఆవిధంగా శత్రువులు తమ విమానదళాల ఆధిక్యతను సంపూర్ణంగా స్థిర

పరచుకున్నారు. జర్మన్ బాంబర్ విమానాలు సోవియట్ యుద్ధసామాగ్రి కేంద్రాలపైనా, పెట్రోలు గిడ్డంగులపైనా, పట్టణాలపైనా, రైల్వే జంక్షన్లపైనా బాంబుల వర్షం కురిపిస్తూ, వెనక్కి వైదొలగుతూన్న సోవియట్ సైనిక శ్రేణులను అవి తరచూ భీభత్సం చేస్తూండేవి. అదే సమయంలో "మెస్సెర్‌ష్మిట్" ఫైటర్‌విమానాల పల్లెటూరి బాటల పైన చిన్నచిన్న సైనికసముదాయాలనూ చివరకు ఏకాకులై తూర్పు దిశకు పోతూన్న కాందిశీకులని సహితం వెంబడించాయి.

హిట్లర్ హైకమాండ్ ముందుగానే తయారు చేసుకున్న పథకం ప్రకారంగా ప్రతీదీ జరుగుతున్నట్టు అగుపించింది. పథకం ప్రకారంగానే గుడేరియన్, గోట్ట్ సేనానుల టాంకులు జూన్ 27 వ తేదీన మిన్‌స్క్ వద్ద కలుసుకున్నాయి. శత్రువులు బైలోరష్యా రాజధానిని వశపరచుకొని సోవియట్ సైన్యాలలోని కొంత భాగాన్ని చుట్టేశారు. ఆ తర్వాత మూడు వారాలకు నాజీ సైన్యం అగ్రగామిదళాలు జులై 16 వ తేదీన స్మొలేన్‌స్క్ నగరం ప్రవేశించాయి. తాము తిరోగమిస్తూ సలిపిన యుద్ధాలలో సోవియట్ పటాలాలు శత్రువులయొక్క చక్రబంధాలలో చిక్కుకొనిపోయి తీవ్రనష్టాలకు గురి అయ్యాయి. శత్రు అగ్రగామిసైన్యాలు తూర్పు దిశగా నిరాఘాటంగా పురోగమించాయి. సోవియట్ సైన్యం నాశనం అయి పోయినట్టూ నేడో రేపో నాజీ సైన్యాలు మాస్కోలో వుండబోతున్నట్టూ జోస్యం చెప్పుతూ బెర్లిన్ పత్రికలు విజయంకోసమని అప్పటికే శంఖాలని పూరించేస్తున్నాయి.

కాని యుద్ధం ఆరంభమైన మొదటి రోజుల్లో కూడా ముందుగా తెలియనిదేదో, ముందుచూపున్న నాజీ ఆఫీసర్ల మెదళ్లకు మేతనొసగే దేదో హిట్లర్ హైకమాండ్ పథకాలను ఆటంకపరచడం మొదలు పెట్టింది. తూర్పున జరుగుతున్న యుద్ధం పశ్చిమదిశను జరుగుతున్న

యుద్ధానికి భిన్నంగా వున్నట్టు వారికి కనువిప్పు కలిగింది. ఇక్కడ ఎదుర్కొంటున్న సైన్యాలు వేరే విధంగా వున్నాయి. వాటి ప్రవర్తన, నాజీ మిలిటరీ నాయకులూ వారి సైనికులూ మామూలుగా వూహించుకొనే వూహలని తల్లకిందులు చేసింది.

అసలు ఈ వ్యవహారం తిన్నగా సరిహద్దునుండే మొదలైంది. సంఖ్యలో ఎంతో ఆధిక్యతను గలిగి ఎంతో ప్రబలంగా వున్న శత్రువు అకస్మాత్తుగా దాడిచేయడంవల్ల తమ సైన్యంలోని, తమ యుద్ధ పరికరాలలోని అధిక భాగం నాశనమైపోయినప్పటికీ కూడా సోవియట్ సైన్యాలు మాత్రం అద్భుతమైన పట్టుదలతో శత్రుసైన్యాలను ఎదుర్కొన్నాయి. సోవియట్ సైన్యాలు చెప్పనలవికాని కష్టనష్టాలకు గురియైనప్పటికీ శత్రువులు చిన్న చిన్న విజయాలను సాధించడానికి సహితం అపార నష్టాలకు గురికావలసి వచ్చింది. ప్రధాన సైన్యాలనుండి విడిపోయి దూరమైపోయినప్పటికీ ఆ విడిపోయిన సోవియట్ దళాలు మాత్రం జర్మన్ యుద్ధనీతి నియమాలన్నిటికీ భిన్నంగా మొండిపట్టుదలతో, భయానకంగా పోరాటాన్ని సాగించాయి. శత్రుసేనలకు బాగా వెనుక భాగంలో చెల్లాచెదరై వుండిపోయిన చిన్న చిన్న గ్రూపులు సహితం, తమకు నాశనం తప్పదని తెలిసి కూడా తమ ఆయుధాలను శత్రువశం చేయ నిరాకరిస్తూ శత్రువులకు వెన్ను చూపక భీకరారణ్యాలగుండా, చిత్తడి నేలలగుండా తూర్పువైపుకు మార్గం చేసుకొని, బాటలమీద నడుస్తోన్న చిన్నచిన్న శత్రు యూనిట్లను రవాణా బండ్లనూ ధైర్యంగా ఎదుర్కొని, ముందలి యుద్ధ శ్రేణిని ఛేదించుకొని, ప్రధాన సైన్యాలతో మళ్ళీ చేరిపోయాయి. శత్రుసైన్యాల వెనుకతట్టున వుండిపోయిన యితర దళాలు సాయుధదళాలుగా ఏర్పడి భయంకరమైన గెరిల్లా పోరాటాన్ని ప్రారంభించాయి. శత్రు ఆక్రమిత ప్రదేశాలలోని

ప్రజలు యీ గెరిల్లా పోరాటంలో దినదినప్రవర్ధమానమైన పాత్రను నిర్వహించారు.

రోజులు గడచిన కొద్దీ యుద్ధరంగంలో కూడా సోవియట్ సైన్యం యొక్క ప్రతిఘటన మరింత బలపడింది. బైలోరష్యా పశ్చిమ జిల్లాల లోనూ బెరెజినా నదీ తీరమందూ తిరోగమించుతూన్న సోవియట్ సేనల భీకర పృష్ఠరక్షణయుద్ధాలను శత్రువులు అధిగమించిన తర్వాత సుదీర్ఘ మైన, రక్తసిక్తమైన స్మోలేన్స్క యుద్ధంలో సోవియట్ సైన్యాల యొక్క మహత్తరమైన మొదటి ఎదురు దెబ్బలకు శత్రువులు గురికావలసి వచ్చింది. విజయాలను సాధించడం, అపారమైన సోవియట్ ప్రదేశాలను వశపరచుకోవడం, ఫాసిస్టు సైన్యం చకచకా రష్యా లోలోపలకి చొచ్చుకు పోవడం, వీటన్నిటితోపాటే నాజీ హైకమాండ్‌వారు తమ పథకాలలో ఎన్నడూ ఎదురు చూడనటువంటి భవిష్యత్తుకు ఘోర దుశ్శకునంలాంటి అసంఖ్యాక మైన నష్టాలకు ఫాసిస్టు పటాలాలు యీమొదటి యుద్ధాలలో గురికావలసి వచ్చింది. ఆనష్టాల సంఖ్యను తలచుకుంటేనే వారికి తలతిరిగిపోయింది.

కారణం ఊహించశక్యంకానట్టి వింతగొల్పేటట్టి మరో విషయం కూడా శత్రువుల నాయకుల్ని ఆశ్చర్య దిగ్భ్రమాలను చెందేట్టు చేసింది. వారి పశ్చిమ యుద్ధాలన్నిటిలోనూ యుద్ధశ్రేణికి అవతలి ప్రక్కనున్న శత్రువులు బలహీనపడిపోయి, తిరోగమనంలో క్రమం తప్పిపోయి మరో నాలుగు దెబ్బలు తగిల్తేచాలు చిత్తుగా ఓడిపోవడం తథ్యం అన్నట్టుగా తయారైయ్యారు.

కాని రష్యాలో వేరే విధంగా వుంది. యుద్ధశ్రేణికి అవతల వున్న సైన్యం పరాజయం పొంది తిరోగమిస్తున్న మాట నిజమే. అయినా పశ్చి మాన యిదివరలో జరిగిన యుద్ధాలవలె కాకుండా యీ సైన్యంయొక్క

బలం ఎన్ని కఠోర పరీక్షలకు లోనైనప్పటికీ క్షీణించకుండా, బాగా వెనక్కి తిరోగమించిన కొద్దీ యింకా ఎక్కువ బలాన్ని చేకూర్చుకుంది. జర్మన్ యుద్ధశ్రేణి వెనుక వున్న ప్రదేశం శత్రువులకు లొంగిపోయినట్టుగా గానీ, ఆ ప్రదేశాన్ని వారు జయించుకున్నట్టుగా గానీ పరిగణించడానికి వీల్లేదు. ఒక విధంగా ఆ బ్రహ్మాండమైన ప్రదేశమంతా కూడా ఒక యుద్ధ క్షేత్రమే. ఎందువల్లనంటే ఆ ప్రదేశం ప్రతి భాగంలో కూడా సాయుధ సంఘర్షణే. ఆ సంఘర్షణ ఒక్కొక్కప్పుడు బహిరంగంగానూ, ఒక్కొక్కప్పుడు ప్రచ్ఛన్నంగానూ జరిగేది. అలా జరిగినప్పుడల్లా కూడా అతి భీషణంగానూ, అతి ఉద్ధృతంగానూ జరిగేది. సోవియట్ సైనికదళాలు శత్రువుల చక్రబంధపు వ్యూహాన్ని ఛేదించుకుని యుద్ధం చేసుకుంటూ యుద్ధశ్రేణి దిశగా సాగిపోతున్నాయి. లక్షలాది చిన్నచిన్న సముదాయాలు బలవంతంగా శత్రువుల వెనుక భాగంలోనుండి చొచ్చుకొనివచ్చేసి యుద్ధం చేస్తున్నాయి. అప్పటికే ఒక భయంకరమైన శక్తి, నాశమెరుగనటువంటి శక్తి బైలోరష్యాయొక్క దట్టమైన అడవుల్లోనూ, చొరరాని చిత్తడి నేలల్లోనూ పెంపొందుతోంది. కమ్యూనిస్టు పార్టీ రహస్యసంస్థల నాయకత్వాన జాతివ్యాప్తంగా తలయెత్తిన పార్టిజాన్ ఉద్యమమే ఆ మహత్తరమైన శక్తి. దండెత్తిన జర్మన్ సైన్యానికి అది ఒక గొడ్డలిపెట్టు.

శత్రువులు ఎక్కడ అడుగు పెట్టినా అక్కడ ఒక యుద్ధరంగం ప్రత్యక్షమయ్యేది. అది నాజీ సైన్యాల అగ్రగామిదళాల నుండి తిన్నగా సోవియట్ యూనియన్ సరిహద్దువరకూ వందలాది మైళ్ల లోతుకు విస్తరించి వుంది. జూన్ 22 వ తేదీన రష్యన్ సరిహద్దుపైకి ప్రవించిన బ్రహ్మాండమైన నాజీ దండయాత్రాతరంగం కూడా ఆ అదృశ్యంగా వున్న సరిహద్దు రేఖని తుడిచి పెట్టవేయలేకపోయింది. ఫాసిస్టు టాంకులు

నడవగా ఏర్పడిన చాళ్ళుగానీ, లక్షలాది సైనికుల పాదరక్షలు గానీ ఆ సరిహద్దు రేఖని చెరపి వేయలేకపోయాయి. శత్రువులు చుట్టివేసిన సరిహద్దు రక్షకుల సముదాయాలూ సైనికదళాలూ, మొత్తంగా చౌకీస్థానాలూ, సరిహద్దు బలకేంద్రాలనుండి వేరుపడిపోయిన పటాలాలూ మొదలైనవన్నీ కూడా ఆ సరిహద్దువెంట ప్రతిచోటా యుద్ధాన్ని కొనసాగించాయి. బ్రెస్ట్ ప్రదేశంలో, సరిహద్దుయొక్క వివిధ విభాగాలలో ప్రాణాలకు తెగించినట్టి అసమానమైన పోరాటం రోజులకొద్దీ కొనసాగింది. చివరికి శత్రువులు యీ ప్రతిఘటన కేంద్రాలని అణచివేసి విజయాన్ని సాధించుకొనేప్పటికి అనేక రోజులు పట్టింది.

ఆ తర్వాత కూడా పశ్చిమ బూగ్ నది గట్టున ఒకానొక స్థలంలో కనివినియెరుగని భయంకరమైన యుద్ధం ఇంకా కొనసాగుతూనే వుంది. అక్కడ బహుకొద్దిమంది సోవియట్ వీరులు, ఒక్కొక్క వ్యక్తికీ పదిమంది చొప్పున వున్న శత్రుసైన్యాల మధ్యనూ, అగ్నిజ్వాలావలయంలోనూ చిక్కుకొని వున్నప్పటికీ తమ మాతృభూమి పొలిమేర తొలి అడుగులలో ప్రతిదానినీ మనో నిశ్చయంతో వీరోచితంగా రక్షించారు. ఆ విషయాన్ని శత్రువులు కూడా గుర్తించక తప్పింది కాదు.

జర్మన్ టాంకులు మిన్స్క్ పట్టణంలోకి ప్రవేశించినప్పుడు వారు యింకా అక్కడ పోరాడుతూనే వున్నారు. యుద్ధరంగం బెరెజినా నది వరకు విజృంభించినప్పటికీ కూడా శరణు ఇస్తామని శత్రువులు ప్రతిపాదించినప్పటికీ కూడా వారు సగర్వంగా శత్రువుల ప్రతిపాదనను తిరస్కరించారు. నమ్మశక్యం కానిదిగా అగపడినా, యుద్ధం ప్రారంభమై పూర్తిగా ఒక నెల గడచిపోయినప్పటికీ జర్మన్ సైన్యం అగ్రగామిదళాలు స్మొలేన్స్క్‌ను దాటిపోయినప్పుడు సహితమూ సోవియట్ సైనికుల ఆ కడపటి గ్రూపులు

ఆకలి దప్పులతో మలమల మాడిపోతూ, మెల్లగా ఆమరణాంతం రక్తాన్ని ధారవోస్తూన్నప్పటికీ కూడా వారు శత్రువులకు వెన్ను చూపక, అద్భుత మైన, అపూర్వమైన పోరాటాన్ని ఇంకా అలా కొనసాగిస్తూనే వున్నారు.

దేశభక్తియుత మహాసంగ్రామ చరిత్రలో అత్యంత స్తవనీయమైన తొలి పుటలను రచించిన యీ పురాణ వీరులు ఎవరోకాదు – సోవియట్ యూనియన్ సరిహద్దుమీద బ్రెస్ట్ పట్టణానికి సమీపంలో నిలచిన ఒక పాత దుర్గంలో 1941, జూన్ 22 వ తేదీన వున్న ఒక చిన్న సోవియట్ గారిజన్‌యొక్క సైనికులూ ఆఫీసర్లే ఆ వీరులు.

# పాత దుర్గం

ముహవేట్స్ అనే ఒక చిన్న నది పశ్చిమ బూగ్‌లోకి ప్రవహిస్తూవున్న చోటుకు లోతట్టుగా బెరెస్ట్‌చెట్లతో నిండిన ఏటవాలు ప్రదేశంపైన పూర్వకాలంలో బెరేస్త్యే అనే ఒక కొత్త స్లావ్ గ్రామం వెలసింది. దరిమిలా కాలంలో యీ గ్రామం కొంత ప్రాధాన్యత కలిగినట్టి దుర్గసహితమైన నగరంగా వృద్ధి చెందింది. ఈ నగరం మొదట లిథూఏనియా పాలనకిందా, ఆ తర్వాత పోలెండుకిందా వుండేది. దీనిని బ్రెస్ట్ అనీ బ్రెస్ట్-లితోవ్‌స్క్ అనీ పిలిచేవారు.

రష్యా, పోలెండు, లిథూఏనియా యీ మూడు యిరుగుపొరుగు రాజ్యాలూ దుర్గసహితమైన ఈ నగరంకోసమని నిత్యం తగవులాడుకొనేవి. ఇదీ శతాబ్దాలుగా వచ్చిన బ్రెస్ట్ పట్టణం చరిత్ర. అనేక సార్లు విదేశీ దండయాత్రికులు యీ దుర్గనగరపు గోడలకింద ప్రత్యక్షమయ్యేవారు.



బ్రెస్ట్ దుర్గపు హోల్మ్స్కి గేటు

ఈ నగరాన్ని అనేకసార్లు దోచుకోవడమూ నాశనం చేయడమూ జరిగింది. ప్రజలను విచ్చుకత్తులకు ఎరకావించడం కూడా జరిగింది.

18 వ శతాబ్దం చరమకాలానికల్లా యీ ప్రాంతాలు మరొకసారి తిరిగి రష్యాకింది కొచ్చేశాయి. 1812 యుద్ధానంతరం బ్రెస్ట్‌ను రష్యన్

సైన్యంయొక్క పశ్చిమ ప్రాంతాలలోని ప్రధాన దుర్గ కేంద్రంగా వుంచేందుకు జారిస్టు ప్రభుత్వం నిర్ణయించింది. ఈవిధంగా ఒక శతాబ్దికి బాగా ముందుగానే ముహవేత్స్, బూగ్ యీ రెండు నదుల సంగమంవద్ద బ్రెస్ట్ దుర్గం వెలసింది.

ఈ స్థలంయొక్క ప్రాదైశిక ప్రయోజనాలను అతి చాకచక్యంతో ఉపయోగించుకుంటూ రష్యన్ మిలిటరీ యింజనీర్లు ప్రాకారం మొదలగు రక్షణ కట్టడాలను నిర్మించారు. నిజంగా ఆ రోజుల్లో యీ దుర్గం శత్రువులకు దుర్భేద్యమనడంలో అతిశయోక్తి ఏమీ లేదు. దుర్గ ప్రదేశం చుట్టూ నాలుగువైపులా సుమారు అయిదు మైళ్ల దూరానికి విస్తరిల్లి ముప్పై అడుగులకు మించిన ఎత్తున్న ఒక స్థూలమైన మట్టిగోడ వుంది. మట్టి గట్టుల మందంలో మొత్తం సైన్యానికి వలసిన యుద్ధసామాగ్రి పట్టే గిడ్డంగులు ఉన్నాయి. నదిగట్లవెంట ఎక్కడైతే మట్టిగట్లు కట్టలేదో ఆ చోట్ల వెడల్పాటి అగడ్తలను తవ్వారు. ఆ అగడ్తలనిండా బూగ్, ముహవేత్స్‌ల నదీ జలాలను నింపారు. ఈ అగడ్తలు సహజంగా ఏర్పడి వున్న నదీ శాఖలతో చేరి నాలుగు దీవుల క్రింద ఏర్పడ్డాయి. ఈ నాలుగూ దీవులూ కందకాలచే రక్షితమైన నాలుగు భవనాలనే చెప్పాలి. దుర్గరక్షితాలైన ఈ నాలుగు బ్లాకుల కూటమే బ్రెస్ట్ దుర్గం.

సరిగ్గా బూగ్ నదిలో కలిసేముందు పశ్చిమంగా ప్రవహించే మూహవేత్స్ నది రెండు పాయలుగా చీలుతూంది. ఉత్తరంవైపునా దక్షిణంవైపునా యీ రెండు పాయలనీటితోనూ నైరుతి దిశను స్వయంగా బూగ్ నదీ జలంతోనూ ప్రక్షాళితమైన దుర్గప్రదేశం మధ్యలో ఒక్క చిన్న దీవి పైకిలేచి వుంటుంది. బ్రెస్ట్ దుర్గనగరానికి గుండెకాయ ఈ దీవే.

దుర్గపు వెలుపలి భాగాలు మూడింటిలాగా కాకుండా యీ మధ్య



తెరేస్పోల్‌స్కి గేటు శిధిలాలు

దీవి చుట్టూ మట్టిగట్లు లేవు. ఏమైతేనేం, యీ దీవి చుట్టూ రెండంత స్తుల ఎర్ర యిటుకల కట్టడం ఒకటి వలయాకృతిలో పరివేష్టించి వుంది. ఆ రోజుల్లో యీ వలయాకృతి భవనాన్ని 'రొండో' అని పిలిచేవారు. ఈ భవనంలోనే దుర్గంయొక్క బారకాసులు ఉన్నాయి.

ఈ బారకాసుల భవనంలో వున్న అయిదువందల గదులూ ఆహార పదార్థాలూ యుద్ధసామాగ్రీ చాలా కాలం వరకూ సరిపోయేట్టుగా నిల వలున్న పన్నెండు వేలమంది సైన్యానికి వసతిని కల్పించగలవు. అంతేకాకుండా యీ బారకాసుల అడుగున విశాలమైన నేలమాళిగలు వున్నాయి. ఆ నేల మాళిగలకింద అనేక భూగర్భ మార్గాలు వున్నాయి.

సుమారు ఐదడుగులు మందం వున్న బారకాసు గోడలు భారీ పరిమా ణపు ఫిరంగిగుండ్ల ధాకకు తట్టుకో గలవు. ఈ గోడలచే చక్కని రక్షణను

పొందుతూండిన తుపాకిదళ సైనికులు తమకేవిధమైన నష్టమూ కలగకుండా ఆ గోడలకున్న సన్నని కన్నాలగుండా ముందుకు వస్తున్న శత్రువుల మీదికి కాల్పులు సాగించగలుగుతారు. వెలుపలి బారకాసుల గోడవెంట అక్కడక్కడా అర్ధచంద్రా కృతిలోని బురుజులున్నాయి. ఎదుర్కొంటున్న సైన్యాలకు ప్రతికూలంగా పార్శ్వంనుంచీ కాల్పులు సాగించేందుకై ఆ బురుజులకు కూడా ఇలాంటి కన్నాలున్నాయి. వలయాకృతి భవనపు దక్షిణ విభాగంలో వున్న తెరేస్పొల్‌స్కి, హోల్మ్‌స్కి గేటులూ, ఉత్తర విభాగంలో వున్న మూడు ఆర్చీలుగల ఒక పెద్ద గేటూ, లోపల వున్న ప్రాంగణాన్ని, లోతైన సొరంగాల ద్వారా దుర్గంయొక్క కడమ మూడు దుర్గరక్షిత విభాలకూ దారితీస్తూన్నట్టి వంతెనలతో కలుపుతున్నాయి.

ఈ మూడు దుర్గరక్షిత విభాగాలూ మధ్య విభాగానికి నలువైపులా గోడలు పెట్టినట్టు అడ్డుగా వుండి కాపాడుతున్నాయి. వాట్లల్లో దక్షిణ దీవి, పశ్చిమ దీవి అనేవి దక్షిణ దిశకు వున్నాయి. మొత్తం దుర్గ ప్రదేశంలో సగం ఆక్రమించుకుంటూ అన్నటికంటె పెద్దదైన దుర్గనిర్మిత విభాగం మధ్యదీవిని ఉత్తరదిశవైపు పరిరక్షిస్తోంది. తన రెండు కొనలనూ బూగ్, ముహవేత్స్ నదులలోకి చొనుపుతూన్న యీ పెద్ద విభాగం మధ్యదీవిని ఒక పెద్ద గుర్రపునాడంవలె చుట్టుముట్టుతూంది.

దుర్గ మధ్య భాగం నాలుగువైపులా కాపాడబడుతుంది. శత్రువులు దుర్గపు బారకాసుల్ని సమీపించేలోగా, వారు దుర్గనగరం వెలుపల వున్న మూడు దుర్గనిర్మాణాలలోనూ కనీసం ఒక దానినైనా వశపరచుకోవలసి వుంటుంది. ప్రతి దుర్గనిర్మాణం చుట్టూ మట్టిగోడలూ, నీళ్లతో నిండిన కందకమూ వున్నాయి. ఈ దుర్గనిర్మాణం తన బురుజులతోనూ ఫిరంగి కానాలతోనూ, సైనికులకీ ఫిరంగులకీ రక్షణనిస్తూన్న బలీయమైన

ప్రాకారాలతోనూ, ఆ మట్టిగోడలలో లోతులలో ఏర్పాటై వున్న ఆహార పదార్థాలు, మందుగుండు సామగ్రుల గిడ్డంగులతోనూ దేనికదే ఒక ప్రత్యేక మైన దుర్గంగా ఏర్పడింది.

1842 లో యీ ధుర్గనిర్మాణం పని పూర్తి అయి, రష్యన్ సైనిక పతాకం బ్రెస్ట్ దుర్గంపై విజయోత్సాహంతో రెపరెపా ఎగిరింది. అప్పుడు బూగ్ నది గట్టున రక్షకునివలె నిలిచిన యీ దుర్గాన్ని నిజంగా ప్రబల మైన దుర్గం అనీ, ఆధునిక దుర్గాలలో అత్యంత శక్తివంతమైన దుర్గమనీ చెప్పడంలో ఎట్టి సందేహమూ లేదు. అయితే అది ఆవిధంగా ఎంతకాలం మనగలుగుతుందన్నదే ప్రశ్న.

పూర్వపు రోజుల్లో చిన్నచిన్న సేనలమధ్య యుద్ధాలు జరిగినప్పుడు దుర్గాలు ఎంతో ప్రధానమైన పాత్రను వహించేవి. బలమైన గారిజన్‌తో బాగా కట్టుదిట్టం చేసిన దుర్గం మొత్తం సైన్యంయొక్క పురోగమనాన్ని ఆపగలిగేది. ఎందువల్లనంటే శత్రువులు ఆ దుర్గం వెనుకనున్న గారిజన్ యొక్క చర్యలకు భయపడిపోయి దానిని దాటేందుకు సాహసించలేకపోయే వారు. శత్రువులు తప్పనిసరిగా సుదీర్ఘమూ, కష్టభూయిష్ఠమైన ముట్టడిలో చిక్కుకోవడమో, లేదా గారిజన్ కావించే యుద్ధ చర్యలను స్థానికంగా పరిమితం చేసేందుకని కనీసం తగు సేనల్ని నియోగించడమో వారికి అనివార్యమయ్యేది. ఒక్కొక్కప్పుడు ఏదో ఒకనొక దుర్గాన్ని వశపరచుకోవడానికే మొత్తం యుద్ధమంతా కూడా జరిగేది.

అభివృద్ధి చెందుతోన్న సైనిక శాస్త్రంతోపాటే దుర్గనిర్మాణ శాస్త్రం కూడా నిరంతరం అభివృద్ధి చెందుతోంది. ఫిరంగులు వృద్ధి చెందడంవల్ల ప్రధానంగా దుర్గనిర్మాణంలో ఎక్కువ మార్పులు కలుగక తప్పింది కాదు. ఫిరంగులు దుర్గాలను నాశనం చేశాయనడమే కాకుండా

అవి ఒకవిధంగా దుర్గాన్ని సృష్టిచేశాయనడంలో ఏమాత్రమూ అతిశయోక్తి లేదు.

మిలిటరీ ఇంజనీర్లకు ఫిరంగిదళపు ఆజ్ఞలను కఠినశాసనాల్లా శిరసావహించక తప్పింది కాదు. గోడల మందం తదితర దుర్గనిర్మాణ వివరాలన్నీ గుండ్ల పరిమాణంపైనా, వాటి ప్రవేశక శక్తిపైనా ఆధారపడి ఉండేవి. దుర్గప్రదేశంయొక్క పరిమాణం ఎంత వుండవలసిందీ నిర్ణయించే అంశాలలో, ఫిరంగి గుండు ఎంత మేరకు వెళ్తుందో ఆ దూరమే ఒక ప్రధానాంశమైంది. దుర్గకేంద్రాన్ని శత్రువుల కాల్పులనుండి పరిరక్షించేందుకుగానూ ఎంత దూరంవరకు గుండ్లను పేల్చగలిగితే అంత దూరంవరకూ వెలుపలి దుర్గనిర్మాణాలను విస్తరించవలసిన అవసరం ఏర్పడింది. క్లుప్తంగా చెప్పాలంటే, ప్రథమ ఫిరంగి ప్రత్యక్షమైన మరుక్షణంలోనే దుర్గాల చరిత్ర, ఫిరంగులకు వ్యతిరేకంగా అవి సాగించిన పోరాటంయొక్క చరిత్రగా రూపొందింది.

గత శతాబ్ది మధ్యలో యీ కొత్త బ్రెస్ట్ దుర్గం ఆ రోజుల్లోని సైనిక శాస్త్రంయొక్క అవసరాలన్నిటినీ సంపూర్ణంగా తీర్చింది. కాని కొద్ది సంవత్సరాల తర్వాత క్రైమియా యుద్ధమూ, సెవస్తోపోల్ రక్షణా, యివి రెండూ సైనికశాస్త్రం బాగా ముందుకు పురోగమించినట్లూ, అప్పుడున్న దుర్గాలలో ఒక్కటి కూడా తగినంత ఆధునిక దుర్గంగా పరిగణించడానికి వీల్లేదన్నట్లూ స్పష్టంగా రుజువుచేశాయి. ఆ తర్వాత త్వరలోనే ఫిరంగులలో వచ్చినట్టి యథార్థంగా విప్లవాత్మకమైన మార్పు తక్షణమే దుర్గపు అస్తిత్వంపైనే తక్షణ ఫలితాన్ని తీసుకొచ్చింది.

ఇదివరకటి నున్నని గొట్టపు ఫిరంగులకు తోడుగా రైఫిల్డ్ గొట్టాలు కలిగిన ఫిరంగులు ప్రథమ పర్యాయంగా వెలిశాయి. దాంతో ఫిరంగులయొక్క

కచ్చితమైన గురి, ఫిరంగి కాల్పుల మేర యివి రెండూ కూడా ఒక్క దాటులో హెచ్చిపోయాయి. ఇప్పుడు ప్రతి దుర్గం కూడా ఆఖరికి దాని కేంద్ర ప్రదేశమైనా సరే అభేద్యమని చెప్పడానికి వీల్లేకుండా పోయింది. ఎందువల్లనంటే దుర్గం వెలుపలి దుర్గనిర్మాణాలను శత్రువులు సమీపించగానే వారు దుర్గనగరపు మధ్యభాగంపైన కూడా ఫిరంగి గుండ్లని సునాయాసంగా వర్షంలాగా కురిపించి ధ్వంసంచెయ్యడానికి ఇప్పుడు అవకాశం లభించింది.

ఈ గండాన్ని తప్పించుకొనేందుకై సైనిక యింజనీర్లు పూనుకున్నారు. త్వరలోనే కోటలను సృష్టించి యీ సమస్యను పరిష్కరించారు. అప్పుడున్న దుర్గాలచుట్టూ కోటల వలయాన్ని నిర్మించారు — అంటే ఫిరంగులూ, గారిజన్‌లూ వున్నటువంటి ప్రత్యేకమైన దుర్గనిర్మాణాలను వెలుపలి దుర్గప్రాకారానికి కొన్ని మైళ్ల దూరాన కట్టారన్నమాట. ఆవిధంగా ఒక తాజా రక్షణ వలయం నిర్మితమైంది. ఈ వలయం శత్రువుల్ని దుర్గనగరానికి దూరంగా వుంచడమే కాకుండా శత్రువుల ఫిరంగిగుండ్ల బారినుండి దానిని పరిరక్షించింది.

ఈలోగా రైఫిల్డ్ ఫిరంగులు నిలకడగా వృద్ధిచెందాయి. ఫిరంగి కాల్పుల మేర కూడా అధికమైంది. కోటల వలయం వున్నప్పటికీ కూడా మధ్య వున్న ప్రధాన దుర్గ కేంద్రానికి ప్రమాదం సంభవించే సమయం మళ్లీ ఆసన్నమయింది.

దాంతో రక్షక స్థావరాలని మరొకసారి ముందుకు నెట్టడం తప్ప మరో మార్గం లేకపోయింది. మొదటి కోటల వలయానికి కొన్ని మైళ్లకు ఆవలే రెండో కోటల వలయాన్ని నిర్మించారు. ఈ పద్ధతి కూడా ఎంతో కాలం నిలవదని స్పష్టమైపోయింది. ఫిరంగి కాల్పుల మేర అధికమౌవుతున్న కొద్దీ మళ్లీ అదే సమస్య తప్పనిసరిగా తలెత్తితీరుతుంది. కాని ఇప్పుడు

మరో సమస్య ఉద్భవించింది. దీంతో దుర్గం భవితవ్యమే ఇక శాశ్వతంగా నిర్ణయమైపోయింది.

పూర్వకాలపు సేనలతో ఎక్కడా పోల్చడానికే వీలులేనటువంటి, ఆఖరికి 1812 లో నెపోలియన్ నాయకత్వంకింద మాస్కోపై దండు వెడలిన "గ్రాండ్ ఆర్మీ"తో కూడా పోల్చడానికే వీలులేనటువంటి అనేక లక్షల సంఖ్యలో సైన్యాలని సామ్రాజ్యవాద శకం సైనిక చర్యల రంగ స్థలంమీదికి తీసుకువచ్చింది. ఎప్పుడైతే యీ పెద్దపెద్ద నూతన సైన్యాలు రంగస్థలంమీదికి వచ్చాయో ఆ మరుక్షణాన్నే యీ దుర్గాల వ్యూహరచనా ప్రాధాన్యత పూర్తిగా అంతరించిపోయిందనే చెప్పాలి. అత్యంత పెద్ద సంఖ్యలలో పురోగమిస్తోన్న సైన్యాలకు యీ దుర్గాలు యిక యేవిధమైన ఆటంకాన్నీ కలిగించలేవు. దండయాత్ర చేస్తున్న సైన్యాలు తమ దారిలో వున్న ఏ దుర్గాన్నయినా సరే సరాసరి నేరుగా ఎదుర్కోవడం అవసరం లేకుండా పక్కగా తప్పుకుని ఈ దుర్గాలను దిగ్బంధన చేయడానికిగాను తమ సేనలలో కొద్ది భాగాన్నే వెనుక వుంచేసి, ముందుకు సాగిపోతాయి. ఈ దుర్గాలు శత్రువుల పురోగమనాన్ని అడ్డలేకపోవడమే కాకుండా, ఆత్మ రక్షణ చేసుకుంటూన్న పక్షానికి అవి నష్టాన్నే కలుగ చేస్తున్నట్టు రుజు వయింది. దుర్గరక్షణకై గారిజన్ సేనలను దుర్గంలో వుంచవలసిన అవస రం యుద్ధశ్రేణిలో నిశ్చితమైన విభాగాలలో యుద్ధవ్యూహ క్రియలనుండి సైన్యాల దృష్టిని మళ్లించేసి అనవసరంగా సేనలు చెల్లాచెదరయ్యేందుకు దారి తీస్తుంది. ఇందుకుతోడు అశేషంగా అభివృద్ధి చెందిన ఫిరంగుల కాల్పుశక్తితో, విమానంవంటి మహత్తరమైన నూతన ఆయుద్ధం ప్రత్యక్షమైనప్పుడు యీ దుర్గాలకు యిక భవిష్యత్తు లేదనడం నిస్సందే హం. వాటి కాలం గడచిపోయింది.

ప్రథమ ప్రపంచ సంగ్రామం ఆరంభమైనప్పుడు బ్రెస్ట్ దుర్గం తన రెండవ కోటల వలయాన్ని తీవ్ర ఉద్వేగంతో నిర్మించుకుంటుంది. ఏమైతేనేం పశ్చిమ రంగంలోని యుద్ధం ఆరంభమైన తొలి మాసాలలో, పునర్నిర్మాణంద్వారా దుర్గాలను రక్షించడమనేది అసంభవమని రష్యన్ కమాండ్‌వారికి త్వరగానే స్పష్టమైపోయింది. బెల్జియమ్, ఫ్రాన్సు దేశాలకు చెందిన లియేజ్, నమ్యూర్, మొబేజ్‌వంటి ఎంతో బలీయమై అత్యంత ఆధునికమైన దుర్గాలకు కూడా జర్మన్ సేనల్ని ఆపడానికిగానీ, ఆఖరికి వాటిని అడ్డగించడానికిగానీ శక్తిలేకపోయింది. ఇవన్నీ కూడా కొద్ది రోజుల్లోనే ఒకటి తరువాత ఒకటి శత్రువులకు లొంగిపోయాయి.

దీన్నుంచి ఒక విషయం తెలిసొచ్చింది. పశ్చిమశ్రేణి పోరాటంనుండి రష్యన్ కమాండ్‌వారు ఒక గుణపాఠాన్ని నేర్చుకోగలిగారు. బ్రెస్ట్ దుర్గ పునర్నిర్మాణాన్ని ఆపుచేసేశారు. ఆ దుర్గంలోని గారిజన్నీ, ఇంచుమించు అక్కడున్న ఫిరంగులన్నిటినీ యుద్ధరంగానికి మళ్లించేశారు. కేవలం యుద్ధ సామాగ్రి స్టోర్సును మాత్రమే దుర్గంలో అట్టేపెట్టారు. యుద్ధరంగానికి కదలుతూన్న రిజర్వు సేనలన్నీ ఒక చోట సమీకరించే స్థలంగా మాత్రమే వుండిపోయిందీ ఈ దుర్గం. 1915 వేసవిలో జర్మన్లు తూర్పు శ్రేణిలో దాడి ప్రారంభించి బ్రెస్ట్ దుర్గ పరిసరాలను సమీపించినప్పుడు దుర్గంలో వున్న స్టోర్స్‌లోని అధిక భాగాన్ని ఖాళీచేయడం జరిగింది. దుర్గాన్ని శత్రువులకు వదిలేస్తూ, కొన్ని కోటలను ధ్వంసంచేసి ఎట్టి ప్రతిఘటన లేకుండానే సేనలను వెనుకకు మళ్లించవలసిందిగా దుర్గనగరపు గారిజన్ పటాలాలను ఆజ్ఞాపించారు. ఆ రోజునుండీ యుద్ధం ఆఖరయ్యేవరకూ బ్రెస్ట్ దుర్గం శత్రువుల చేతుల్లోనే వుండిపోయింది.

బాల్యంలో వున్న సోవియట్ రిపబ్లిక్కుపై దారుణమైన షరతుల్ని విధించిన బ్రెస్ట్‌సంధి అక్కడే 1918 లో జరిగింది.

సామ్రాజ్యవాద యుద్ధానంతరం బైలోరష్యా పశ్చిమ ప్రాంతాలు పెట్టుబడిదారీ పోలెండులో ఒక భాగమైపోయాయి. నాటినుండి ఇరవై సంవత్సరాలవరకూ బ్రెస్ట్ దుర్గం పోలెండు సైన్యాల చేతుల్లో వుండి పోయింది. కేవలం 1939 లో మాత్రమే పశ్చిమ బైలోరష్యా తన సముచిత స్థానాన్ని బైలోరష్యన్ సోవియట్ రిపబ్లిక్కులో సంపాదించుకుంది. అప్పటినుండి బ్రెస్ట్‌దుర్గం సోవియట్ చేతిలోనే వుంది.

సోవియట్ పటాలాలు బ్రెస్ట్ దుర్గాన్ని ప్రవేశించాయి. ఈ ఆధునిక కాలంలో ఆ పాతదుర్గనగరానికి ఏమంత సైనిక ప్రాధాన్యత లేకపోవడం సహజమే. దాని దుర్గనిర్మాణాలు ఆధునిక ఫిరంగులనిగానీ, విమానాలని గానీ అడ్డగించడానికి ఎందుకూ పనికి రావు. సైనిక దళాలకూ ముఖ్యావసరపు సరఫరాలకూ వసతిని కల్పించే విషయంలో మాత్రమే ఆ దుర్గంలో వున్న బారకాసులూ, గిడ్డంగులూ ఎంతో ఉపయోగపడ్డాయి. దుర్గానికి అనుబంధంగా యుద్ధపరికరాలతో మళ్లీ అమర్చబడిన కోటలు శక్తివంతమైన బ్రెస్ట్ రక్షణ ప్రదేశంలో ఒక భాగంగా కొంతకాలం తరువాత తయారయ్యాయి. ఈ రక్షణ ప్రదేశాన్ని సోవియట్ పటాలాలు పశ్చిమ బూగ్ నది గట్టున నిర్మాణం చేయడానికి ప్రారంభించాయి.

1941 వసంత ఋతువులో సోవియట్ సైన్యంయొక్క రెండు ఇన్‌ఫెంట్రీ డివిజన్లకు సంబంధించిన యూనిట్లను బ్రెస్ట్ దుర్గపు మండలిలో వుంచారు. ఈ డివిజన్లు మంచి మనోనిబ్బరం, సుశిక్షణ, అనుభవం కలిగినటువంటి పటాలాలు. ఈ పటాలాలు రోజురోజూ, సుదీర్ఘమైన, ప్రయాసతో కూడినట్టి కాలినడకలలోనూ కాల్పుల అభ్యాసంతోనూ నిత్యమూ జరిగే అధ్యయనమూ సేనా విన్యాసాలతోనూ తమ సైనిక నిపుణత్వాన్ని అభివృద్ధి చేసుకోవడం కొనసాగించాయి.

ఈ డివిజన్లలో ఒకటి 6 వ ఒరేల్ రెడ్ బానర్ డివిజన్.* దీనికి అద్భుతమైన సుదీర్ఘ చరిత్ర వుంది. ఈ డివిజను అసలు అంతర్యుద్ధ కాలంలో ఏర్పడింది. ప్స్కొవ్ ప్రాంతంలో జర్మన్ జోక్యందారీ సైన్యాలతో జరిగిన ప్రసిద్ధ యుద్ధాలలో ఈ డివిజను తన యుద్ధ జ్ఞానస్నానాన్ని పొందింది. ఆ తర్వాత దక్షిణ రష్యాలో దెనీకిన్‌ను ఓడించడంలో పాల్గొంది. ఈ డివిజను మొట్టమొదటి సారిగా ఏర్పడి యుద్ధరంగానికి వెళ్తున్నప్పుడు, యీ దివిజనుకు వీడ్కోలు యిచ్చేందుకని లెనిన్ స్వయంగా స్టేషన్‌కు వచ్చి సైనికుల ఎదుట ఏవిధంగా ఉపన్యాసం యిచ్చినదీ ఆ కథనాన్ని యీ డివిజన్ ఆఫీసర్లూ, సైనికులూ ఒక తరంనుండి మరొక తరానికి అందిస్తూ ఆ కథయొక్క దివ్యస్మృతులను నిలబెట్టుకుంటూ వచ్చారు.

మరొక డివిజను – 42 వ ఇన్‌ఫెంట్రీ డివిజను. ఇది 1940 లో ఫిన్నిష్ యుద్ధకాలంలో ఏర్పడింది. ఈ డివిజన్ యిదివరకే మానెర్‌హైయమ్ శ్రేణిలో విజయవంతమైన పోరాటాన్ని సాగించింది. ఇందులో పనిచేస్తున్న అనేక మంది ఆఫీసర్లూ, సైనికులూ మంచి ధైర్య సాహసాలను చూపి నందుకుగాను బహుమానాలను అందుకున్నారు. ఈ డివిజన్‌లో ఉత్తమోత్తమ మైన యూనిట్ ఏదంటే యిటీవలనే ఫ్రూంజె మిలిటరీ ఎకాడమీలో పట్ట భద్రుడైన మేజర్ ప్యోత్ర్ గవ్రీలొవ్ నాయకత్వంకింద వున్న 44 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు. మేజర్ గవ్రీలొవ్ అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. అతడు 1918 లో ఎర్రసైన్యంలో చేరతానంటూ స్వయంగా ముందుకు వచ్చాడు. సుమారు ఇరవై సంవత్సరాలు కమ్యూనిస్టుగా వున్నాడు. ఆర్గ నైజరుకి ఉండవలసిన గుణగణాలన్నిటినీ అతడు పుణికిపుచ్చుకున్నాడు.

---

*ఈ డివిజన్‌కు "రెడ్ బానర్" (ఎర్ర పతాకం) ఆర్డర్ బహూ కరించబడింది.—సం.

అసామాన్యమైన మనోనిబ్బరంగల మనిషి. పరిపూర్ణమైన నైపుణ్యం తోనూ పట్టుదలతోనూ తన మనుషులకు శిక్షణ నొసగినటువంటి కఠి నుడైన కమాండరు. కచ్చితంగా పని చేయించే వ్యక్తి. రానున్న మాసాలలో ఇతడు బ్రెస్ట్ దుర్గాన్ని వీరోచితంగా రక్షించే పనిని సంఘటితపరచడంలో ప్రధాన పాత్ర వహించవలసి వచ్చింది.

వసంత ఋతువులో దుర్గాన్ని పటాలాలతో బాగా నింపినప్పటికీ కూడా 1941 వేసవి తొలి మాసాలకల్లా యీ రెండు డివిజన్ల రెజిమెం ట్లనే కాకుండా ఫిరంగి దళాలనూ టాంకు దళాలనూ ఆ ప్రదేశం చుట్టు పట్ల వున్న క్యాంపులకి పంపారు. మామూలు వేసవి శిక్షణ మొదలైంది. పశ్చిమ బూగ్ నది గట్టుమీద సరిహద్దు రక్షణప్రదేశ నిర్మాణపు పని కొనసాగింది. హెడ్‌క్వార్టర్స్ యూనిట్లూ, రెజిమెంట్లలోని మెయింటెనెన్సు పటాలాలయొక్క ఒకటో రెండో కంపెనీలు మాత్రమే దుర్గంలో వుండి పోయాయి.

ఆవిధంగా 1941 జూన్ 22 వ తేదీన రాత్రి సమయంలో యుద్ధం ప్రారంభమైనప్పుడు బ్రెస్ట్ దుర్గంలో వున్న గారిజన్ అంతా కలిపితే రెండు ఇన్‌ఫెంట్రీ రెజిమెంట్లకంటే తక్కువే వుంటుంది. వీటికి కేంద్రీ కృత నిర్మాణం లోపించి, దుర్గ ప్రదేశమందంతటా చెల్లాచెదరై వున్న వివిధ యూనిట్లలోని చిన్నచిన్న గ్రూపులుగా మాత్రమే వున్నాయన్న విషయాన్ని లెక్కలోకి తీసుకున్నట్లైతే, ఆ పరిస్థితుల్లో రక్షణసమస్య ఎంత క్లిష్టమైందో అర్థంచేసుకోవడం ఏమంత కష్టమైన విషయం కాదు. ఇక ఫిరంగులు టాంకులమాట చెప్పాలంటే వీటికి సంబంధించిన పటాలం దుర్గంలో బహుకొద్దిగా మాత్రమే ఉంది. దీనికితోడు, కొన్ని శకటాలనూ ఫిరంగులనూ పరిక్షార్థమై ఏభాగానికాభాగం విప్పదీసి వుంచారు. తెల్ల

వారేవరకూ అవి అలాగే ఉండవలసి వచ్చింది. ఆ ఉదయాన వాటిని తనఖీ చేయవలసి వుంది.

దుర్గంలో మిగిలివున్న గారిజన్ బలగం గురించిన భోగట్టా నాజీ కమాండ్‌కి అందింది. బ్రెస్ట్ దుర్గం మీదికి పురోగమించిన 4 వ జర్మన్ సైన్యానికి నాయకత్వం వహించిన ఫీల్డ్‌మార్షల్ క్ల్యూగె ఆ దుర్గనగరాన్ని మొదటి కొద్ది గంటలలోనే వశపరచుకోవచ్చని ఆశించాడు. విజయాన్ని కచ్చితంగా చేపట్టేందుకై అతడు తన అపారమైన సైనిక సంఖ్యాధిక్యతను యీ విభాగంపై కనపరచడానికి నిశ్చయించుకున్నాడు. జనరల్ ష్రోట్‌కింద వున్న ఆర్మీ కోర్‌ని బ్రెస్ట్ దుర్గానికి ఎదురుగా వున్న సరిహద్దు ప్రాంతానికి తరలించారు. ఈ ఆర్మీ కోర్‌లో అదనంగా పటిష్ఠం కావించబడిన మూడు తాజా ఇన్‌ఫెంట్రీ డివిజన్లున్నాయి. ఈ మూడింటిలో ఒకటైన 45 వ డివిజను వార్సా జ్వాలాశిధిలాలను ప్రవేశించినట్టీ, శత్రువశమైన పారిస్ నగరంగుండా విజయవంతంగా పురోగమించినట్టీ ప్రథమ సేనలలో ఇదొకటి. ఈ డివిజను వాజీ సైన్యంలోని ఉత్తమ పటాలాల్లో ఒకటని పేరుపొందింది. హిట్లర్ స్వయంగా యీ డివిజన్‌ను అనేక సార్లు ప్రశంసించాడు. ఈ డివిజనే యిప్పుడు బ్రెస్ట్ దుర్గంపై ప్రధానంగా దెబ్బతీయవలసి వుంది.

అసంఖ్యాకములైన అనుబంధపు ఫిరంగి దళాలతోనూ మోర్‌టార్ దళాలతోనూ వున్న జనరల్ ష్రోట్‌యొక్క మొత్తం ఫిరంగి దళం దుర్గంవద్దకు వచ్చి, బూగ్ నది ఎడమ గట్టున దట్టంగా అల్లుకొని వున్న పొదల్లో చెట్లకొమ్మల్ని పైనకప్పుకొని, రహస్యంగా పొంచి వుంది. కేంద్రీకృత విమానదాడితో మిళితంచేసి శక్తివంతంగానూ హుటాహుటినీ జరిపే యీ ఫిరంగి బొంబార్డ్‌మెంటుకి దుర్గంలోవున్న గారిజన్ తప్పక ధైర్యాన్ని

కోల్పోతారనీ, ఫిరంగి కాల్పులతో వీరిని నలగగొట్టిన తర్వాత, దుర్గం మీదికి లంఘింపచేసిన ఫాసిస్టు కాల్బలాలు, నిరుత్సాహపడి బేజారైపోయిన రష్యన్ సైనికుల్ని ఖైదీలుగా పట్టుకుంటాయనీ జర్మన్ జనరల్స్ గట్టిగా విశ్వసించారు.

సంఖ్యలో శత్రువులు ఒక మనిషికి పదిమంది చొప్పున ఆధిక్యతను కలిగివున్నారు. పైగా రాత్రిపూట సంపూర్ణంగా ఆశ్చర్యం గొలిపేట్టు అకస్మాత్తుగా దాడి చేయడంవల్ల ఈ సంఖ్యాధిక్యతయొక్క ప్రభావం మరింత అధికమైంది.

జర్మన్ సైనికశాస్త్రజ్ఞులు, ఒకే చావుదెబ్బతో సాధ్యమయ్యే "ఏకాంక విజయం" అనే స్వల్పకాలపు యుద్ధపు పాచికపైన అనేక సంవత్సరాలుగా తమ సైనిక జూదాన్ని నడిపించజూచారు. జర్మన్ సైనికతత్వ సిద్ధాంతకర్తలు క్లాసెవిట్జ్, మోల్ట్కే, ష్లీఫెన్‌లు అలాంటి చకచకా నడిచిపోయే యుద్ధాన్ని గురించి కలలు కన్నారు. జర్మన్ జనరల్ స్టాఫ్ మున్ముందు అవబోయే శత్రువులపై "తక్షణ" విజయం అనే ప్రాతిపదికపైన తమ సైనిక పథకాలపై కొన్ని దశాబ్దాలుగా పని చేస్తూ వచ్చింది. అంతే కాకుండా, అకస్మాత్తుగా శత్రువులపై దాడి చేయడమనే విషయానికి అశేష ప్రాముఖ్యత నొసగారు. అలా అకస్మాత్తుగా దాడిచేయడమే యుద్ధంలో వేగంగా విజయాన్ని సాధించడానికి కీలకమని జర్మన్ సిద్ధాంతకర్తలు భావించారు.

దురాక్రమణ పూరితమైన ఫాసిస్టు సైనికతత్వ సిద్ధాంతకర్తలకు హిట్లర్ జనరల్సు సరియైన వారసులు. అంతేకాదు, వాటిని సూటిగా సమర్థించేవారు కూడానూ. తక్షణవిజయాన్ని సాధించాలని చేసే "మెరుపు యుద్ధం" (బ్లిట్జ్‌క్రీగ్) సిద్ధాంతమే వారి కార్యకలాపాలకు పునాదిరాయి.

వారు యీ "మెరుపుయుద్ధం" సిద్ధాంతాన్ని తమ ఏకాంతవాస అధ్యయనాలలో కొనసాగించడమే కాకుండా, యూరపు యుద్ధరంగాలలో ఆచరణలో పెట్టిన అనేక దురాక్రమణ పథకాలకు ప్రాతిపదికగా ఏర్పరచుకొన్నారు.

"బార్బరోస్సా" పథకం కూడా "మెరుపు యుద్ధం" వంటి యుద్ధ ప్రణాళికే. అకస్మాత్తుగా శత్రువులపై పడటమనేది ఆ పథకంయొక్క అంశాలలో ఒకటి. హిట్లర్ జర్మనీ సోవియట్ యూనియన్‌తో నిరాక్రమణ సంధిని చేసుకుంది. శాంతి సమ్మతమైన నమ్మికలను కలుగజేస్తూ సోవియట్ ప్రజలను ప్రమత్తులను చేసింది. ఈలోగా అది ఎంతో రహస్యంగా ద్రోహపూరితమైన దాడి చేయడానికి అన్ని ఏర్పాట్లూ సిద్ధంచేస్తుంది. అకస్మాత్తుగా దాడి చేయడమనే తమ ఆదర్శంలో శత్రువులు కొంత వరకు విజయాన్ని సాధించగలిగారు.

ప్రధానంగా చీకటి మాటునే, చడిచప్పుడు లేకుండా సరిహద్దు వరకూ కదిలాయి ఇన్‌ఫెంట్రీ డివిజన్లు. ఎక్కడ్నుంచైతే కాల్పులు సాగించవలసి వుందో ఆ నియమిత స్థావరానికి ఫిరంగుల్నీ, టాంకుల్నీ చెట్ల కొమ్మల్తో కప్పి రాత్రిపూట తీసుకొనివచ్చి వుంచారు. సోవియట్ యూనియన్ సరిహద్దు జిల్లాలో వున్న నాజీ రహస్యపు ఏజెంట్లు అతి చురుగ్గా పని చేస్తున్నారు. గూఢచారులూ, విధ్వంసకులూ ఎడతెగకుండా సరిహద్దు వద్దకు వచ్చిచేరుకున్నారు.

ప్రత్యేకంగా బ్రెస్ట్ ప్రదేశంలో నాజీ ఏజంట్లు మంచి హుషారుగా వున్నారు. ఇక యుద్ధం ఆరంభమవుతుందనే రోజుల్లో సోవియట్ సరిహద్దు రక్షకులు గూఢచారుల్నీ విధ్వంసకుల్నీ విరివిగా పట్టుకున్నారు. జూన్ 21 వ తేదీ సాయంత్రాన జర్మన్ విధ్వంసకులు రష్యన్ సైనికులలాగా ఆఫీసర్లలాగా మారువేషాలు వేసుకొని పట్టణంలోనూ ఆఖరికి దుర్గంలో

కూడాను ప్రత్యక్షమయ్యారు. ఆమధ్యనే సోవియట్ యూనియన్‌తో జరిగిన వ్యాపార ఒడంబడిక ప్రకారం జర్మన్ ఎగుమతులను తీసుకువస్తూన్న గూడ్సురైలులో కొందర్ని సరిహద్దు మీదుగా పంపినట్టు తెలిసింది. ఈ విధ్వంసకులు రాత్రిపూట టెలిగ్రాఫ్ టెలిఫోన్ తీగెలని తెగ్గొట్టేశారు. ఎప్పుడైతే మొదటి ఫిరంగి పేలిందో ఆ మరుక్షణానే వారు సోవియట్ సైన్యం వెనుకతట్టున యుద్ధం చేయడం మొదలుపెట్టారు.

శత్రువులు తమ సన్నాహచర్యలని ఎంత రహస్యంగా జరిపినప్పటికీ కూడా సోవియట్ రహస్యపరిశోధకుల కన్నులను మాత్రం సంపూర్ణంగా కప్పలేకపోయారు. సరిహద్దువద్ద జర్మన్ పటాలాలు సమీకరింపబడుతున్నాయని సోవియట్ రహస్యపరిశోధకశాఖవారు నివేదికలని పంపించారు. సరిహద్దు ప్రాంతాన్ని అప్రమత్తతతో కనిపెడుతూన్న సోవియట్ సరిహద్దు రక్షక సైనికులు అతి జాగ్రత్తగా చెట్లకొమ్మల్తో కప్పివేసిన ఫిరంగులు నది ఎడమగట్టున వున్న పొదలలో ప్రతిరాత్రిపూటా అగుపడుతున్నాయని నివేదించారు.

శత్రువులయొక్క భయానకమైన ఉద్దేశాలను తెలియచేస్తూన్న యీ వార్తలు యితర మార్గాలద్వారా కూడా అందాయి. సోవియట్ సరిహద్దు సమీపంలో సమీకరింపబడుతోన్న జర్మన్ పటాలాలను బూగ్ నది ఆవలి గట్టునున్న పోలెండు గ్రామీణులు అతిజాగ్రత్తగా ఒక కంట కనిపెడుతూనే వున్నారు. ఒక్కొక్కప్పుడు జర్మన్ ఆఫీసర్లూ, సైనికులూ సోవియట్ యూనియన్‌పై జరుపబోయే తమ దాడిని గురించి పోలెండు ప్రజలతో బహిరంగంగానే చెబుతూవచ్చారు. అక్కడి స్థానిక ప్రజలలో అనేకులు — సోవియట్ యూనియన్‌యొక్క నిజమైన స్నేహితులు — ఆ వార్తను సోవియట్ యూనియన్‌కు ఎలా అందజేయడమా అని ఆందో

ళన పడ్డారు. ధైర్య సాహసాలుగల పోలెండురైతులు అనేకసార్లు ప్రాణాలకు తెగించైనాసరే బూగ్ నదిని యీది నాజీ కమాండ్ వుద్దేశాలను మన సరిహద్దు సంరక్షకులకు తెలియపరచి హెచ్చరించారు.

ఈ భోగట్టా అంతా కూడా తక్షణమే మాస్కోకు పంపి, ఆ రోజుల్లో ఆంతరంగిక వ్యవహారాల ప్రజా కమిస్సార్‌గా వున్న బేరియకు వ్యక్తిగతంగా నివేదించడం జరిగింది. ఈ ఆందోళనకరమైన వర్తమానాలకు కేవలం ఒకే ఒక ఊతపదమైపోయిన సమాధానం ఏమిటంటే "పర్యవేక్షణను ఇంకా అధికం చెయ్యండి" అని.

తలవనితలంపుగా ప్రబలమైన తొలిదెబ్బను కొట్టడమూ, సంఖ్య లోనూ సాంకేతికంగానూ గొప్ప ఆధికత్యను కలిగి వుండడమూ, అప్పటికే జర్మన్ పటాలాలు యుద్ధాలు చేసిచేసి రాటుతేరి రణరంగంలోకి దూక డానికి సంపూర్ణంగా సిద్ధంగా వుండడమూ, యీ పరిస్థితులన్నీ కూడా హిట్లర్ సైన్యానికి అపారమైన అనుకూలపరిస్థితులనూ లాభాలనూ కూర్చి పెట్టాయి. ఏ దేశంపైనైనా సరే కచ్చితంగా విజయాన్ని స్థిర పరచగలగేటట్టి అనుకూలపరిస్థితులివి. తూర్పు యుద్ధం తొలి రోజుల్లో జర్మన్ సైన్యానికి ఎన్ని విజయాలు లభించినప్పటికీ కూడా పైనతెలిపిన అనుకూలపరిస్థితులు మాత్రం సోవియట్ యూనియన్‌కు వ్యతిరేకంగా సాగించిన యుద్ధంలో నాజీలకు విజయాన్ని చేకూర్చలేకపోయాయి.

1941 వేసవిలో బ్రెస్ట్ దుర్గంలో జరిగిన సంఘటన, బ్రహ్మాండ మైన సోవియట్-జర్మన్ యుద్ధరంగంలో ఒక చిన్న ఉపాఖ్యానం మాత్రమే. అయినా యీ ఉపాఖ్యానానికి ఎంతో విశిష్టత వుంది. సోవియట్ ప్రజల కోపాగ్నికున్న బ్రహ్మాండ శక్తియొక్క వాస్తవిక ప్రతిబింబమే యీ ఉపాఖ్యానం. ఈ ఆగ్రహం ప్రజ్వరిల్లి చివరికి హిట్లరిజం దుష్టశక్తిని యీ అవనినుండి తుడిచి పెట్టేయగలిగినట్టు చేసింది. బ్రెస్ట్ దుర్గ

యుద్ధం శత్రువులను అనేక విషయాల గురించి లోతుగా ఆలోచించు కొనేట్టు చేసింది.

ఇక్కడ, యుద్ధరంగంయొక్క యీ చిన్న విభాగంలో నాజీ పటాలా లకు తమకున్న లాభాలను సంపూర్ణంగా వినియోగించుకొనగలిగిన అవకాశం లభించింది. సంఖ్యలోనూ, సంకేతికంగానూ శత్రువుల ఆధిక్యత ప్రత్యే కంగా చాలా ఎక్కువగా వుంది. అయినా కూడా యీ ఆధిక్యత, వాళ్ళు ఆశించిన విధంగా "మెరపు" విజయాన్ని సాధించి లేకపోయింది. శత్రువులు విపరీతమైన ధరపెట్టి స్వల్పస్థాయి విజయాన్ని మాత్రమే కొనుక్కోవలసి వచ్చింది. తమ మాతృభూమి తొలి పదిగజాల్లోనే నిలిచివున్న బ్రెస్టు దుర్గాన్ని రక్షిస్తోన్న కొద్దిమంది సైనికులూ తమ వీరోచిత పోరాటంలో యిక ముమ్ముందు శత్రువులకి ఏగతి పట్టనుందో చవి చూపించి హెచ్చ రించారు. సూక్ష్మదృష్టి వున్న ఏ పర్యవేక్షకునికైనా సరే ఆ పాత రష్యన్ దుర్గంలో జరిగిన భీకర రణజ్వాలల్లోనూ, సంగ్రామ ధూమంలోనూ ఆ తర్వాతి శీతాకాలంలో మాస్కో వెలుపల సంభవించిన నాజీ సైన్యం ఓటమీ, వోల్గాగ్రాడ్‌వద్ద ఆ సైన్యం అనుభించాల్సి ఘోరవిపత్తు, బెర్లిన్ రైఖ్‌స్టాగ్‌పై ఎగిరిన విజయపతాక ఇవన్నీ స్పష్టంగా కనబడతాయి.

## దాడి ప్రారంభమైంది

ఫాసిస్టు ఫిరంగిదళాల తొలి గుండ్లవర్షం బూగ్ నదిమీద పిడుగులా ధ్వనించిన సమయంలో బ్రెస్ట్ దుర్గం ప్రశాంతమైన నిద్రలో వుంది. నది గట్టున పొదల్లో వున్న పురోగామిచౌకీలలోని సైనికులూ, దుర్గపు ఆవరణలో కావలికాస్తున్న సైనికులు మాత్రమే పశ్చిమ దిఙ్మండలంలో




ప్రెస్ట్ దుర్గం: ప్లాను (1941)

1) మధ్యదీవి; 2) దుర్గపు ఉత్తర విభాగం; 3) పశ్చిమ దీవి; 4) దక్షిణ దీవి; 5) మట్టిగట్లు; 6) తూర్పుకోట; 7) ఆఫీసర్ల బసలు; 8) వలయాకృతి బారకాసులు; 9) 333 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు బసలు; 10) గారిజన్ క్లబ్బు (వెనుకటి దేవాలయం); 11) శ్వేత భవనం; 12) దుర్గనగరపు మూడు ఆర్చిల గేటు; 13) తెరేస్పొల్‌స్కి గేటు; 14) హోల్మ్‌స్కి గేటు; 15) ఉత్తరపు (ప్రధాన) ప్రవేశ ద్వారం; 16) తూర్పు, లేక కోబ్రిన్‌స్కి గేటు; 17) వాయవ్య గేటు; 18) 84 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు బారకాసులు; 19) జూన్ ఆఖరి రోజుల్లో ఫొమీన్ బృబచోవ్‌ల గ్రూపు స్థానాలు; 20) సరిహద్దు స్థానం.

వెలిగిన బ్రహ్మాండమైన మంటను చూశారు, పెరిగి పెద్దదౌతోన్న వింత రోదన శబ్దాన్ని విన్నారు. ఆ మరుక్షణాన్నే వందలాదిగా ప్రేలుతూన్న గుండ్ల శబ్దానికి భూనభోంతరాలు దద్దరిల్లి పోయాయి.

అది భయంకరమైన మేల్కొలుపు. ప్రతి ఆదివారం జరిగే వినోదాలూ, అనువాయితీగా వస్తున్న ఫుట్‌బాల్ పందేలు, మిలిటరీ క్లబ్బులో నృత్యాలు, పట్టణానికి సెలవు షికార్లు మొదలైన వాటితో నిండిపోయే ఆ మర్నాటి ఆదివారం గురించి హాయిగా తల్చుకుంటూ నిద్రపోతున్న వ్యక్తులు మృత్యు, రణజ్వాలల మధ్య అకస్మాత్తుగా మేల్కొన్నారు. అనేక మంది ఆరంభక్షణాలలోనే, నిద్రమేల్కొనే లోపునే, ఏం జరుగుతూందో తెలుసుకునే లోపునే శాశ్వతంగా కన్ను మూయవలసి వచ్చింది.

మిరుమిట్లు గొలిపే ఆ ప్రేలుళ్ల ఎర్రగా రక్తవర్ణంతో ప్రకాశిస్తూన్న గుబురు పొగ మబ్బులూ, దట్టమైన ధూళి మేఘాలూ యావత్తు దుర్గాన్నీ చుట్టబెట్టేసి కప్పేశాయి. అగ్నిజ్వాలల్లో భవనాలు కూలి పోయాయి. జనం నలిగిపోయారు. దగ్ధమై మృత్యువు నోటబడ్డారు. దుర్గ ఉత్తర విభాగంలోని ఆఫీసర్లు బసల చుట్టూ, మధ్యదీవిపై వున్న సరిహద్దు కమాండంట్‌యొక్క ఆఫీసు భవనం చుట్టూ భయకంపితులై సగంనగ్నంగా వున్న స్త్రీలు తమ బిడ్డల్ని చేతుల్లో పెట్టుకొని అటూ యిటూ పరుగెత్తారు, బాంబు ముక్కలు తగిలి క్షతగాత్రులైపోయారు. బారకాసులలో క్షతగాత్రుల తమ రక్తపుమడుగుల్లోనే మూలుగుతూ వున్నారు. సాయుధులైన సైనికులూ, ఆయుధాలు లేని సైనికులూ అంతా సమంగానే, క్షణంక్షణం అధికమవుతూన్న ఫిరంగుల కాల్పులనుండీ విమానాల బొంబార్డ్మెంటు నుండీ తప్పించుకొని తలదాచుకొనేందుకని నేలమాళిగల్లోకి దిగుదామని పరుగెత్తారు.

శనివారం రాత్రంతా దుర్గపు వెలుపల వున్న తమ యిండ్లల్లో గడపిన కారణంగా చాలామంది ఆఫీసర్లు తమ యూనిట్లలో లేకపోయారు.

ఈ వాస్తవాంశమే మొదటి కొద్ది నిముషాలవరకూ వున్న యీ అనివార్య మైన గందరగోళాన్ని మరింత అధికం చేసింది. ఆటు కాల్పుల తొలి చప్పుడు వినిపించిందో లేదో దుర్గ ఉత్తర విభాగంలోని ఆఫీసర్ల బసలలో నివ సించే కమాండర్లు మధ్యదీవిమీదున్న బారకాసులలోని తమ యూనిట్లను కలుసుకునేందుకై పరుగెత్తారు. ఏమైతేనేం, ఆ దీవికి దారితీసే వంతెన అప్పటికే ఎడతెగని మెషీన్‌గన్ కాల్పులకు గురి అయింది. నాజీ విధ్వంసకులు ముందుగానే ముహవేత్స్ నదిని దాటేసి, నదికెగువగా వున్న పొదలలో దాక్కొని దుర్గ మధ్య భాగానికి వెళ్ళే దారిని నిర్భేద్యమైన కాల్పులతో అడ్డగించి వేశారు. ఆ ఉదయాన వంతెనమీద జనం డజన్లకొద్దీ మరణించారు. బహు కొద్దిమంది కమాండింగ్ ఆఫీసర్లు మాత్రమే కాల్పులు సాగుతున్నప్పటికీ ఏమాత్రం లక్ష్యం చేయక ఆ వంతెనను పరుగున దాటి తమ మనుషులను చేరుకోగల్గారు. పట్టణంలో నివసించే మిగతావాళ్లు దుర్గపు గేటులను కూడా చేరుకోలేకపోయారు. ఎందువల్లనంటే వలయాకృతిలో శ్రేణిగా ఏర్పడి కాల్పులను సాగించే నాజీ ఫిరంగిదళంవారు తక్షణమే దుర్గాన్ని బ్రెస్ట్ పట్టణంనుండి విడగొట్టివేశారు.

హఠాత్ దాడివల్ల తమకు చేకూరే లాభాలన్నిటినీ కూడా దిగ్విజయంగా సాధించుకొనేందుకై శత్రువులు వేగిరపడ్డారు. ఎడమ గట్టునున్న పొదల్లోని ఫిరంగులు యింకా నిప్పుగుండ్లనూ మంటలనూ కక్కుతూనే వున్నాయి. కాగా, 45 వ ఇన్‌ఫెంట్రీ డివిజన్‌కు చెందిన సబ్‌మెషీన్‌గన్నర్ల పురోగామి దాడిదళాలు రబ్బరు పడవల్లోనూ, తెప్పల్లోనూ బూగ్‌నదిలోకి బల వంతంగా ప్రవేశించి దుర్గపు పశ్చిమ, దక్షిణ దీవులపై దండెత్తాయి.

ఈ దీవుల్ని పలుచని శ్రేణిగా వున్న సరిహద్దు పర్యవేక్షకస్థావర సైనికులూ, గస్తీదళాల సైనికులూ మాత్రమే కాపాడుతున్నారు. వారు

చేయగలిగినదంతా చేశారు. నదిగట్టునున్న పొదలనుండీ, నదివెంట విస్తరించి వున్న మట్టిగట్లుమీదనుండీ తమ మందుగుండు సామాగ్రంతా ఖాళీ అయ్యేంత వరకూ శత్రువుల పడవలమీదికి కాల్పులని సాగించారు. ఒక అంగుళం కూడా వెనక్కి వెళ్లకూడదని నిశ్చయించుకొని, సరిహద్దు పరిరక్షక సముదాయాలు నిర్మించిన బ్లాక్‌హౌస్‌ల్లోనూ, మట్టిగోడ అడుగునున్న కొట్లల్లోనూ, శిథిల భవనాలలోనూ తమతమ స్థానాలను తీసుకున్నారు. కాని శత్రువుల దాడిని ఎదుర్కోనేందుకు అక్కడ వారి సంఖ్య ఏమాత్రమూ చాలదు. శత్రువుల ఫిరంగి కాల్పుల తరంగం విపరీతమైన కోపోద్రేకంతో రెండు దీవులనీ ముంచెత్తి తమ కాల్బలాల మార్గానికి ఏవిధమైన అడ్డూ లేకుండా చేసివేసింది. ఈలోగా తెప్ప తర్వాత తెప్ప, పడవ వెనుక పడవ బూగ్ నదిని దాటివేశాయి. సబ్‌మెషీన్‌గన్నర్ల దట్టమైన శ్రేణులు కొద్దిజనంతో వున్న అక్కడి చౌకీలమీద విరుచుకుపడి వాటిని ఛేదించుకుంటూ త్వరితగతిని దుర్గ మధ్యానికి పురోగమిస్తూ ఆ రెండు దీవులనీ పూర్తిగా తుడిచిపెట్టేశాయి.

దక్షిణ దీవిలో సోవియట్ సైనిక దళాలు లేవు. అక్కడ గిడ్డంగులూ ఒక పెద్ద సైనిక ఆస్పత్రి మాత్రమే వున్నాయి. ఆ ఆస్పత్రిలో పనిచేసే కొంతమంది సిబ్బంది మాత్రం తమ కుటుంబాలతో అక్కడ వుంటున్నారు. మొట్టమొదటి గుళ్లే ఆస్పత్రి భవనాలనీ యిళ్లనీ ధ్వంసం చేసి వాటికి నిప్పంటించి వేశాయి. వార్డుల్లో వున్న రోగులు భయంతో ఆస్పత్రి పెరట్లోకి పరుగెత్తారు. ఆస్పత్రికి రాజకీయ ఉపనాయకుడైన బటాలియన్ కమిస్సార్ బొగతేయెవ్‌కి గుండ్లరవ్వతో తలలో గాయం తగిలినప్పటికీ శత్రువులను ఎదిరించేందుకై తన వాళ్లనందరినీ సంఘటిత పరచడానికి ప్రయత్నించాడే కాని డాక్టర్లు, నర్సులు మెడికల్ ఆర్డర్లీలూ

వీళ్లంతా కూడా మెరికల్లాంటి శత్రు పదాతి సైన్యానికి సాటి కారని వేరే చెప్పనవసరం లేదు. ఆ ప్రయత్నాన్ని మొగ్గలోనే తుంచేవేశారు జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్లు. ఆ కాల్పుల్లో, బొగతేయెవ్ నేలకొరిగాడు. బహు కొద్దిమంది రోగులూ, ఆస్పత్రి సిబ్బందీ హోల్మ్‌స్కి గేటు వద్ద వున్న వంతెన మీదుగా పరుగెత్తి కేంద్ర బారకాసులను ఎలాగో ఒక లాగున చేరుకో గలిగారు. మిగతా వాళ్లంతా మట్టిగట్లకిందనో నేలమాళిగల్లోనో తల దాచుకొని వుంటారు, లేదా శత్రువుల కాల్పులకు బలి అవడమో అదీ కాకపోతే శత్రువుల సబ్‌మెషీన్‌గన్నర్లు ఆ దీవిని ఆక్రమించుకుంటున్నప్పుడు ఖైదీలుగా చిక్కడమో సంభవించింది.

పశ్చిమ దీవిపైన ప్రతిఘటన సల్పుతూన్న సరిహద్దు పరిరక్షకుల గ్రూపు నొకదానిని ఫాసిస్టు ఇన్‌ఫెంట్రీ తన బలగంలో ఒక భాగంతో చుట్టుముట్టేసి, దుర్గం తెరేస్పొల్‌స్కి గేటు దగ్గరకు పురోగమించింది. ఒక్క పెద్ద సబ్‌మెషీన్‌గన్నర్ల డిటాచ్‌మెంటు తక్షణమే వంతెనను దాటి బారకాసుల ఆవరణను ప్రవేశించింది.

మధ్యదీవినీ, దానిలో చుట్టూ వున్న కట్టడాలనూ దిగదుడుపు తీస్తూ, పొడుగాటి సన్నని కిటికీలుండి బ్రహ్మాండంగా కనబడుతూన్న భవనం ఒకటి ఆ ఆవరణ నడిమధ్యనుంది. ఒకానొకప్పుడు అది సనాతన రష్యన్ దేవాలయం, తరువాత పోలెండ్‌వారు దానిని కాతలిక్ గుడిగా మార్చి వేశారు. సోవియట్ పటాలాలు దుర్గంలో అడుగుపెట్టిన తర్వాత ఆ గుడి గారిజన్ క్లబ్బుగా మారిపోయింది.

దుర్గనగరం ఆవరణలో ఫాసిస్టులు ప్రవేశించిన తర్వాత ఆ భవనం వల్ల కలిగే ఉపయోగాలను వారు వెంటనే గుర్తించేశారు. అది ఖాళీగా వుండటంవల్ల దానిని ఒక్క క్షణంలో ఆక్రమించుకున్నారు. ఫాసిస్టులు



గారిజన్ క్లబ్బు (వెనుకటి దేవాలయం) శిథిలాలు

దాడిచేసిన తొలి క్షణాల గందరగోళంలో, ఆ భవనం ఒక బలీయమైన కేంద్రంగా ఏర్పడే అవకాశం వుంటుందన్న సంగతి ఆలోచించేందుకు కూడా గారిజన్‌లో వున్నవాళ్లెవ్వరికీ సమయం చిక్కలేదు. సబ్‌మెషీన్‌గన్నర్లు తమతోపాటు ఒక రేడియో ట్రాన్స్మిటర్‌ను తెచ్చుకున్నారు. ఆ భవనం కిటికీలన్నిటి దగ్గరా మెషీన్‌గన్‌లను వుంచారు.

ఇది జరగడంతో సోవియట్ పరిరక్షణ వ్యూహపు ఆయువుపట్టు పైనే దెబ్బకొట్టినట్లయింది. మధ్యదీవిపైనున్న ప్రధాన స్థావరాన్ని ఇప్పుడు శత్రువులు ఆక్రమించేసుకున్నారు. రక్షణ సైన్యాల వెనుకభాగంపై విపరీతంగా కాల్పులు సాగించి ఆ సేనలని చల్లాచెదురు చేయడానికిగాను క్లబ్బుకిటికీలు అనువైన స్థానంలో వున్నాయి.

విజయోత్సాహంలో శత్రువుల ముఖాలు ఎర్రబారాయి. ఆక్రమించుకున్న స్థావరాన్ని స్థిరపరచుకొని కట్టుదిట్టం చేసుకోవడానికని పాటుబడ్డారు. దుర్గం మధ్యప్రదేశాన్ని పూర్తిగా వశపరచుకొనే యత్నంతో ఒక పెద్ద సబ్‌మెషీన్‌గన్నర్ల బృందం దీవియొక్క తూర్పుకొనకు పురోగమించింది. ఈ బృందం తన కదలికలను రేడియోద్వారా తెలియపరచ

డంవల్ల ఫాసిస్టు ఫిరంగిదళం దుర్గంలోని ఆ భాగంపై కాల్పులను సాగించడం ఆపుచేసింది.

క్లబ్బుకు ఎదురుగా దీవి తూర్పు భాగంలో ఒక భవనం వుంది. ఆ భవనం చుట్టూ ఒక కాంక్రీటు ప్రహరీ గోడ, గోడపైన ఇనుపగజాలు వున్నాయి. ఇదే శ్వేత భవనం. వెనుకటి బ్రెస్ట్ శాంతి సంధి ఇక్కడే జరిగింది. 1939 లో యీ భవనాన్ని కొంతవరకు పడగొట్టేశారు.

ఈ భవనం ప్రహరీ గోడ దక్షిణ భాగం సమాంతరంగా వెళ్తూండడంవల్ల, బారకాసుకీ గోడకీ మధ్య ఒక వెడల్పాటి వీధి ఏర్పడింది. ఒకరినొకరు కంఠవ్యశబ్దాలతో పిలుచుకుంటూ, కటికీలలోకి కాల్పులను సాగించుటూనే సబ్‌మెషీన్‌గన్నర్లు మూకవుమ్మడిగా ఆ వీధి దిగువగా పురోగమించారు.

వారి కాల్పులకు సమాధానం లేదు. ఫిరంగుల కాల్పులవల్లా విమాన దాడివల్లా నలిగిపోయి అణగారిపోయిన సోవియట్ గారిజన్‌కు శత్రువుల నెదిరించే శక్తి యికలేదనీ, పోరాటంలేకుండానే దుర్గ కేంద్రప్రదేశం శత్రువుల వశమైపోతుందనీ స్పష్టమైపోయింది. క్రమక్రమేణా హెచ్చవుతూన్న ఆ తెల్లవారు వెలుగులో, బారకాసుల వలయంలో వున్న సందు జాగా, ముహవేత్స్ నది రెండు పాయలుగా చీలిపోయే చోట గట్టుపైన ఎత్తుగా వున్న నీళ్లటాంకిబురుజూ ధూళిధూమాలలోనుంచి కనబడుతున్నాయి.

అకస్మాత్తుగా, తలవనితలంపుగా శత్రువులకు ధైర్యం చెదిరిపోయే దెబ్బ తగిలింది. ఎక్కడో, లోతుగా వున్న నూతిలోనుండి వినవస్తున్నట్టు బారకాసులనుండి సుదీర్ఘమైన శబ్దం ఒకటి వినిపించింది. ఆవరణ వైపుకున్న తలుపులు తటాలున తెరచుకున్నాయి. సోవియట్ వీరులు తమ తుపాకుల కొనలకు బాయొనెట్లను తగిలించుకొని 'హుర్రా' అని భయంకరంగా అరుస్తూ, పురోగమిస్తున్న జర్మన్ డిటాచ్‌మెంట్ మధ్యభాగంమీదికి లంఘించారు.

కొద్ది నిముషాల్లోనే శత్రువులు నాశనమైపోయారు. బాయొనెట్లతో ఎదుర్కొన్న సోవియట్ సైనికులు ఎదుటనున్న జర్మన్ డిటాచ్‌మెంటును కత్తితో చీల్చినట్టే రెండు ముక్కలుగా విడగొట్టారు. బారకాసుల తలుపులను ఇంకా చేరని జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్లు గందరగోళంగా క్లబ్బు భవనం వైపుకూ, ఏ గేటునుండైతే ఆవరణను ప్రవేశించారో ఆ తెరేస్పోల్‌స్కి గేటువైపుకూ హడలిపోతూ పలాయనం చిత్తగించారు. డిటాచ్‌మెంటు రెండవ భాగం సైనికులు తమ తోటిసైనికులనుండి విడిపోయి దీవి తూర్పు కొనకు, వీధికి దిగువగా పరుగెత్తారు. వారిని సోవియట్ సైనికులు విజయోల్లాసంతో వెంబడించారు. నాజీ సబ్‌మెషీన్‌గన్నర్ అలా కిందపడీపడంతోనే అతని ఆయుధం కోసమని సోవియట్ సైనికులు అతనికి మీదికి లంఘిస్తారు. సోవియట్ సైనికుడే గనక నేలరాలినట్లైతే అతని రైఫిల్ కూడా అతని స్నేహితుని చేతుల్లోకి వెళ్తుంది, ఆ రైఫిల్ తన శత్రు సంహారకార్యాన్ని నిర్దాక్షిణ్యంగా నెరవేర్చుతూనే వుంటుంది.

సోవియట్ సైనికులు ఫాసిస్టులను ముహవేత్స్ గట్టుకు తరిమేసి వారిని త్వరలోనే నాశనం చేసివేశారు. వాళ్లల్లో కొంతమంది ఈదుకుంటూ తప్పించుకుపోదామని ప్రయత్నం చేశారే కాని సోవియట్ లైట్‌మెషీన్‌గన్‌ల బారినుండి తప్పించుకోలేకపోయారు. శత్రుసైనికుడొక్కడైనా ఆవలి గట్టున చేరుకోలేకపోయాడు.

దుర్గాన్ని తుఫానువలె ముంచెత్తి వేస్తున్న సైన్యాలకు ప్రతికూలంగా ఎదురుదెబ్బతీయడం యిదే మొదటి సారి. బారకాసుల భవనం ఆగ్నేయ భాగాన్ని ఆక్రమించుకున్న 84 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటే యీ ఎదురుదెబ్బను తీసుసింది.

ఆ రాత్రి యీ రెజిమెంటుకింద ఒకేఒక ఇన్‌ఫెంట్రీ బటాలియను,



రెజిమెంటు యువకమ్యూనిస్టు
లీగ్ కార్యదర్శి సమ్వేల్
మతెవొస్యాన్, 1941



రెజిమెంటల్ కమిస్సార్ యెఫీమ్
ఫొమీన్

కొద్ది హెడ్క్వార్టర్సు యూనిట్లు మాత్రమే వున్నాయి. దాదాపు ఆఫీసర్లంతా యితర బటాలియన్లతో దుర్గపు ఆవల క్యాంపులో వుండిపోయారు. లేదా పట్టణంలోని తమ యిండ్లల్లో ఆ రాత్రి గడుపుతున్నారు. ఇద్దరు ముగ్గురు లెఫ్టినెంటులు, ప్లాటూన్ కమాండర్లు మాత్రమే రెజిమెంట్ హెడ్క్వార్టర్స్లో నిద్రపోతున్నారు. వీళ్లే కాకుండా, రెజిమెంటు కమిస్సార్ యెఫీమ్ ఫొమీన్ కూడా ఆ సమయంలో అక్కడ వున్నాడు. ఆ రోజు రాత్రి అతడు తన ఆఫీసులో నిద్రపోతున్నాడు.

ఆ గతసాయంత్రం ఫొమీన్కు అతడు యిదివరకున్న లాట్వియలో పనిచేస్తూండిన చోటునుండి తన కుటుంబాన్ని తెచ్చుకొనేందుకై కొద్ది రోజులు సెలవు మంజూరు అయింది. సుమారు పది గంటలకు అతడు

రైలుస్టేషన్‌కు వెళ్లాడు. కాని టిక్కెట్టు దొరకలేదు. తన ప్రయాణాన్ని మర్నాటివరకూ వాయిదా వేసుకుకునే ఉద్దేశంతో హెడ్‌క్వార్టర్సుకు తిరిగి వచ్చేశాడు. రెజిమెంట్ యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శియైన సమ్‌వేల్ మతెవాస్యాన్‌తో పొద్దుపోయేవరకూ మాట్లాడుతూ కూర్చున్నాడు. వాళ్లకు ఇంకా నిద్ర పట్టిందో లేనేలేదో, శత్రువుల బాంబులు ఫిరంగిగుళ్లూ దుర్గంమీద పడటం ప్రారంభమైంది.

ఈ భాగపు బారకాసుల కిటికీలు సరిహద్దు దిశగా ముహవేత్స్ నదీ ముఖంగా వున్నాయి. కొన్ని ఫిరంగిగుళ్లు యీ భవనంలోపల ప్రేలడం చేత భవనానికి నిప్పు అంటుకుంది. అగ్నిజ్వాలలకి భవనం నాశనమయింది. గుట్టలు గుట్టలుగా కుప్పవేసిన రైఫిళ్లు ముక్కలు ముక్కలైపోవడమో లేక భవన శిధిలాలలో పాతుపడిపోవడమో జరిగింది. అందుచేత చాలామంది సైనికులు నిరాయుధులుగా వుండిపోవలసి వచ్చింది. ఫామీన్ ఆఫీసులో ఒక అగ్నికారిణి గుండు పడింది. ఆ ఘాటైన పొగకు సగం ఉక్కిరిబిక్కిరై పోయి ప్రాణాలతో బయటపడ్డాడు కమిస్సార్.

అతడు తక్షణమే రెజిమెంటు యూనిట్లకు నాయకత్వం వహించాడు. యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శి మతెవాస్యాన్ కమిస్సార్‌కు సహాయకుడుగా నిలిచాడు. తొలి తత్తర పాటును తటుకొనేందుకూ, సైనికులను సాయుధులుగా చేసి అంతకంటెనూ బాగా సురక్షితమైన నేలమాళిగలోకి చేర్చేందుకూ కొంత సమయం పట్టింది. సైనికులకు దేశభక్తి ధర్మాన్ని గుర్తుకు తెస్తూ, తమ సంపూర్ణ ధైర్యసాహసాలతో పోరాడమని ఫామీన్ యిక్కడ ఉపన్యసించాడు. ఆ తర్వాత ఫామీన్ ఆజ్ఞల ప్రకారం శత్రువులను బాయొనెట్లతో తొలి సారిగా ఎదుర్కొనేందుకై మతెవాస్యాన్ తన మనుషులను తీసుకువెళ్లాడు. ఆ దీవి తూర్పు కొనమీద యిదివరకే వారి డిటాచ్‌మెంటునుండి చీలగొట్టబడిన సబ్‌మెషీన్‌గన్నర్లను నాశనం చేశాడు.

ఈలోగా తిరిగి తెరేస్పొల్‌స్కి గేటువద్దకు పారిపోయినటువంటి గతావశేషులైన నాజీ డిటాచ్‌మెంటు తమ పటాలాన్నిక కలుసుకోలేమని తెలుసుకున్నారు. వారి తిరోగమన మార్గం దిగ్బంధమైపోయింది.

17 వ డిటాచ్‌మెంట్‌యొక్క మూడవ కమాండంట్ ఆఫీసూ, 9 వ సరిహద్దు చౌకీస్థానమూ తెరేస్పొల్‌స్కి గేటు సమీపంలోని భవనాలలో వున్నాయి. ఈ భవనాలకు వెనుక దుర్గనగరం ఆవరణకు అడ్డంగా ఒక పొడుగాటి రెండంతస్తుల భవనం వుంది. ఈ భవనంలో, యుద్ధం ప్రారంభమైన రాత్రిపూట యితర యూనిట్లలాగానే బహుకొద్ది పటాలాలు మాత్రమే తన అందుబాటులో వున్నటువంటి 333 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు బసచేసివుంది. ఒక్కడున్న పటాలాలలో రెజిమెంటల్ నాన్‌కమీషన్డ్ ఆఫీసర్ల కోర్సులో శిక్షణను పొందుతూన్నవారూ, బ్యాండువాద్యపు ప్లాటూనూ చేరి వున్నాయి.

మొదటి ఫిరంగి గుండ్లకే కమాండంటు ఆఫీసూ, సరిహద్దు చౌకీస్థానం ధ్వంసం అయిపోయాయి. చాలామంది సరిహద్దు పరిరక్షకసైనికులూ, ఆఫీసర్ల భార్యలూ పిల్లలూ వాటి శిధిలాలకింద బలియైపోయారు. 333 వ రెజిమెంటువారి బారకాసులు కూలిపోవడంవల్ల సగం దుస్తుల్తో వున్న ఇన్‌ఫెంట్రీ సైనికులు ఫిరంగిగుండ్ల తుఫానును తప్పించుకునేందుకై నేలమాళిగలకు పరుగెత్తారు. ఇతర చోట్లల్లా యిక్కడ కూడా యావత్తూ తొలి తత్తరపాటులో సంపూర్ణంగా మునిగి వుంది. తెరేస్పొల్‌స్కి గేటు నుండి దుర్గ ఆవరణలోకి ప్రవేశించిన జర్మన్ డిటాచ్‌మెంటుకు ఏ వైపునుండీ కూడా ప్రతిఘటన లేకుండా పోయింది.

కాని సబ్‌మెషీన్‌గన్నర్లు క్లబ్బును ఆక్రమించుకొని, దీవి తూర్పు కొనకు పురోగమించడానికి ప్రయత్నించగా కమిస్సార్ ఫొమీన్ సాగించిన



లెఫ్టినెంట్ అన్ద్రేయ్ కిజెవాతొవ్, 9 వ సరిహద్దు స్థానపు కమాండర్

బాయొనెట్ దాడి చెదిరిపోయిన సమయానికి తెరేస్పొల్‌స్కి గేటు వద్దనున్న పరిస్థితి కూడా మారి పోయింది.

సరిహద్దు పరిరక్షకులు తమ తొలి తత్తరపాటునుండి తెప్పరిల్లి లెఫ్టినెంట్ అన్ద్రేయ్ కిజెవాతొవ్ నాయకత్వాన సరిహద్దు స్థానపు శిధిలాలలో రక్షకస్థానాలను తీసుకొని నిలబడ్డారు. తమ సైనికులకు నాయకత్వం వహించేందుకని లెఫ్టినెంట్ అలెగ్జాండర్ సానిన్, సీనియర్ లెఫ్టినెంట్ పొతాపొవ్‌లు 333 వ రెజిమెంటు బారకాసులయొక్క నేలనూళిగలకు వెళ్లారు. సకాలంలో తమ బసలనుండి తప్పించుకున్న ఆడవాళ్లకీ పిల్లలకీ భద్రంగా ఆ భవనంకింద లోతుగా వున్న నేలమాళిగల్లో వసతినేర్పరచారు. రైఫిల్ సైనికులనూ మెషీన్‌గన్నర్లనూ కిటికీలవద్దనుంచారు. ఎప్పుడైతే 84 వ రెజిమెంటు మనుషులు చేసిన బాయొనెట్ దాడికి పలాయతులై, తరిమి కొట్టబడిన నాజీ డిటాచ్‌మెంటు గతావశేషాలు తెరేస్పొల్‌స్కి గేటువద్దకు తిరిగివచ్చాయో అప్పుడు వాటికి ఏ మరుగు దొరకక ఆ గేటు వద్ద కిజెవాతొవ్, పొతాపొవ్, సానిన్‌లయొక్క సైనికుల రైఫిళ్లకూ, మెషీన్ గన్‌లకూ అవి సరాసరి సూటిగా గురికావలసి వచ్చింది. బతికి బైట పడ్డ వాళ్లు మాత్రం క్లబ్బులో తలదాచుకున్నారు, ఎందువల్లనంటే ఒక అర

గంటక్రితం వారు ఏ రోడ్డుగుండా దుర్గం ఆవరణను ప్రవేశించారో ఆ రోడ్డు యిప్పుడు దిగ్బంధమైపోయింది.

ఇప్పుడు ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. సబ్‌మెషీన్‌గన్నర్లు దుర్గమధ్యభాగాన్ని ఛేదించుకొని దాని ప్రధానస్థానమైన క్లబ్బును వశపరచుకున్నారు. ఆ క్లబ్బు కిటికీలవద్దనుండి వారు తమ మెషీన్‌గన్‌లతో సోవియట్ రక్షక సైనికులను పీడించి వాళ్లని చెదరగొట్టేయగలిగే అవకాశం వారికిప్పుడు కలిగింది. కాని అదే సమయంలో వారు, తమ కమాండు నుండి విడిపోయినట్లూ, కేవలం రేడియోవల్లనే తమ కమాండుతో సంబంధం వున్నట్లూ, తమను సోవియట్ సైనికులు చుట్టు ముట్టేసినట్లూ అకస్మాత్తుగా తెలుసుకున్నారు. ఏమైతేనేం, తమకు తప్పకుండా విముక్తి కలుగుతుందనే వారు మంచి ధైర్యంగా వున్నారు. అందుకు కారణం జర్మన్ సేనలు ఆ దుర్గంపై క్షణక్షణానికీ అధికమవుతూన్న తీవ్రతతో తుఫాను దాడి సాగిస్తున్నాయి. శత్రుసైనికులు రణరంగంలోకి అంతులేకుండా దిగుతునే వున్నారు.

శత్రువుల కాల్బలం పడమరనుండీ తూర్పునుండీ పురోగమిస్తూ దుర్గాన్ని చుట్టుముట్టి సైనిక వలయాన్ని ఏర్పరచింది. శత్రువుల ఫిరంగి కాల్పులు కొనసాగుతూనే వున్నాయి. లెక్కలేనన్ని మంటలనుండి దట్టంగా పైకెగజిమ్మే పొగలమధ్య దుర్గానికి ఎగువనున్న గగనసీమలో నాజీ "యుంకర్స్" బాంబరు విమానాలు వలయాలు తిరుగుతూన్నాయి. సబ్‌మెషీన్ గన్నర్లు పశ్చిమ, దక్షిణ దీవుల్లో వుండడమే కాకుండా, దుర్గ ఆవరణ కేంద్రంలో ఉండడమే కాకుండా, వారు మట్టిగట్లును కూడా దాటి దుర్గ నగరపు ఉత్తర విభాగంలోకి వెళ్లారు. దుర్గంలో దాదాపు సగం శత్రువుల చేతుల్లోనే వుంది. మరి కొద్ది గంటల్లోనే పోరాటంయొక్క పర్యవసానం శత్రువులకు అనుకూలంగా వుండేట్లు అగుపించింది.

అయినా మధ్యదీవిలో ఏం జరిగిందో అదే యితర దుర్గ భాగాల్లో కూడా జరిగింది. గారిజన్ తన తొలి తత్తరపాటునుండి తెప్పరిల్లి శత్రువులని మొండి ధైర్యంతో తీవ్రంగా ఎదుర్కోవడం మొదలుపెట్టింది. శత్రువుల కాల్పులవల్ల ఎవరికి వారు చెదిరిపోయారన్నది నిజమే అయినప్పటికీ దుర్గ నగరం అన్ని విభాగాలలోనూ కూడా అదేవిధంగా శత్రువులను తీవ్రంగా ప్రతిఘటిస్తున్నారు; స్త్రీలనూ, పిల్లలనూ, క్షతగాత్రులనూ సురక్షిత స్థావరాలకు తీసుకెళ్లారు. సైనికులు స్వయంగా సాయుధులయ్యారు. ఆ క్షణాన అక్కడ వున్న ప్రతి జూనియర్ ఆఫీసరూ నాయకత్వం వహించి రక్షణను సంఘటిత పరిచాడు. అక్కడ గనక ఆఫిసర్లు లేకపోయినట్లైతే ఒక సార్జెంటుగానీ, ఒక సామాన్యసైనికుడుగానీ వెంటనే స్వయంగా నాయకత్వం వహించి తీరాడన్నమాటే. దాడి చేస్తూన్న సబ్‌మెషీన్‌గన్నర్లను గురి తప్పని రైఫిల్ కాల్పులూ మెషీన్‌గన్ కాల్పులూ, మట్టుపెట్టాయి. చాటుగా వుండి కాల్పులు సాగించేవారు హిట్లర్ ఆఫీసర్లను అనేకమందిని తమ తుపాకులకు ఎరగావించారు. క్లిష్టసమాయాలలో సోవియట్ ఇన్‌ఫెంట్రీ సైనికులు బాయొనెట్ దాడులు శత్రువులను విపరీతమైన నష్టాలకు గురిచేసి వారిని వెనుకకు తరిమివేశాయి.

మధ్యదుర్గాన్ని సమీపంచెందుకనీ, క్లబ్బుభవనంలో చిక్కుకొని వున్న తమ సబ్‌మెషీన్‌గన్నర్లను కాపాడుకొనేందుకూ పైబడుతూన్న శత్రు దాడి సైన్యాలు ఎన్ని ప్రయత్నాలు చేసినప్పటికీ వాటి పప్పులు వుడకలేదు. తెరే స్పోల్‌స్కి గేటు దగ్గర బూగ్ నది మీద వంతెన యిప్పుడు రైఫిల్‌కాల్పులకూ, మెషీన్‌గన్‌ల కాల్పులకూ గురైంది. సరిహద్దు పరిరక్షకులూ, 333 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటువారూ ఒక్క పురుగునైనా సరే ఆ వంతెన మీదుగా పోనివ్వడం లేదు. దక్షిణదీవి ఆస్పత్రిని వశపరచుకున్నాక హిట్లరు

సైనికులు హోల్మ్స్కి గేటుకు దారితీసే ముహవేత్స్ నదిమీది వంతెన మార్గంగా మధ్యఆవరణలోకి చొచ్చుకుపోవాలని ప్రయత్నించారు. కాని వంతెనకు సరిగ్గా ఎదురుగా వున్న వలయాకృతి బారకాసుల్లో 84 వ రెజిమెంటు వుంది. శత్రువులు దక్షిణ దీవినుండి దాడి సలిపే ప్రమాదాన్ని ముందుగానే వూహించిన కమిస్సార్ ఫొమీన్, తన మనుషులను ఆస్పత్రి ముఖంగా వున్న కిటికీలవద్ద సిద్ధంగా వుంచాడు. శత్రువుల సబ్మెషీన్గన్నర్లు వంతెనమీదుగా దాడిచేయడానికి ప్రయత్నించినప్పుడల్లా వారిని ఆ రైఫిల్ దళంవారూ మెషీన్గన్దళంవారూ అక్షరాలా తుడిచిపెట్టేసేవారు. శత్రువులు రోజంతా కూడా తమ ప్రయత్నాలని పదేపదే కొనసాగించినప్పటికీ, వంతెన హిట్లరు సైనికుల శవాలతో నిండిపోయినప్పటికీ శత్రువులు మాత్రం గేటును సమీపించ లేకపోయారు. ముహవేత్స్ నదిని రబ్బరు పడవల్లో దాటే విషయంలో కూడా శత్రువులు విఫలులయ్యారు. సబ్ మెషీన్గన్నర్లతో నింపిన డజన్లాది పడవలు సోవియట్ ఇన్ఫెంట్రీ దళం కాల్పులకు గురియై నదిలో మునిగిపోయాయి.

దుర్గంలోని గారిజన్కి వున్న శత్రుప్రతిఘటనాశక్తి క్రమక్రమేణా బలహీనమవడానికి బదులు ఎక్కువకెక్కువగా పట్టుదలనూ క్రమాన్ని కలిగి వుండడాన్నీ, దుర్గప్రదేశమంతటా శత్రువులను అడ్డగించే కేంద్రాలు మరింత అధికంగా తలయెత్తుతూండడాన్నీ చూసి నాజీ కమాండ్ విస్మయంతో విపరీతంగా రెచ్చిపోయింది. శత్రువశమైన పశ్చిమ, దక్షిణ దీవుల పైన సోవియట్ సరిహద్దురక్షక సైనికులను సబ్మెషీన్గన్నర్లు చుట్టుముట్టేసి ఛేదించివేస్తూన్నప్పటికీ వారింకా అలా తీవ్రమైన పోరాటాన్ని కొనసాగిస్తునే వున్నారు. పసుప్పచ్చని పైభాగంగల టోపీలు పెట్టుకున్న యీ సైనికులు ప్రాణాలొడ్డి పోరాడ్డంచేత శత్రువులకి విపరీతమైన



బ్రెస్ట్ దుర్గపు సరిహద్దు పరిరక్షకుల గ్రూపు

నష్టం కలిగింది. దాంతో నాజీ ఆఫీసర్లు పట్టరాని కోపావేశంతో, సరిహద్దు రక్షక సైనికుడెవడైనా సరే గాయపడినప్పటికీ కూడా ఆ సైనికుడిని ఖైదీగా పట్టుకోకుండా అక్కడికక్కడే తుపాకితో కాల్చి చంపివేయవలసిందిగా తమ పటాలాలను ఆజ్ఞాపించారు.

ఏమైతేనేం సరిహద్దు రక్షకసైనికులు మాత్రం యుద్ధంలో మరణించడమో లేక ఆత్మహత్య చేసుకోవడమో యీ రెండిటిలో ఏదో ఒకటి చేయడానికి సిద్ధపడ్డారే గాని ప్రాణాలతో శత్రువులకు లొంగిపోయి ఖైదీగా పట్టుబడటానికి ససేమిరా యిష్టపడలేదు. అలాంటి మరణమే పశ్చిమ దీవిపైన సిద్ధించింది బైలొరష్యన్ యువకుడైన సార్జెంట్ పెత్రీన్

చిక్కు. తాను గాయపడినప్పటికీ, శత్రువులు తనని చుట్టువేసినప్పటికీ అతడు ఒక శిథిలమైన భవనంలో దాగొని, తనకోసమని ఒక్క తూటాను అట్టిపెట్టుకొని మిగితా వాటన్నిటినీ శత్రువులపైకి గురి తప్పకుండా ప్రయోగిస్తూ చాలా సేపటివరకు పోరాడాడు.

ఆవిధంగా మరణించాడు ఒక అనామక సరిహద్దు రక్షకసైనికుడు. యుద్ధం ప్రారంభమైన నాటి రాత్రి, ఎక్కడైతే ఆ కిందటి రోజున యిద్దరు జర్మన్ గూఢచారులను దుర్గంలో ఖైదు చేశారో ఆ గది వెలుపల అతడు కావలిసైనికుని పనిమీద వున్నాడు. నాజీ ఫిరంగిగుండ్లు తన చుట్టూ పడుతున్నప్పటికీ అతడు మాత్రం తన స్థానాన్ని విడిచి ఒక అడుగైనా ఆవలికి వేయలేదు. ఎదురుగా సబ్‌మెషీన్‌గన్నర్లు అగుపించినప్పుడు మాత్రం అతడు వారితో పోరాటానికి తలపడ్డాడు. గదిలో బందీలై వున్న గూఢచారులు సహాయం చేయమంటూ గది తలుపుల్ని బాదడం మొదలుపెట్టారు. వాళ్లని చేరేందుకని దాడి చేస్తున్న ఆ హిట్లరు సైనికులు కూడా విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. సరిహద్దు రక్షకసైనికునివద్ద ఒకేఒక తూటాల సెట్టు మాత్రమే మిగిలి వుంది. ఇక శత్రువుల్ని ఆపలేనని ఎప్పుడైతే అతడు తెలుసుకున్నాడో ఆ మరుక్షణాన్నే అతడొక నిర్ణయానికొచ్చాడు. జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్లు లోపలికి తోసుకువచ్చారు. అక్కడ వారికి మూడు శవాలు అగుపించాయి. యువకుడైన పహరా సైనికుడు ఆ యిద్దరి గూఢచారుల్నీ చంపివేసి, తుపాకీని తన గుండెకు ఎక్కుపెట్టుకొని ఆత్మహత్య చేసుకున్నాడు.

దుర్గం ఉత్తర విభాగంలో మంచి రక్షణ ఏర్పాట్లు రూపొందాయి. అక్కడ చల్లాచెదరైన వివిధ యూనిట్లన్నీ 44 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు కమాండరైన మేజర్ గ్రవీలొవ్ నాయకత్వంకింద సమీకృతమయ్యాయి. ఎప్పుడైతే నాజీలు ఫిరంగితో ముట్టడి ప్రారంభించారో ఆ వెనువెంటనే

అతడు జబ్బుగా వున్న తన భార్యనూ, చిన్ని కొడుకునూ యింటివద్ద విడిచి తన రెజిమెంటు జెండానూ, రహస్య పత్రాలనూ కాపాడేందుకని హెడ్ క్వార్టర్సుకు పరుగెత్తాడు. మధ్యదీవిలోని వలయాకృతి బారకాసుల చిట్ట చివరి పశ్చిమ విభాగంలో రెజిమెంటు హెడ్‌క్వార్టర్సు వుంది. ముఖ్యంగా అక్కడే శత్రువుల కాల్పులు విపరీతంగా సాగుతూన్నాయి. గవ్రీలొవ్ అక్కడికి చేరుకొనేప్పటికే ఆ భవనం తగలబడిపోతూంది. ఆ మండిపోతున్న భవనాన్ని ఫిరంగిగుండ్లు యింకా తుత్తునియలు చేసివేస్తున్నాయేమో అతడు లోపలికి వెళ్లడమనేది అసంభవమని తేలిపోయింది. అప్పటికే జెండా, కాగితాలు ఆ జ్వాలల్లో దగ్ధమైపోయి వుంటాయనడంలో సందేహం లేదు. ఆవరణలో అటూ యిటూ వేగంగా పరుగెడుతోన్న సైనికులు సగం చీకటిలో, ఫిరంగిగుండ్ల ప్రేలుళ్లవల్ల లేచిన పొగమబ్బులూ ధూళిమేఘాల మధ్య కనబడుతున్నారు. ఎలాగో ఒక లాగున గవ్రీలొవ్ తన మనుషులను పాతిక మంది వరకూ సమీకరించుకొని, వారిని వంతెన మీదుగా బ్రెస్ట్ ఉత్తర పొలిమేరవైపు తీసుకువెళ్లాడు. ఆపత్యమయంలో మొత్తం రెజిమెంటును సమీకరించవలసిన చోటు అది.

కాని నాజీలు పట్టణానికి వెళ్లే రోడ్డును దిగ్బంధంచేసినట్లు తెలిసిపోయింది. సోవియట్ ఇన్‌ఫెంట్రీ సైనికులు ఉత్తరపు గేటువద్దనున్న మట్టిగట్లనూ, కందకం గట్టు పొడుగునా వున్న మట్టిగట్టునూ కాపాడుతున్నారు. నది ఆవలి గట్టున నాజీ. సబ్‌మెషీన్‌గన్నర్లు, పొదలు మాటున, అతి జాగరూకతతో కదులుతూన్నట్లు కనబడింది.

ఉత్తరపు గేటువద్ద కొన్ని వందలాది సోవియట్ సైకులు సమీకృతమయ్యారు. వారిలో యిద్దరు ముగ్గురు లెఫ్టినెంట్లూ రాజకీయ ఆర్గనైజర్లూ వున్నారు. సీనియర్ ఆఫీసర్లు లేనికారణాన, గవ్రీలొవ్ వివిధ

యూనిట్లనుండి యీ చల్లాచెదరైన గ్రూపులకు నాయకత్వం వహించి వారిని మూడు కంపెనీలుగా ఏర్పరచాడు. అతని ఆజ్ఞలు ప్రకారంగా ఆ ఇన్‌ఫెంట్రీ సైనికులు ఉత్తర, ఈశాన్యపు మట్టిగట్ల పైభాగాన తమతమ స్థానాలను తీసుకున్నారు. ఆ కంపెనీలలో ఒకటి పశ్చిమ దిశనుండి వస్తూన్న శత్రువుల దాడిని ఎదుర్కోవడానికై సంసిద్ధమైంది. అక్కడ నాజీ సబ్‌మెషీన్‌గన్నర్లు 125 వ రెజిమెంటుపై భయంకరంగా దెబ్బ తీస్తున్నారు.

ఈ రక్షణ విభాగం కేంద్రంలో, గేటువద్దకు దారితీసే రోడ్డుకు తూర్పువైపునా పడమటివైపునా, రెండు కోటలున్నాయి. ఈ రెంటినీ బలీయమైన స్థానాలుగా వుపయోగించుకోవచ్చు. ఒక్కొక్క కోటకీ గుర్రపు నాడెం ఆకృతిలో వున్న రెండు వెలుపలి ప్రాకారాలూ, ప్రతి కోటకూ వున్న రెండు ప్రాకారాల మధ్యనూ వున్నట్టి ఇరుకాటి ముంగిట్లోని లావుపాటి బురుజా, అసలు ప్రతి కోట ప్రాకారాలలోనే వున్న బలీయమైన బందిఖానా కొట్లూ — వీటిలో ప్రతి ఒక్కదానినీ ఒక పటిష్ఠమైన రక్షణ స్థానంగా ఉపయోగించుకోవచ్చు. తన కంపేనీలలో ఒక కంపెనీ పశ్చిమకోటను ఆక్రమించుకోవాలనీ, ఆ కోట సమీపంలో యిటీవలనే కట్టిన కాంక్రీటుకేంద్రం బ్లాక్‌హౌస్‌లో ఒక భారీ మెషీన్‌గన్నును నెలకొల్పాలనీ గవ్రీలొవ్ ఆజ్ఞాపించాడు.

తూర్పు కోటకు సంబంధించినంతవరకూ గవ్రీలొవ్ డిటాచ్‌మెంటు యొక్క రక్షణకు కీలకస్థానమైంది. సీనియర్ లెఫ్టినెంట్ ప్రషమ్‌కో నాయకత్వం కింద ఇప్పుడున్న ప్రత్యేక విమానవిధ్వంసక బటాలియన్‌కు చెందిన మనుషులతోనూ, లెఫ్టినెంట్ దమియేన్‌కొతోనూ, 125 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటుకు చెందిన లెఫ్టినెంట్ యాకొవ్ కొలొమీయెత్స్‌తోనూ ఏర్పడిన ఒక చిన్న గారిజన్ పటాలం ఈ కోటలో వున్నట్లు అప్పుడు తెలిసింది.

ఫిరంగిదళంవారు కోటమీది తమతమ కావలి స్థానాలకు వెళ్లి యుద్ధానికి సిద్ధంగా వున్నారు. కోట మొదటి అంతస్తుమీది ఫిరంగి బురుజుకున్న ఒక కానావద్ద ఒక విమానవిధ్వంసక భారీ మెషీన్‌గన్‌ను నెలకొల్పారు. ఇద్దరు మనుషులు అదనపు తోటాల పట్టాలను గబగబా మెషీన్‌గన్నులో పడుతున్నారు. ఇతర కానాలవద్ద లైట్ మెషీన్‌గన్‌లనూ, రైఫిళ్లనూ సిద్ధంగా వుంచారు. బాగా పనిచేస్తూ వున్న రేడియోట్రాన్స్మిటరూ, టెలిఫోన్లూ, అదనంగా వున్న ఎలెక్ట్రిక్ కేబులూ ఫిరంగి దళంవారి దగ్గర వున్నాయి. కోట గిడ్డంగిగదులలో ఆహారసామగ్రీ, మందుగుండు సామాన్లూ వున్నాయి. కోటవద్ద వున్న కందకాలలో రెండు విమానవిధ్వంసక ఫిరంగులు వున్నాయి. ఫిరంగి సైనికులు ఒక లెఫ్టినెంటు నాయకత్వంకింద త్వరత్వరగా ఆ రెండు ఫిరంగుల వద్దకూ చేరుకున్నారు.

ఫిరంగిదళానికి గవ్రీలొవ్ నాయకత్వం వహించి, యిదివరకు ఒక ప్రత్యేక సిగ్నల్స్ బటాలియన్‌కు కమాండరుగా వున్న కాప్టెన్ కాన్‌స్తన్‌తీన్ కసాత్కిన్‌యొక్క నాయకత్వంకింద కోటలో హెడ్‌క్వార్టర్సును నెలకొల్పాడు. కసాత్కిన్‌యొక్క బటాలియను బ్రెస్ట్‌కు వెలుపలవున్న క్యాంపులో వుంది. ఆ రాత్రి తన కుటుంబాన్ని చూసేందుకని కాప్టెను కోటలోకి వచ్చాడు. యుద్ధంమూలాన అక్కడతడు చిక్కుబడిపోయాడు. దుర్గపు గోడవెంట వెళ్లి తన బటాలియన్‌ను తిరిగి చేరడానికి ప్రయత్నించాడు. కాని పట్టణానికి వెళ్లే రోడ్డును జర్మన్లు వశపరచుకున్నారు. కాబట్టి కసాత్కిన్‌కు మేజర్ గవ్రీలొవ్ డిటాచ్‌మెంటును చేరడం తప్ప వేరే మార్గం అగుపడలేదు. అతడు ఎప్పుడైతే ఛీఫ్ ఆఫ్ స్టాఫ్‌గా నియమింపబడ్డాడో ఆ వెనువెంటనే కోట మధ్యగదులలోని ఒక గదిలో కమాండ్ స్థావరాన్ని నెలకొల్పాడు. విమానవిధ్వంసక బటాలియన్ సిగ్నలర్ల సహాయంతో

టెలిఫోన్ను ఏర్పాటు చేసుకొని మూడు కంపెనీలతోనూ సంబంధాలను ఏర్పరచుకున్నాడు. ఈలోగా గ్రవీలొవ్‌చే రెండవ నాయకునిగా నియమితుడైన రాజకీయ ఆర్గనైజరు స్కీప్నిక్ కోట రక్షక స్థానాలలో ఒక దానిలో ఆఫీసర్ల బసలలో వున్న ఆడవాళ్లకీ పిల్లలకీ స్థలం ఏర్పరచాడు. అక్కడ ఒక ఆస్పత్రిని కూడా పెట్టించి, దానిని అసిస్టెంట్ సర్జన్ రయీస అబకూమొవ ఆధీనంలో వుంచాడు.



కాప్టెన్ కొన్‌స్తన్‌తీన్ కసాత్కిన్, 1941

మేజర్ గ్రవీలొవ్ క్రింద వున్న చిన్న డిటాచ్‌మెంటు శత్రువులను ఎదుర్కొనేందుకై త్వరలోనే సిద్ధపడింది. ఒక గంట తర్వాత దాడి మొదలుపెట్టిన నాజీలు వెలుపలి గోడలనూ పశ్చిమ కోటనూ ఎదుర్కొన్నప్పుడు శక్తివంతమైన సోవియట్ కాల్పులకు గురి అయ్యారు. వారు యీ విభాగంపై చేసిన దాడులన్నీ కూడా విఫలమైపోయాయి.

దుర్గపు తూర్పు భాగంలోని కోబ్రిన్‌స్కి గేటువద్ద మొండి యుద్ధం సాగుతోంది. అక్కడ మేజర్ నికీతిన్ నాయకత్వంకింద 98 వ టాంకు విధ్వంసక ఫిరంగుల బటాలియన్ వుంది. మొదటినుండి కూడా శత్రువులు ప్రధానంగా యీ విభాగంపైనే విపరీతంగా కాల్పులను సాగించారు. అనేక ఫిరంగులూ, వాటి ట్రాక్టర్లూ నాశనమైపోవడమో లేదా పాడవడమో సంభవించింది. దీనికితోడు ఈ బటాలియన్ కమాండరు మరణించాడు.

ఆ యూనిట్ నాయకత్వాన్ని నికీతిన్‌యొక్క రాజకీయ సహాయకుడైన సీనియర్ రాజకీయ ఆర్గనైజరు నికొలాయ్ నెస్తెర్యూక్, బటాలియన్ చీఫ్ ఆఫ్ స్టాఫ్ లెఫ్టినెంట్ ఇవాన్ ఆకీమొచ్కిన్‌లు తీసుకున్నారు.

స్త్రీలకీ పిల్లలకీ మట్టిగట్లలోని కొట్లలో రక్షణ ఏర్పాట్లు కల్పించమని ఆజ్ఞలనొసగిన తర్వాత, మిగతా ఫిరంగులని మట్టిగోడమీదకి ఎక్కించవలసిందిగా నెస్తెర్యూక్, అకీమొచ్కిన్‌లు తమ సైనికులను ఆజ్ఞాపించారు. మందుగుండు సామాను సరఫరాను సంఘటిత పరిచారు. రక్షణకోసమై మెషీన్‌గన్నర్లనూ, రైఫిల్ సైనికులనూ వారివారి స్థానాలలో వుంచారు. ఎప్పుడైతే హిట్లరు సైనికులు దుర్గపు ఈశాన్యదిశను చుట్టివచ్చి కో(బిన్‌స్కి గేటుదగ్గర ప్రత్యక్షమయారో ఆ మరుక్షణాన్నే బటాలియన్‌యొక్క ఫిరంగులూ, మెషీన్‌గన్‌లూ ఎదురుగానే వున్న శత్రువులపై కాల్పులను సాగించాయి. శత్రువులు ఆగిపోవలసి వచ్చింది. వారి దాడులు ఒకటి తర్వాత ఒకటి సోవియట్ ఫిరంగుల నిర్దాక్షిణ్యమైన కాల్పులతో సమసిపోయాయి.

జూన్ 22 వ తేదీన సగంరోజంతా గంటగంటకూ తీవ్రస్వరూపం దాల్చుతున్న మొండియుద్ధం సాగింది. నాజీ ఫిరంగి దళంవారు ఎడతెగకుండా దుర్గముమీదికి ఫిరంగిగుండ్లను పంపుతూనే వున్నారు. ఎక్కడెక్కడైతే సోవియట్ సైన్యాలు ప్రతిఘటన కొనసాగిస్తున్నాయో ఆయా ప్రధాన కేంద్రాలపైన నాజీ "యుంకర్స్" విమానాలు ఏటవాలుగా కిందికి వచ్చి బాంబులు వేసి వెళ్లిపోయే పద్ధతి మొదలుపెట్టాయి. శత్రువుల కాల్పులాలు అన్ని విభాగాలపైనా దాడిచేస్తూనే వున్నాయి. కాని త్వరలోనే దాడిచేస్తున్న సైన్యాల నష్టం ఎంత భీకరంగా పెరిగిపోయిందంటే నాజీ కమాండ్ దృష్టి అటువైపు మళ్లక తప్పింది కాదు.

కొన్ని నెలల తర్వాత సోవియట్-జర్మన్ యుద్ధరంగపు విభాగాలలోని ఒక విభాగంలో 45 వ ఇన్‌ఫెంట్రీ డివిజన్ స్టాఫ్ పత్రాలను వశపరచుకోవడం జరిగింది. వాట్లలో "బ్రెస్ట్-లితోవ్స్క్‌ను పట్టుకొనే విషయమై యుద్ధ నివేదిక," అనే ఒక విచిత్రమైన పత్రం వుంది. బ్రెస్ట్ దుర్గం కొరకై జరిగిన యుద్ధంలో కొన్ని వివరాలు దానిలో వున్నాయి. యుద్ధం ఆరంభమైన నాడు దుర్గంలో ఏం జరిగిందీ శత్రువుల స్టాఫ్ ఆఫీసర్ల దృష్టిలో యీ క్రింది విధంగా వ్యక్తమౌతుంది.

ఆ నివేదికలో యిలా వుంది: "పురోగమిస్తున్న మన ఇన్‌ఫెంట్రీ వెనుక, దుర్గంలో వున్న 35 నుండి 40 వరకూ టాంకులనీ కవచశకటాలనూ ఉపయోగిస్తూ రష్యన్లు పట్టుదలతో మొండిగా ప్రతిఘటించడం మొదలుపెట్టారన్నది, అతిత్వరలోనే (ఉదయం 5.30, 7.30 గంటలకు మధ్య) స్పష్టమైపోయింది. చాటుగా వుండి కాల్పులు సాగించే సోవియట్ సైనికులు మిద్దెగది కిటికీలనుండీ, నేలమాళిగలనుండీ కాల్పులను అతి వేగంగా సాగిస్తున్నారేమో త్వరలోనే మన ఆఫీసర్లకూ, నాన్‌కమీషన్డ్ ఆఫీసర్లకు అపారమైన నష్టం కలిగింది.

"మధ్యాహ్నానికి ముందే దుర్గంలో జరుగుతున్న బాహాబాహి యుద్ధంలో మన ఫిరంగిదళం మద్దతు యివ్వడం అసంభవమని స్పష్టమైపోయింది. ఎందువల్లనంటే, మన ఇన్‌ఫెంట్రీ రష్యన్లకు ఎంతో దగ్గరగా వుంది. భవనాలు, పొదలు, కూలిపోయిన యిళ్లూ మొదలైన వాటితో చిక్కుచిక్కుగా వున్న ప్రదేశంలో మన శ్రేణి స్థానాన్ని నిర్ధారణ చేసుకోవడం దుస్సాధ్యమైంది. కొన్ని స్థలాలలో మన శ్రేణిని రష్యన్ ప్రతిఘటనా స్థావరాలు తెగగొట్టేశాయి. లేదా దిగ్బంధంగావించాయి. వ్యక్తిగత ఇన్‌ఫెంట్రీ టాంకు విధ్వంసన ఆయుధాలతోనూ, లైట్ ఫీల్డ్ ఫిరంగులతోనూ సరిగా గురిపెట్టే

పరికరాలను ఉపయోగించి కాల్పులు సాగించే ప్రయత్నాలు వ్యర్థమయ్యాయి. అందుకుకారణం పర్యవేక్షణ చేసేందుకు కావలసిన అవకాశం లేకపోవడమూ, తత్ఫలితంగా మన మనుషులకే ప్రమాదం ఏర్పడడమూనూ. రెండో కారణం దుర్గపు గోడలూ భవనాలు బాగా మందంగా వుండడమూ.

"మధ్యాహ్నం అయిన తర్వాత 135 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటు కమాండరు తనంతటికి తానే ఆ దారిని పోతూవున్న అస్సాల్ట్ ఫిరంగి బాటరీని ఆపి దానిచేత పనిచేయించాడన్న మాటేగాని పై కారణంవల్ల ఫలితం లేకుండా పోయింది.

"మధ్యాహ్నం ఒంటిగంటా పదిహేను నిముషాల [13.15] తర్వాత 133 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటుయొక్క తాజా సైన్యాలను (అంటే యిదివరకటి కోర్ రిజర్వు) దక్షిణ, పశ్చిమ దీవులపైన ఉపయోగించి నప్పటికీ పరిస్థితిలో ఏమార్పూ రాలేదు. ఎక్కడైతే రష్యన్లను తరిమికొట్టడం జరిగిందో, లేదా పొగతో ఉక్కిరిబిక్కిరి చేయడం జరిగిందో ఆ ప్రదేశంలో కొత్త సైన్యాలు ఏ నేలమాళిగనుండో, పెద్దపెద్ద పంపుగొట్టాల సందులనుండో, ఏ యితర రహస్యపు తావులనుండో పుట్టుకువచ్చేవి. వాటి గురి అద్భుతమైనటువంటిది. తత్ఫలితంగా మన నష్టాలు గణనీయంగా అధికమయ్యాయి.

"13.15 కు డివిజన్ కమాండరు 135 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటును (ఉత్తరదీవి) స్వయంగా తనఖీచేసిన తర్వాత దాడివల్ల దుర్గాన్ని పట్టుకోలేమనే నిశ్చయానికి వచ్చాడు. సుమారు 14.30 కు అతడు తన సైన్యాలను వెనకకు మళ్లించి వేసి దుర్గాన్ని నాలుగువైపులనుండీ చుట్టవేసేందుకూ, ఆ మర్నాడు (జూన్ 23 వ తేదీన) తెల్లవారు ఝామునుండి (అంటే రాత్రి తన సేనలను మళ్లించి వేసిన తర్వాత) రష్యన్లను

వారి సంఖ్య తరిగిపోయేట్టు నాశనంచేసే వుద్దేశంతో అతి జాగ్రత్తగా పర్యవేక్షించి సాగించబడే కాల్పులను దుర్గంపై కేంద్రీకరించేందుకని నిశ్చయించుకున్నాడు. ఈ నిశ్చయాన్ని 18.30 కు 4 వ సైన్యం కమాండ్‌వారు నిశ్చయంగా ఆమోదించారు..."

ఈ నివేదిక, దుర్గంకోసమై చేసిన మొదటి రోజు పోరాటదృశ్యాన్ని ఇంచుమించు ఉన్నది ఉన్నట్టుగా వివరించుతూంది. జర్మన్ స్టాఫ్ ఆఫీసర్లు తెలిపినట్టుగా దుర్గంయొక్క రక్షక సైన్యాలకు 35, లేదా 40 కంటే బాగా తక్కువే టాంకులూ, కవచశకటాలూ వున్నాయన్నది నిజమే, కాని దుర్గకుడ్యాలు బాగా మందంగా వుండడంవల్లనే ప్రధానమైన ఆటంకం కలిగిందనడం సరి కానేకాదు. ఆ చిన్న గారిజన్ సేనయొక్క అచంచల వీరోచిత ప్రతిఘటనే ఆ సేనయొక్క నిశ్చితమైన, నిపుణత్వంగల రక్షక చర్యలే యుద్ధం మొదటి రోజున నాజీ పటాలాలను దుర్గకుడ్యంవద్దనే నిలబెట్టేశాయి. కాగా, వాళ్లనక్కడ కేవలం నిలబెట్టడమే కాదు. రెండవ ప్రపంచ సంగ్రామంలో జర్మన్ పటాలాలు తిరోగమించ వలసిందిగా యిచ్చిన మొదటి ఆజ్ఞే జూన్ 22 వ తేదీన దాడి సైన్యాలు అందుకున్నటువంటి ఆజ్ఞ. పశ్చిమ, ఉత్తర, దక్షిణ యూరప్‌లో జర్మన్ సైన్యం ఒక్కనాడు కూడా తిరోగమించలేదు. అటువంటిది సోవియట్ యూనియన్‌కు ప్రతికూలంగా సాగించిన తూర్పు యుద్ధం ప్రథమ దినాన జర్మన్‌సైన్యం బ్రెస్ట్ దుర్గ ప్రాంతంలో తప్పనిసరిగా తిరోగమించవలసి వచ్చింది.

పైన తెలిపిన నివేదిక యింకా యీవిధంగా తెలుపుతోంది: "దుర్గంలోకి చొచ్చుకుపోయిన యూనిట్లు రాత్రికల్లా కమాండ్‌వారి ఆజ్ఞప్రకారమూ దిగ్బంధన శ్రేణివద్దకు మళ్లించివేయబడ్డాయి. అంతేకాకుండా, ఖాళీ చేసిన ప్రదేశాలపై రష్యన్లు వెనువెంటనే దాడిచేయడం అత్యంత అసహ్యమైన పని. ఆ సమయంలో ఒక జర్మన్‌సైనికుల జట్టు (ఇన్‌ఫెంట్రీ సైనికులూ,

సాప్పర్లు, వారి సంఖ్యలను ఎన్నడూ స్థిరపరచలేదు) మధ్యదీవిలోని దుర్గంలోని దేవాలయంలో చిక్కుకొనిపోయింది. అలా చిక్కుబడిపోయిన సైనికులు అప్పుడప్పుడు రేడియోద్వారా వర్తమానాలను పంపుతున్నారు.''

రేడియో సామాచార సంబంధాలు త్వరలోనే తెంచివేయబడ్డాయని కూడా ఇక్కడ అదనంగా చెప్పాల్సి వుంది. దుర్గంలోని గారిజన్ ఫాసిస్టులను ఎదుర్కోవడమే కాకుండా, ఫాసిస్టులు తిరోగమించిన ప్రదేశాలలో కందకాలని తవ్వుకుని స్థిరంగా నిలదొక్కుకోవడమే కాకుండా, చక్రబంధంలో ఇరుక్కున్న అనేక శత్రువుల జట్లను తుడిచిపెట్టివేసింది. మధ్యదీవిపైన ఫామీన్ మనుషులూ, పొతాపొవ్, కిజెవాతొవ్‌ల ఇన్‌ఫెంట్రీ సైనికులూ ఎక్కడైతే సబ్‌మెషీన్‌గన్నర్లు తమ రేడియో ట్రాన్స్మిటర్‌ను నెలకొల్పారో ఆ క్లబ్బు భవనంపై రెండు వైపులనుండి దెబ్బకొట్టారు. శత్రువుల ప్రతిఘటన శక్తి విచ్ఛిన్నమైపోయింది. ఆ క్లబ్బులో వున్న ఫాసిస్టు డిటాచ్‌మెంటు నాశనమైపోయింది.

మొదటి రోజున శత్రువులు దుర్గాన్ని కొద్ది గంటల్లోనే పట్టుకుంటామని అనుకున్నారే కాని, ఆ ప్రయత్నం విఫలమైపోవడమే కాకుండా శత్రువుల దాడి సైన్యాలు సగానికి సగమైపోయాయి. కొన్ని ప్రదేశాలలో చిత్తుగా ఓడిపోయాయి, లేదా తిరోగమించాయి. కేవలం దక్షిణ, పశ్చిమ దీవులు మాత్రం నాజీల చేతుల్లో వున్నాయి. అక్కడ కూడా సోవియట్ సరిహద్దు రక్షకసైనికుల జట్లు యింకా పోరాడుతూనే వున్నాయి. మిగతా దుర్గప్రదేశం యావత్తు బూడిదరంగుచాయ ఆకుపచ్చ యూనిఫారాలలో వున్న శవాలతో నిండిపోయింది. ఆ ప్రదేశం యింకా శత్రువుల కైవసంకా లేదు. ఇక్కడ సోవియట్ వీరులూ, వారి కమాండర్లూ రాత్రంతా నిద్రా విశ్రాంతీ లేకుండా తమ దుర్గనిర్మాణాలని బలీయంచేసుకుంటూ ఉదయంతో పాటు రానున్న శత్రువుల తాజా దాడిని ఎదుర్కోవడానికి సిద్ధమౌతున్నారు.

# యుద్ధరంగం ముందలి శ్రేణిలో

యుద్ధం మొట్టమొదటినుంచీ బ్రెస్ట్ దుర్గ రక్షకులు, రక్షణను నడిపించే కమాండర్లనుండి సామాన్యపు సైనికునిదాకా అందరూ ఒకే విధమైన భావంలో నిమగ్నమైపోయారు. ఇది లోతుగా వేళ్ళూనినట్టి అచంచలమైన విశ్వాసం. నమ్మకద్రోహంతలపెట్టి తమ దేశంపై దురాక్రమణ సాగించిన శత్రువులను త్వరలోనే పూర్తిగా ఓడించి, వారిని తమ దేశ సరిహద్దునుండి వెనకకు విసిరికొట్టాలనేదే ఆ భావం. బ్రెస్ట్ప్రదేశంలో నియమితమైవున్న సోవియట్ పటాలాలు, శత్రువులచే ముట్టడించి వేయబడిన యీ దుర్గం రక్షణార్థమై వస్తాయనీ, అవి సరిహద్దుని తప్పకుండా పూర్వస్థితికి తీసుకు వస్తాయనేదే ఆ అచంచలమైన విశ్వాసం.

సోవియట్ యూనియన్ పౌరులకు తమ మహత్తరమైన దేశం యొక్క బలమూ దాని సైనికశక్తీ బాగా తెలుసు. వారు సోవియట్ వీరుల విజయ సాంప్రదాయాలను ఉగ్గుపాలతోనే వొంట పట్టించుకున్నారు. వారు మరో విధంగా ఆలోచించరు. శత్రువుల బ్రహ్మాండమైన శక్తినిగానీ, హఠాత్తు దాడియొక్క అంతరార్థంనుగానీ వారు ఆ క్షణంలో తెలుసుకోలేకపోయారు. ఆ శిథిలమైపోయిన దుర్గం మళ్లీ సోవియట్ పటాలాలని చూసేలోగా మూడు సుదీర్ఘమైన సంవత్సరాలు గడిచిపోతాయని వాళ్లల్లో ఎవరైనా సరే ఆ రోజుల్లో ఒక క్షణం ఊహించుకోగలిగారా? హిట్లర్‌జర్మనీ దాడిని తిప్పికొట్టేందుకై సోవియట్ సైన్యానిక కొన్ని వారాలు, లేదా కొన్ని నెలలైనా (సంవత్సరాల మాట వొదిలేద్దాం) పట్టుతుందని ఆ యుద్ధం మొదటి రోజున ఆ దుర్గాన్ని రక్షించుతూన్న సైనికులలో ఎవడైనా చెప్ప

సాహసించినట్లైతే ఆ సైనికుని స్నేహితులు అతనిని పిచ్చివానిగా పరిగణించి వుండేవారు. లేదా పిరికిపందగానో దేశద్రోహిగానో పరిగణించి అతనిని అక్కడికక్కడే తుపాకితో కాల్చి చంపేసేవారు. ఏ క్షణాన్నైనా సరే తమకు బైటనుండి సహాయంవస్తుందని వారు ఎదురుచూశారు. త్వరలోనే తమ సొంత మనుషుల్ని చూడగలుగుతామన్న తలంపు వారి అసమానమైన పోరాటంలో వారికి ఒక నూతన శక్తిని ప్రసాదించింది. వారి మనోబలాన్నీ, నిశ్చయాన్నీ యినుమడింప చేసింది.

యుద్ధం తొలిగంటలలో జర్మన్ పటాలాలు ఆ దుర్గాన్ని చుట్టివేసి బయట ప్రపంచంతో దానికున్న సంబంధాన్ని తెగకొట్టేశాయి. ఆ దుర్గపు గోడల ఆవల ఏం జరుగుతున్నదీ, పట్టణంలో ఏం జరుగుతున్నదీ, చుట్టుపక్కలున్న సరిహద్దు జిల్లాలో ఏం జరుగుతున్నదీ ఆ రక్షణ సేనకు తెలియదు. వారి హెడ్‌క్వార్టర్సు బ్రెస్ట్ పట్టణంలో వుంది. ఇంతవరకు అక్కడ్నుంచి ఏ ఆదేశాలూ రాలేదు. బహుశ వార్తావహులుగానీ సమన్వయ శాఖ ఆఫీసర్లుగానీ దుర్గంలోకి రాలేని కారణంవల్ల కావచ్చు. టెలిఫోన్ టెలిగ్రాఫ్ తీగెలని నాజీ విధ్వంసకులు యుద్ధారంభానికి పూర్వమే తెగ గొట్టివేసి వుండొచ్చు, లేదా ఫిరంగిగుళ్ల వర్షానికి అవి దెబ్బతిని వుండొచ్చు.

మధ్యదీవి రక్షణకు నాయకత్వం వహిస్తోన్న ఆఫీసర్లు మొట్ట మొదట సీనియర్ హెడ్‌క్వార్టర్స్‌తో రేడియోద్వారా సంబంధాలను పెట్టు కోవడానికి ప్రయత్నించారు. కాని యూనిట్‌కి వున్న రేడియోసెట్లలో అనేకం ఫిరంగుల కాల్పులవల్ల నాశనమైపోవడమో, లేదా చెడిపోవడమో సంభవించింది. ఒక్క 84 వ రెజిమెంటు బారకాసులలో మాత్రం మధ్యా హ్నాంకల్లా ఒక రేడియో సెట్టును నెలకొల్పడం సాధ్యమయింది. ఆ బార కాసులలో, రెజిమెంటు సిగ్నల్ కంపెనీయొక్క ఉపకరణాలలోని ఒక భాగం

యింకా చెక్కుచెదరకుండానే వుంది. రెజిమెంటల్ కమిస్సార్ ఫామీన్ డివిజన్ హెడ్‌క్వార్టర్స్ కొరకై కొన్ని రేడియో సందేశాలను సాంకేతిక పదాలలో వ్రాసి యిచ్చి వాటిని తక్షణమే పంపవలసిందిగా ఆజ్ఞాపించాడు.



సిగ్నలర్ బి. మిహయ్‌లోవ్‌స్కి

కాని డివిజన్‌నుండిగానీ, మరి ఏ యితర రేడియో స్టేషన్ నుండిగానీ ఏవిధమైన సమాధానమూ రాలేదు. సాంకేతిక పదాలలో సందేశాన్ని పంపే ప్రయత్నాలన్నీ విఫలమైపోయాయి. ఫాసిస్టులు దుర్గాన్ని చుట్టుముట్టేయడమే కాకుండా వాయుమండలాన్ని కూడా స్వాధీన పరచుకున్నట్లగుపించింది. అన్ని ప్రసారతరంగదైర్ఘ్యాలపైనా ఖైంఖైమనే జర్మన్ గొంతుకతో ఉత్తరువులు వినబడడం ప్రారంభమైంది. అప్పుడప్పుడు మాత్రం ఎక్కడో టాంకు యుద్ధం చేస్తున్న మన టాంకుసైనికులయొక్క సంక్షిప్తమైన తీవ్రధ్వనులుగానీ, "యుంకర్స్," "మెస్సెర్‌ష్మిట్" విమానాలతో యుద్ధం చేస్తున్న మన వైమానికుల కేకలుగానీ పైప్రసారాలకు అంతరాయాన్ని కలిగించుతూండేవి.

సాంకేతిక పదాలలో వర్తమానాలను పంపడంవల్ల ప్రయోజనం లేదనీ మామూలు భాషలోనే పంపడం మంచిదని ఫామీన్ నిశ్చయించుకున్నాడు. తన వర్తమానాన్ని శత్రువులు అడ్డగించవచ్చుననే వాస్తవాన్ని

లెక్కలోకి తీసుకుంటూ అతడు అతిశయోక్తితో కూడిన ఆశాజనకమైన రేడియోవార్తను సిద్ధంచేశాడు. యువకమ్యూనిస్టు లీగ్ సభ్యుడైన సిగ్నలర్ మిహయ్‌లోవ్‌స్కి మళ్లీ మైక్రొఫోన్‌వద్ద కూర్చున్నాడు.

"ఇది దుర్గము. ఇది దుర్గము!" "మనం పోరాడుతున్నాం. మనకు మందుగుండు సామాను విరివిగా సరఫరా అవుతోంది. నష్టాలు బహుస్వల్పం. ఉత్తరవులకోసం ఎదురు చూస్తున్నాం. వర్తమానం సమాప్తి," అని కొత్త సందేశం గాలిలో ప్రతిధ్వనించింది.

ఈ మాటలని మిహయ్‌లోవ్‌స్కి పదేపదే పలికాడు. కాని సమాధానం లేదు. విద్యుత్ చ్ఛక్తి సరఫరా పూర్తిగా అయిపోయేంతవరకూ రేడియో ట్రాన్స్మిటర్ సిగ్నళ్లను పంపుతూనే వుంది. ఆ తర్వాత ఆ వీరోచితమైన దుర్గం కంఠం యిక ఆకాశంలో వినబడలేదు.

గ్రవీలొవ్ ఆజ్ఞప్రకారంగా సిగ్నళ్లు పంపుతూన్న తూర్పుకోట లోని రేడియో ఆపరేటరు కూడా అటువంటి పరాజయాన్నే పొందాడు. సమాధానమే లేదు. రేడియోద్వారా వర్తమానాలను పంపే ప్రయత్నాలన్నీ వ్యర్థమేనని మేజరు గుర్తించాడు. తన బ్యాటరీలను కాపాడేందుకని రేడియోసెట్ స్విచ్చిని ఆఫ్ చేయమని ఆజ్ఞాపించాడు. తాజా వార్తలను వినడానికి మాత్రమే ఆ సెట్టును ఉపయోగించేవాడు.

ఆ మొట్టమొదటి రోజున కొద్ది యూనిట్లకు మాత్రమే మంచి స్థితిలో వున్న రేడియోసెట్లు యింకా వున్నాయి. 98 వ టాంకు విధ్వంసక బటాలియన్ క్లబ్బులో ఒక సెట్టు వుంది. ఒకప్పుడు గిడ్డంగిగా వున్న భూగర్భపు కాంక్రీటు నేలమాళిగలో యిప్పుడా క్లబ్బువుంది. ఆఫీసర్ల భార్యలకు, కుటుంబాలకు వసతి కల్పించమని ఫిరంగిబటాలియన్ కొత్త కమాండరైన నెస్తెర్చ్యుక్ ఆజ్ఞాపించింది ఇక్కడే. ఈ చీకటి భూగర్భపు గదిలో, బటాలియన్ జెండాను పక్కనే పరిరక్షిస్తున్న ఎర్రసైనికుడు

సాకొలోవ్ నిశ్చేష్టుడై నిలిచాడు. అతని చుట్టూ స్త్రీలూ పిల్లలూ గందర గోళంగా నేలమీద గుమి కూడారు. మధ్యాహ్నం పూట, పైనుండి బద్ద లౌతోన్న గుళ్లశబ్దంలో హిట్లరు సోవియట్ యూనియన్‌పైకి దండెత్తా డన్న రేడియోవార్త బహుదూరంలో వున్న మాస్కోనుండి వినవచ్చింది.

మాస్కో రేడియోవార్తను తూర్పుకోటలోనివారూ, మధ్యదీవి మీదవున్న 333 వ రైఫిల్ రెజిమెంటు సిగ్నలర్లూ అందుకున్నారు. జనంతో క్రిక్కిరిసిపోయి వున్న ఆ నేలమాళిగలో, బాటరీ చాలా బలహీనంగా వుందేమో మాస్కో రేడియో అనౌన్సర్ గొంతు లీలగా వినిపించింది. అయినప్పటికీ కూడా సెట్టు చుట్టూ మూగిన సైనికులు ఊపిరిబిగపట్టి విన్నారా వార్తలని.

ఈలోగా, హెడ్‌క్వార్టర్స్‌తో సంబంధం పెట్టుకొనేందుకై యింకా ప్రయత్నాలు జరుగుతూనే వున్నాయి. పగలంతా కూడా కమాండర్లు దుర్గపు వివిధ భాగాలనుండి గస్తీదళాలసైనికులను పట్టణానికి వెళ్లవల సిందని ఆజ్ఞాపిస్తూ ఆ సైనికులను దుర్గం వెలుపలికి పంపారు. అనేక సందర్భాలలో ఈ గస్తీదళాలసైనికులు పూర్తిగా అలసిపోయి, ఎక్కడా సందులేకుండా దుర్గం చుట్టూ వున్న జర్మన్ కాల్బలాన్ని ఛేదించుకుని వెళ్లలేక తమ జట్లలో అనేకులను కోల్పోయి వెనక్కి తిరిగి వచ్చేశారు. ఇతరులు పత్తా తెలియేలేదు. పట్టణాన్ని చేరుకోవడం విషయంలో వ్యక్తి గతంగా స్వచ్ఛందసైనికులు విజయాన్ని చేపట్టినప్పటికీ వారు మళ్లీ వెనక్కి రాలేకపోయారు, తాము కనుగొన్న విశేషాలను నివేదించుకో లేకపోయారు.

మధ్యాహ్నం కవచశకటాల్లో గస్తీలను పట్టణానికి పంపాలని రెజిమెంటల్ కమిస్సార్ ఫోమీన్ నిశ్చయించుకున్నాడు.

శ్వేత భవనం బిల్డింగులు ఒక దానిలో ప్రత్యేకమైన రికన్నాయ్‌సెన్స్ బటాలియన్ వుంది. యుద్ధం ప్రారంభమైననాటి రాత్రి కొంతమంది

సైనికులు బటాలియన్ బారకాసుల్లో నిద్రపోతున్నారు. బాగు చేయడానికని తెచ్చిన ఏడు కవచశకటాలు వెలుపల గ్యారేజీలో వున్నాయి. బటాలియన్ సైనికుల యువకమ్యూనిస్టు లీగు కార్యదర్శి ఇప్పుడు నాయకత్వం వహించి, అతని ఆజ్ఞల ప్రకారం కొద్ది గంటల వ్యవధిలోనే అయిదు కవచశకటాలని పట్టుకొచ్చారు. మండిపోతూ పేలిపోతూన్న మందుసామను గిడ్డంగివద్ద వారున్న పక్షంలో తాము కూడా ఆకాశం ఎత్తుకు ఎగిరిపోయే ప్రమాదం వున్నప్పటికీ ప్రాణాలకు తెగించి వారు తమ శకటాలను ఫిరంగి గుళ్లతోనూ, తూటాలతోనూ నింపుకొని ఫామీన్‌కు నివేదించి అతని ఆజ్ఞలకోసం ఎదురు చూస్తూ ఆగారు.

ఆ సమయంలో కమిస్సార్ ఆ శ్వేత భవనం నేలమాళిగలో అంతకు ముందే ఖైదీగా పట్టుపడిన ఒక నాజీ ఆఫీసరును ప్రశ్నలు వేస్తూ కూర్చున్నాడు. ఆ ఖైదీ 45 వ ఇన్‌ఫెంట్రీ డివిజన్ గూఢచారి శాఖయొక్క లెఫ్టినెంట్-కర్నల్ అని తేలిసింది. అతని కాగితాలు పెట్టుకొనే పెట్టెలో, సోవియట్ హెడ్‌క్వార్టర్సు వారికి ఎంతో ఆసక్తి కలిగించే ముఖ్యమైన రహస్యపు పత్రాలు, దుర్గంయొక్క విపులమైన మ్యాపుతోపాటు వున్నాయి. ఈ కాగితాలను డివిజన్ హెడ్‌క్వార్టర్సుకు ఎలా పంపడమా అని ఆలోచిస్తున్న సమయంలోనే, కవచశకటాలు సిద్ధంగా వున్నాయనే నివేదిక అందింది. మూడు కవచశకటాలని శత్రుశ్రేణిని ఛేదించుకుని పట్టణానికి పంపాలనీ, యువకమ్యూనిస్టు లీగు కార్యదర్శీ, కమిస్సార్ క్రింద ఉపనాయకుడూ అయిన సహాయక రాజకీయ ఆర్గనైజరు మతెవొస్యాన్ వాటికి నాయకుడుగా వుండాలనీ నిర్ణయమయింది. పట్టుబడిన పత్రాలను హెడ్‌క్వార్టర్సుకు అందించే పనిని కూడా అతనిమీదే పెట్టాడు ఫామీన్.

ఈపాటికి మతెవొస్యాన్‌ను యిక సహాయక రాజకీయ ఆర్గనైజరుగా

పరిగణింపలేదు. అతనిని ఇప్పుడు రెజిమెంటల్ కమిస్సార్‌గానే పరిగ ణించారు. ఫామీన్ దగ్గర కాలర్ పట్టీలపై రెజిమెంటల్ కమిస్సార్ హోదా చిహ్నాలున్న కోటు ఒకటి అదనంగా వుంది. ఆ కోటు తొడుక్కోవలసిందిగా యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శిని ఆజ్ఞాపించాడు ఫామీన్. అందుకు మతెవొస్యాన్ తన అభ్యంతరం తెలపడానికి ప్రయత్నించగా దుర్గంలో చాలా కొద్దిమంది ఆఫీసర్లు మాత్రమే వున్నారనీ, తమమధ్య మరో సీనియర్ ఆఫీసరు వున్నాడంటే అక్కడి సైనికులకు యింకా ఎక్కువ ధైర్యం కలుగు తుందనీ ఫామీన్ విపులీకరించాడు. యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శికి తన నాయకుని ఆజ్ఞను పాలించడం తప్ప వేరే గత్యంతరం లేకపోయింది. ఆవిధంగా అకస్మాత్తుగా పైపదవికి వచ్చిన మతెవొస్యాన్ 84 వ రెజిమెంట్ యొక్క రక్షణ వ్యూహంలోని ఒక ప్రధాన విభాగానికి నాయకత్వం వహిం చాడు. ఇప్పుడతను ఫామీన్ ఒప్పగించిన మరో ప్రమాదకరమైనటువంటి బాధ్యతతో కూడిన పనిని నిర్వహించవలసి వుంది. అది డివిజన్ హెడ్ క్వార్టర్సుతో సంబంధాన్ని నెలకొల్పడం.

వారు ఒకరినుండి ఒకరు వీడ్కోలు చెప్పుకుంటున్నప్పుడు కమిస్సార్ ఫామీన్ యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శిని ఆప్యాయంగా కౌగలించుకున్నాడు. అన్నిటికంటే ముందున్న కార్లో కూర్చున్నాడు మతెవొస్యాన్. ఆ మూడు కవచశకటాలూ శత్రువుల కాల్పులమధ్య, వంతెనమీదుగా దుర్గం వెలుపలి ఉత్తరపు గేటువైపు శరవేగంతో పరుగెత్తాయి. కాని ఆ సమయంలో అక్కడి గేటు చుట్టూ యుద్ధం జోరుగా సాగుతోంది. ఆ గేటుకున్న సొరంగానికి అడ్డంగా దగ్ధమైపోతూన్న ఒక జర్మన్ శకటం వుంది. ఆ కవచశకటాలు మతెవొస్యాన్ ఆజ్ఞప్రకారంగా వాయవ్య దిశనున్న గేటువైపుకు మళ్లాయి. కాని అక్కడ కూడా అదే పరిస్థితి. ఇక మిగిలిందల్లా పట్టణానికి సమీపంలో

వున్న తూర్పు కోబ్రిన్స్కి గేటు మాత్రమే. తన కారును ఆ వైపుకు మళ్లించమని యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శి తన డ్రైవరును ఆజ్ఞాపించాడు.

ఆ గేటుకు వెళ్లేదార్లో 125 వ, 333 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంట్ల ఆఫీసర్ల బసలు వున్నాయి. ఆ భవనాల చుట్టూ జరుగుతోన్న యుద్ధాన్ని మతెవొస్యానూ, అతని మనుషులూ వీక్షించారు. జర్మన్ మెషీన్‌గన్నర్లు ఆ భవనాలమీదికి అర్ధచంద్రాకృతిలో పురోగమిస్తూ వాటి కిటికీలలోకి గుండ్ల వర్షాన్ని కురిపించి ధ్వంసం చేస్తున్నారు. ఆ భవనాలనుండి వచ్చే ప్రతిఘటన మాత్రం బహు నెమ్మదిగానూ, మితంగాను వుంది.

మన మూడు కవచశకటాలూ శత్రువుల వెనుక భాగం మీదికి లంఘించి వారిని తమ మెషీన్‌గన్‌లన్నిటితోనూ ఎదుర్కొన్నాయి. కొద్ది నిముషాల్లోనే ఫాసిస్టు డిటాచ్‌మెంటు నామరూపాలు లేకుండా ఎగిరి పోయింది. శత్రువులు ముట్టడించిన ఆ భవనాల కిటికీలనుండీ, దర్వాజాల నుండీ జనం తమను కాపాడిన వారివైపుకు ఆనందోత్సాహాలతో పరుగున వచ్చారు. వాళ్లల్లో బహు కొద్దిమంది ఆఫీసర్లూ, సైనికులూ మాత్రమే వున్నారు. మిగతా వాళ్లంతా స్త్రీలూ పిల్లలూనూ.

మతెవొస్యాన్ తన కారునుండి కిందికి దూకగానే మొదట ఒక యువతి అతనిని చేరుకుంది. ఆమె తొడుక్కున్న పూలపట్టు గౌను చినిగి పోయింది. ఆమె చెక్కిలిమీద గుండు దెబ్బ తగిలి, గాయంనుండి రక్తపు చుక్కలు బొటబొటా రాలుతున్నాయి. చేతిలో జర్మన్ సబ్‌మెషీన్‌గన్ వుంది. ఆమె వగర్చుతూ అతని చేయిని గట్టిగా పట్టుకుంది. అంతకుముందే జరిగిన సమరోద్వేగంతో ఆమె మనస్సు పొంగిపొరలుతూంది.



బ్రెస్ట్ దుర్గ రక్షకులు. పి. క్రివానోగొవ్ వర్ణచిత్రంనుండి

"కామ్రేడ్ కమిస్సార్, మేం ఏం చేయాలి? మా మందుగుండు సామాగ్రంతా దాదాపు అయిపోవచ్చింది!"

మిగతావాళ్లంతా యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శి చుట్టూ మూగి అతనిని దుర్గంలోని పరిస్థితిని గురించి ప్రశ్నలతో ముంచెత్తివేశారు. వాళ్లలో ఒక కాప్టెన్ వున్నాడు. అతని తలకి తగిలిన గాయానికి కట్టుకట్టి వుంది. ఆ కట్టునిండా రక్తపు మరకలే. వాళ్లల్లో, తమ పిల్లల్ని గట్టిగా గుండెలకు హత్తుకొని వున్న ఆడవాళ్లూ, ఆయుధాలను చేత పట్టుకొనివున్న యితర స్త్రీలూ, పొడుగాటి చెక్కపిడిగల జర్మన్ చేతిబాంబును పట్టుకొని వచ్చిన ఒక చిన్న కుర్రాడూ, రైఫిళ్లను ధరించినట్టి సగం నగ్నంగా వున్న సైనికులూ వున్నారు.

వీళ్లంతా కూడా మధ్యదీవిపై వున్న రక్షక హెడ్‌క్వార్టర్సుకు వెళ్తే చాలా మంచిదని మతెవొస్యాన్ సలహాచెప్పాడు. వాళ్లల్లో ధైర్యోత్సాహాలు కలిగేందుకై అతడు చెయ్యగలిగిందంతా చేశాడు. విమోచన సైన్యం త్వరలోనే రాగలదనీ, అది శత్రువులను ధ్వంసం చేసి వెనుకకు మళ్లించి వేస్తుందనీ అతడు ధైర్యంగా చెప్పాడు. కాప్టెన్‌ను ఆ సముదాయానికి పెద్దగా నియమించి తన కవచశకటంలోకి మళ్లీ వెళ్లి కూర్చున్నాడు. ఆ మూడు శకటాలూ పెద్దచప్పుడు చేసుకుంటూ కోబ్రిన్‌స్కి గేటువైపు వెళ్లిపోయాయి.

కాని అక్కడ కూడా యుద్ధం జరుగుతూనే వుంది. ఆ గేటుకడ్డంగా తుత్తునియలైపోయిన 98 వ ఆర్టిలరీ బటాలియన్ వారి ట్రాక్టర్లూ, ఫిరంగులూ వున్నాయి. దుర్గంలోంచి బైటకు వెళ్లేందుకు ఎక్కడా మార్గం లేదు. మతెవొస్యాన్ వెనకకు మళ్లాల్సి వచ్చింది. ఒక అరగంట తర్వాత ఆ

మూడు కవచశకటాలనీ తిరిగి శ్వేత భవనానికి తీసుకొచ్చి తన పరాజయాన్ని ఫొమీన్‌కు నివేదించుకున్నాడు.

రికన్నాయ్‌సెన్స్ ప్రయత్నాలను రాత్రివరకూ చేయకూడదని వారు నిర్ణయించుకున్నారు. యుద్ధం ఆగినప్పుడల్లా దుర్గంలోకి వినవచ్చే సుదూరపు సమరఘోషనుబట్టే పట్టణంలో ఏం జరుగుతున్నదీ, చుట్టుపట్ల ప్రదేశంలో ఏం జరుగుతున్నదీ గారిజన్ ప్రస్తుతానికి ఊహించుకోవడం తప్ప వారికి మరొక మార్గమేమీ లేకపోయింది. మొదటి రోజంతా కూడా ఒకప్పుడు సమీపంలోనూ మరొకప్పుడు దూరంలోనూ సమరగర్జన వినిపిస్తూనే వుంది. సోవియట్ సైన్యాలు సమీపిస్తున్నాయనే పుకార్లు దుర్గం చుట్టూ ప్రతిధ్వనించాయి. అవి దుర్గం సంరక్షకులను ద్విగుణీకృతమైన వుత్సాహంతో పోరాడేట్టు ఉత్తేజపరచాయి.

ఆ రోజంతా కూడా జర్మన్ విమానదళాలు గగనసీమను పరిపాలించాయనే చెప్పాలి. "యుంకర్స్" విమానాలు "డైవ్ బాంబ్" చేస్తూ ఏకధాటిగా దుర్గంమీద బాంబుల వర్షాన్ని కురిపించాయి. సోవియట్ ఫైటర్ విమానాలు మాత్రం రెండు మూడు సార్లు అగుపించాయి. శత్రువులు ఎప్పుడూ ఎంత లాభదాయకమైన స్థితిలో వున్నప్పటికీ, ఎప్పుడైతే సోవియట్ విమానాల రెక్కలపై ఎర్ర నక్షత్రాలు కనిపించాయో ఆ మరుక్షణంలోనే దుర్గం అంతా కూడా హర్షధ్వానాలతో నిండిపోయింది. ఆ రోజు ఉదయంపూట "చైక" రకం ఒక చిన్న సోవియట్ విమానం బ్రెస్ట్ విమానాశ్రయంపైన దానివద్దున్న మందుగుండు సామాగ్రంతా అయిపోవడంవల్ల హఠాత్తుగా ముందుకు లంఘించుకుని శత్రువు విమానాన్ని ఢీకొంది. ఆకాశంలో జరుగుతున్న యీ యుద్ధాన్ని గమనిస్తూ శ్వేత భవనం ఆవరణలో వున్న సైనికులు సోవియట్ పైలెట్ ధైర్యసాహసాలకు

ఆశ్చర్యపరవశులైపోయారు. ఆ పైలెట్ వీరోచితమైన మరణానికి ప్రతీకారం తీసుకోవడానికా అన్నట్టు వారు శత్రుస్థావరాలపై విపరీతంగా కాల్పులు కొనసాగించారు. ఒక అరగంట తర్వాత ఎప్పుడైతే తమస్థావరాలపై శత్రువుల విమానం బాంబులు వేయడానికి ఏటవాలుగా కిందికి దిగిందో ఆ తక్షణమే ఇన్‌ఫెంట్రీ సైనికులు ఆ విమానాన్ని అచలమైన రైఫిల్ కాల్పులతో ఎదుర్కొన్నారు. దాంతో ఆ విమానానికి నిప్పంటుకొని మండిపోతోంది. అది ఎలాగో పశ్చిమదీవి పైనున్న చెట్లను తప్పించుకుంటూ ఎక్కడో బూగ్ నది ఆవల బ్రద్దలైపోయింది. ఆవిధంగా, దేశభక్తియుత మహాసంగ్రామంలో శత్రువుల విమానాన్ని తన విమానంతో ఢీకొని పడగొట్టినటువంటి ప్రథమ వ్యక్తీ, ధీరుడూ అయిన ఆ పైలెట్ మరణానికి 84 వ రెజిమెంటు రైఫిల్ సైనికులు వెంటనే ప్రతీకారం తీసుకున్నారు. యుద్ధచరిత్రలో రైఫిల్ కాల్పులతో శత్రువుల విమానాన్ని పడగొట్టడంలో కూడా యీ రెజిమెంటువారిదే అగ్రతాంబూలం.

అదే రోజున మరో ఫాసిస్టు బాంబరు విమానాన్ని నేలకూల్చారు. ఈ సారి పడగొట్టింది విమాన విధ్వంసక ఫిరంగిదళం వారు. వారి ఫిరంగులు తూర్పుకోటకు సమీపంలోనే వున్నాయి. సూటిగా దెబ్బ తగిలిందేమో ఆ బ్రహ్మాండమైన విమానం అగ్నిజ్వాలల్లో ధ్వంసమైపోతూ ఆఫీసర్ల బసల వెనకాల పడిపోతూ వుంటే దుర్గరక్షకుల ఆనందానికీ వారి పొలికేకలకూ మేరలేకపోయింది. కాని మిగతా శత్రువిమానాలు విమానవిధ్వంసక ఫిరంగులున్న స్థావరాలపై తీవ్రంగా దాడి సలిపాయి. త్వరలోనే ఒక ఫిరంగి దెబ్బతిన్నది. ఆ ఫిరంగిచేత పనిచేయిస్తూన్న మనుషులు చాలామంది చనిపోయారు. వారి కమాండర్‌కి తీవ్రమైన గాయాలు తగిలాయి. అయినా అతడు ఫిరంగులవద్ద తన స్థానాన్ని మాత్రం విడవలేదు. ఎప్పుడైతే తమ

బాంబరు విమానం దెబ్బతిన్నదో అప్పటినుండీ శత్రువులు ఎక్కువ జాగ్రత్త పడ్డారు. వారు తమ విమానాలను ఎక్కువ ఎత్తులో నడిపించక తప్పింది కాదు.

ముట్టడి ఆగిపోతుందనే తీరని ఆశలతోనూ, ఊహలతోనూ మొదటి రోజంతా గడచిపోయింది. చీకటి పడటం మొదలవడంతోటే కమాండర్లు గస్తీదళాలను పట్టణానికి పంపే ప్రయత్నాలని మళ్లీ కొనసాగించారు.

కాని శత్రువులు మాత్రం తమ సైన్యాలని దుర్గపు గోడ వెనుకకు మళ్లించి ఏమరుపాటు లేకుండా వున్నారు. ముట్టడి శ్రేణి అంతటా మతా బీచువ్వలు నిరంతరం వెలుగుతూనే వున్నాయి. మట్టిగట్ల విస్తృత భాగ లాపైన సెర్చిలైట్లను ప్రసరించారు. దుర్గరక్షకులు ఎటు కదుల్తారో ఏమోనని శత్రువుల పర్యవేక్షకులు వేయికళ్లతో చూస్తున్నారు. మట్టి గట్లను దాటాలని వెళ్ళిన గస్తీ సైనికులలోని ఏ ఒక్కరి ప్రయత్నమూ విజయవంతం కాలేదు. ఎందువల్లనంటే వాళ్లు అడుగుపెట్టిన ప్రతిచోటా కూడా శత్రువుల తీవ్రమైన మెషీన్‌గన్ కాల్పులను వారు ఎదుర్కోవలసి వచ్చింది.

84 వ రెజిమెంట్ విభాగంలోని ఫొమీన్ చేతిక్రింద వున్న యిద్దరు స్కౌటు సైనికులు మధ్యదీవి తూర్పుకొననున్న నదిలోకి నెమ్మదిగా జారుకుని ముహవేత్స్ నదిని యీదారు. కాని వాళ్లు ఆవలి గట్టును చేరాల్సిన చోటుమీదికి తీవ్రమైన కాల్పులు సాగాయి. ఆ యిద్దరు స్కౌటు సైనికులూ మరణించి వుంటారనీ, లేదా శత్రువుల చేతుల్లో చిక్కి వుంటారనీ అంతా అనుకున్నారు. ఇంతట్లో యీ ప్రయత్నాలను ఆపు చేయాలని తల పోశాడు ఫొమీన్. అప్పుడు యువకమ్యూనిస్టు లీగ్ సభ్యుడైన మిహయ్‌లోవ్‌స్కి తెలివైన నీటి అడుగున రికన్నాయ్‌సెన్సు పద్ధతిని ఒక దానిని సూచించాడు.

కొంతమంది రెస్పిరేటర్లను ముఖాలకి తగిలించుకున్నారు. మెత్తని గాలిగొట్టాల్ని పెట్టెలనుండి విడదీసి అన్నిటినీ ఏక గొట్టంకిందకి కలిపారు. ఆ విధంగా ఏర్పడిన పెద్దపాడుగాటి గొట్టం చివర ఒక చిన్న తేలుడు చెక్క అమర్చారు. ఆ తర్వాత వాళ్ళు కాళ్లకు యిటికెరాళ్ళు కట్టుకొని జాగ్రత్తగా నదిలోకి దిగజారారు. తేలుడు చెక్కలవల్ల నీటిపైనవున్న గొట్టాలద్వారా గాలిని పీల్చుకుంటూ జారుడుగానూ ఎత్తుపల్లాలుగానూ వున్న నదీగర్భాన నడుచుకుంటూ ఏటికి ఎగువగా బయల్దేరారు. వారు అప్పుడే దుర్గం వెలుపలికి వచ్చేశారు. తమ రికన్నాయిసెన్స్ పనిని విజయవంతంగా సాగిస్తునామని తలపోశారు. కాని యింతలోకే నీళ్లల్లోని వారిదారికి అకస్మాత్తుగా అంతరాయం కలిగింది. ఒక దిట్టమైన యినుపతెర నదికి అడ్డంగా వుంది.

ఆ స్కాటు సైనికులలో ఒకడు నీటిపైకి వచ్చి ఆ యినుపతెరను దాటి వేద్దామని నిర్ణయించుకున్నాడు. కాని ఎప్పుడైతే అతని తల నీటిపైకి వచ్చిందో ఆమరుక్షణానే నిరంతరం మందుడుతోన్న మతాబీచువ్వల వెలుగులో కనపడిపోయింది. రెండు గట్టులనుండీ జర్మన్ల మెషీన్‌గన్‌లు టపాటపామని కాల్పులు సాగించాయి. ఈ యినుపతెరను అవేక్షించేందుకై ప్రత్యేకంగా మెషీన్‌గన్‌లను నెలకొల్పారనేది స్పష్టమైపోయింది. ఈ అడ్డంకిని దాటి ముందుకువెళ్లే అవకాశం లేదని ఆ స్కాటుసైనికులు గుర్తించి తమ స్థావరానికి తిరిగివచ్చేశారు.

ఆ యినుపతెర అక్కడికి ఎలా వచ్చిందో అక్కడ పట్టుబడిన జర్మన్ సైనికులద్వారా దుర్గరక్షకులకు ఆతర్వాత తెలిసింది. తాము ముట్టడించిన దుర్గపు గారిజన్‌కు నావలద్వారా అదనపు సహాయసేనలు ఎక్కడ వస్తాయో అని శత్రు కమాండ్‌వారు భయపడ్డారు. అందువల్లనే ఆ మొదటి రోజు

సాయంత్రాన జర్మన్ యింజనీర్లు యీ యినుపతెరను నదికి అడ్డుగా అమర్చి రెండు మెషీన్‌గన్‌లను కావలివుంచారు.

నీటి అడుగున వెళ్లినవాళ్లు తిరిగి వచ్చేశారూ అంటే పట్టణంతో సంబంధం పెట్టుకొనే ఆఖరి ఆశను వదలుకోవడమేనన్న విషయం స్పష్టమై పోయింది. సోవియట్ సైన్యాలు వెలుపలనుండి శత్రువుల ముట్టడిని ఛేదించేవరకు కూడా యిక చేయవలసింది ఏమీ లేదు. చాలా కొద్ది గంటల్లోనే యీవిధంగా జరుగుతుందని ఎవ్వరూ సందేహించలేదు.

ఆ రాత్రి గడిచిపోయింది. చక్కని ఎండతో నిండిన ఉదయం ఆ రాత్రిని అనుగమించింది. ఆ కిందటి రోజున పట్నంవైపునుండి భయం కరంగా వినవచ్చిన కాల్పుల గర్జన యిప్పుడు బాగా తగ్గిపోయి తూర్పున ఎక్కడో దూరాతిదూరాన ఉరముతూన్న శబ్దంవలె వినిపించీ వినిపించట్లు వుంది. ఆ రోజు అంత్యానికల్లా ఆ శబ్దం అసలకే ఆగిపోయింది. శత్రువులు బలవంతంగా త్రోవచేసుకొని పోతున్నట్లూ, యుద్ధశ్రేణి దుర్గంనుండి వెనుకకు మళ్లినట్లూ దుర్గరక్షకులు అర్థంచేసుకున్నారు. తిరోగమిస్తున్న సోవియట్ సైన్యాలు నెమ్మదిగా కోలుకొని ఎదురుదెబ్బ కొట్టేవరకు కూడా తాము చాలారోజులవరకూ పోరాడవలసి వుంటుందని దుర్గరక్షకులు ప్రథమ పర్యాయంగా గుర్తించడం మొదలుపెట్టారు. ప్రతివ్యక్తీ కూడా తాను యీ అసామాన్యమైన భయంకర పోరాటంలో ఒక విషమ పరీక్షను అనుభ వించవలసి వుంటుందని లోలోన నిశ్చయించుకుని అందుకు సన్నద్ధుడయాడు.

కాని అలాంటి విషయాలను ఆలోచించడానికి ఏమంత వ్యవధి లేదు. భళ్లున తెల్లవారేప్పటికల్లా మళ్లీ శత్రువుల ఫిరంగులు భయంకరంగా గర్జించాయి. నేలనున్న ఎరను తన్నుకుపోవాలని వచ్చే డేగవలె "యుంకర్స్" విమానాలు దుర్గం మీదికి వచ్చాయి. రాత్రంతా విశ్రాంతి తీసుకొని

యింకా అదనపు బలాలను కలుపుకున్న శత్రువుం అస్సాల్ట్ గ్రూపులు నూతన శక్తితో మళ్ళీ తమ దాడిని అన్నివైపులనుండీ కొనసాగించాయి. మీదికి వస్తున్న శత్రువులను వెనకకు వెళ్ళగొట్టుతూ నిలదొక్కుకుని వుండడమే దుర్గరక్షకుల ప్రధాన కర్తవ్యం. పోతే, ఫిరంగి బొంబార్డ్మెంటులకూ, తాజా దాడులకూ మధ్య వుండే స్వల్ప విరామసమాయాల్లో మాత్రమే వారికి తూర్పున బహుదూరంలో వినవచ్చే గర్జనని చెవులు నిక్కబొడుచు కొని వినే అవకాశం దొరికేది.

కాని బ్రెస్ట్ ప్రదేశంలోని యుద్ధరంగంలో రెండు రోజులబట్టీ విషాదాంత సంఘటనలు జరుగుతూన్నాయి.

యుద్ధం ఆరంభమైన బహుకొద్ది గంటల్లోనే బ్రెస్ట్పట్టణం శత్రువశమైంది. అరుణోదయంతోపాటే బాంబులు, ఫిరంగి గుండ్లూ వీధుల్లో బ్రద్దలయ్యాయి. అగ్నిజ్వాలల్లో భవనాలు నేలకూలాయి. జర్మన్ విధ్వంసకులు ఇంటి మిద్దెలనుండి కాల్పులను సాగిస్తున్నారు. విమానాలు బాగాకిందికి దిగుతూ పట్టణంనుండి పారిపోతున్న కాందిశీకులపై బాంబులు కురిపించాయి. సమాధి సంస్కారమెరుగని శవాలు రోడ్లపైన కుప్పలిప్పలుగా పడివున్నాయి. మ్యునిసిపల్ ఆస్పత్రి క్షతగాత్రులతో నిండి పోయింది. మ్యునిసిపల్ అధికార్లూ సైన్యపు హెడ్క్వార్టర్సువారూ కోబ్రిన్ వైపుకు తూర్పు దిశగా తమ కార్యస్థానాలను మళ్ళించవలసి వచ్చింది. ఏమైతేనేం త్వరలోనే పురోగమిస్తోన్న జర్మన్సైన్యాలు మాస్కో రోడ్డును అడ్డగించివేశాయి. ముహవేత్స్‌ను దాటినటువంటి జర్మన్ సబ్మెషీన్గన్నర్లు పట్టణం దక్షిణ జిల్లాలలో ప్రత్యక్షమయ్యారు. దగ్ధమైపోతూన్న వీధుల్లో జర్మన్ పటాలాలూ, వాటిచే జైళ్లనుండి విడుదల చేయబడిన అపరాధులూ పట్టపగ్గాలు లేకుండా హత్యాకాండనూ దోపిడీలనూ సాగించారు.

అక్కడక్కడా సాయుధులైన కమ్యూనిస్టుల గ్రూపులు ప్రతిఘట నను సంఘటిత పరచడానికి ప్రయత్నించాయే కాని జర్మన్ సబ్‌మెషీన్ గన్నర్లు వాటి ప్రయత్నాలని వెంటనే భగ్నం చేసివేయడమో, లేదా వాటిని నాశనం చేసివేయడమో జరిగింది. శత్రువులతో ఎంతో సేపు పోరాడితేనే గాని అణచివేయ శక్యంకాని ప్రతిఘటనా కేంద్రాలు పట్టణంలో రెండు మాత్రమే మిగిలిపోయాయి.

ప్రాంతీయ సైనిక కమిస్సారియట్ భవనంకోసం కొన్ని గంటల వరకూ యుద్ధం జరిగింది. ఉదయం పెందలకాడే ముప్ఫై నలభై మంది పార్టీ కార్యకర్తలూ, సోవియట్ సంస్థల కార్యకర్తలూ తమ కుటుంబాలను తీసుకొని కమిస్సారియట్ భవనంవద్దకు వచ్చారు. ఆయుధాలనూ, మందు గుండు సామానునూ తీసుకున్నారు. తలుపులనూ కిటికీలనూ తత్కాలి కంగా రక్షణకోసం మూసేసి అక్కడ క్రొటగడ్డలను నిర్మించుకున్నారు. ప్రాంతీయ సైనిక కమిస్సార్ స్తెఫియెవ్ నాయకత్వాన మగవాళ్ళంతా కూడా ఆ భవనం చుట్టూ రక్షణస్థావరాలను తీసుకున్నారు. ఫాసిస్టులు పట్టణంలోకి చొరబడటంతోటే సైనిక కమిస్సారియట్ భవనంపై దాడి చేశారు. హిట్లరు సైనికులు నేలమీద ప్రాకుకుంటూ భవనాన్ని సమీపించి కిటికీలగుండా చేతి బాంబులను విసిరారు. పైన వాలయకారంలో ఎగురుగు తూన్న "యుంకర్స్" విమానాలు ఆ భవనానికి చాలా ప్రమాదాన్ని కలిగించేంతటి దగ్గరగా బాంబులను వేశాయి. కొంతమంది భవనరక్షకులు మరణించారు. ఇతరులు గాయపడ్డారు. వాళ్ల గాయాలకు కట్టుకట్టేందుకు కూడా కమిస్సారియట్ డాక్టరుకు వ్యవధి చిక్కలేదు. తర్వాత కమిస్సార్ స్తెఫియెవ్‌కు ప్రమాదకరమైన గాయాలు తగిలాయి. అతనికి నిలబడేందుకే శక్తి లేకపోయినప్పటికీ కూడా యుద్ధాజ్ఞలను యింకా యిస్తూనే వున్నాడు.

ఆశలు వదలుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. మధ్యాహ్నం అయ్యేప్పటికి ఆ భవన రక్షకులు తమ స్త్రీలనూ పిల్లలనూ అక్కడనుండి బయటికి పంపించివేయాలని నిశ్చయించుకున్నారు. అలా చేసిన తర్వాత వారు తమ కంఠంలో ప్రాణం వున్నంతవరకూ పోరాడ దలచుకున్నారు. స్త్రీలు, పిల్లలూ తెల్లజెండాలు పట్టుకొని వెలుపలికి వచ్చారేకాని శత్రువుల సబ్‌మెషీన్‌గన్నర్లు వారిపై కాల్పులను సాగించారు. వాళ్లల్లో చాలామంది మరణించడమో, క్షతగాత్రులవడమో జరిగింది.

ఆ సాయంత్రంవరకూ కమిస్సారియట్ భవనంలోని మందు సామాగ్రి నిలవలు పూర్తిగా అయిపోయేంతవరకూ కూడా హిట్లరు సైనికులు కమిస్సారియట్ ప్రతిఘటనపై విజయాన్ని సాధించలేకపోయారు. కమిస్సార్ స్త్షేఫెయెవ్‌నూ యింకా యితర క్షతగాత్రులనూ అమానుషంగా హత్య చేశారు. కొంతమందిని ఖైదీలుగా పట్టుకున్నారు. బహుకొద్దిమంది మాత్రమే శత్రువలయాన్ని ఛేదించుకుని వెనుక సందులుగుండా పట్టణంనుండి తప్పించుకుని పారిపోగలిగారు.

కాని బ్రెస్ట్ పట్టణం ఉత్తర జిల్లాలోని రైలుస్టేషనువద్ద యింత కంటే తీవ్రమైన యుద్ధం జరిగింది.

జూన్ 21 వ తేదీ శనివారం సాయంత్రంపూట విమానదళానికి చెందిన ఒక చిన్న విభాగంవారు రైల్లో పృజాని నగరానికి వెళ్తూవెళ్తూ దార్లో బ్రెస్ట్ స్టేషన్‌లో దిగారు. వాళ్లంతా కలసి రెండు ప్లాటూన్‌లు సుమారు 50 మంది వుంటారు. వారి కమాండర్ సార్జెంట్-మేజర్ బాసావ్. వారిని మిలిటరీ కమాండంటు ఆ సాయంత్రం రైలుకి వారి గమ్య స్థానానికి పంపివేయలేదు. వాళ్లని ఆ రాత్రి రైలు స్టేషన్‌లోనే గడపమన్నాడు.



బ్రెస్ట్ రైల్వేస్టేషన్

బాంబులు పడడం ప్రారంభమవడంతోటే సార్జెంట్-మేజర్ బాసొవ్ తన మనుషుల హజరీని తీసుకొని, వాళ్ళని తూర్పువైపుకు వెళ్తొండే రైళ్లకు రక్షణ నిచ్చేందుకై స్టేషన్ చుట్టూ కావలి వుంచాడు. వినూన దళం సైనికులవద్ద చాలా కొద్ది తూటాలు మాత్రమే వున్నాయి. కాని సెమీమిలిటరీ రైల్వేరక్షణదళానికి చెందినట్టి మందుగుండు సామాగ్రిని స్టేషన్ అడుగున వున్న నేలమాళిగల్లో వున్నట్టు వారు కనుగొన్నారు. ఇప్పుడిక బాసొవ్ దళం చాలా సేపటివరకు శత్రువులధాటికి నిలబడగలు గుతుంది.

కొద్ది సేపటిలోనే యీ దళంవారితో బూగ్ నదినుండి తిరో గమించిన కొందరు సరిహద్దు రక్షకసైనికులు చేరారు. ఆ తర్వాత త్వరలోనే స్టేషన్‌కు వచ్చే రోడ్డుమీద హిట్లర్ మోటారుసైకిలు డిటాచ్‌మెంటు వారు కనిపించారు. స్టేషన్ పరిరక్షకులు శత్రువులని దగ్గరగా రానిచ్చి వాళ్లల్లో ఎక్కువమందిని తీవ్రమైన కాల్పులతో నాశనం చేసివేశారు.

సబ్ మెషీన్‌గన్నర్లతో వున్న కవచవాహకములు అనుసరించాయి. శత్రుసైన్యాలు కుప్పతిప్పలుగా వస్తూండడంవల్ల బాసావ్ చిన్నిపటాలం స్టేషన్ భవనంలోకి తిరోగమించవలసి వచ్చింది. తూర్పువైపుకు వెళ్ళే రైలులో ఎక్కి ప్రయాణంచేసే అవకాశం చిక్కుతుందేమోనన్న ఆశతో వందలాది కాందిశీకులు ఆ స్టేషన్‌లో గుమికూడారు.

ఫాసిస్టు విమానాలు రైలు స్టేషన్‌ను పైనున్న ఆకాశవీధిలో వలయాలు తిరుగుతూ బాంబులను వేయడం మొదలుపెట్టాయి. స్టేషన్ భవనం క్రమక్రమేణా ధ్వంసం అయిపోతోంది. ఇక అక్కడ నిల్చి ప్రతిఘటించడం అసంభవమని తేలిపోయింది, అయినప్పటికీ, బాంబుల దాడికి విశాలమైన నేలమాళిగలు మంచి రక్షణస్థలాలుగా వుండడమేకాకుండా సర్వతో ముఖ రక్షణావకాశాన్ని కూడా కల్పించాయి. బాసావ్ తన మెషీన్ గన్‌లనూ రైఫిల్ సైనికులనూ బేస్‌మెంటు కిటికీలవద్ద వుంచాడు. శత్రువులు ఆ భవనాన్ని దాడిచేసి ఆక్రమించడానికి ప్రయత్నించారే గాని రక్షకుల ధైర్యసాహసాలవల్లా, గురితప్పని కాల్పులవల్లా వారికి విపరీతమైన నష్టం సంభవించింది. ఆ స్టేషను నేలమాళిగలు ఒక చిన్న దుర్గంలాగా వుండడం వల్ల హిట్లరు సైన్యాలు యధావిధిగా ముట్టడిని ప్రారంభించక తప్పింది కాదు.

ఏమైతేనేం, రైలుస్టేషన్ రక్షకుల పరిస్థితి చాలా ప్రమాదకరంగానే తయారైంది. వాళ్ళందరికీ ఆహార పదార్థాలు బొత్తిగా లేవనే చెప్పాలి. పైగా స్టేషన్‌లోని భోజనశాలలో ఆహార పదార్థాలు బహు కొద్దిగా వున్నాయి. అవి అక్కడ వున్న జనానికి ఒక రోజుకైనా సరిపోవు. అందువల్ల అక్కడి సామాన్య ప్రజలంతా నేలమాళిగలలోనుంచి వచ్చేసి శత్రువులకు లొంగిపోవాలని సార్జెంట్-మేజర్ బాసావ్ నిశ్చయించాడు. ఆయుధాలనొసగి రక్షకుల శ్రేణుల్లో చేర్చుకున్న కమ్యూనిస్టులను మాత్రం మినహాయించారు.

ప్రయాసకరమూ సుదీర్ఘమూ అయిన పోరాటం మొదలైంది. హిట్లరు సైనికులు స్టేషన్‌లోకి చొరబడ్డారే గాని నేలమాళిగలను మాత్రం చేరలేకపోయారు. ప్రతి కన్నంనుండీ, ప్రతి మూలనుండీ శత్రువుల గమనాన్ని అతి జాగ్రత్తగా వీక్షిస్తున్నారు స్టేషన్ రక్షకులు. బాపావ్ మనుషుల తుపాకీగుండ్లకు ప్రతిరోజూ కూడా దురాక్రమణదారులు డజన కొద్దీ నేల కూలుతున్నారు.

స్టేషన్ రక్షకులు లొంగిపోవలసిందనీ వాళ్ల ప్రాణాలు కాపాడతామనీ నాజీ కమాండర్లు తమ లౌడ్‌స్పీకర్లద్వారా విజ్ఞప్తి చేశారు. కాని అందుకు ఒకటే సమాధానం — కాల్పుల పరంపర.

మూడో రోజునో, నాలుగో రోజునో ఫాసిస్టులు ఆ నేలమాళిగలను జలమయం చేసేయాలని ప్రయత్నించారు. నీళ్లగొట్టాలని తీసుకొచ్చారు. కాసేపట్లోనే బాపావ్, అతని మనుషులూ నడుములోతు నీళ్లల్లో వున్నారు. అయినా వారు కాల్పుల సాగించడం మాత్రం వదలిపెట్టలేదు. త్వరలోనే హిట్లరు సైనికులు తమ ప్రయత్నాన్ని వదలుకోక తప్పింది కాదు. ఎందువల్లనంటే పట్టణం నీటి సరఫరా యంత్రం చెడిపోయింది. నేలమట్టానికి నేలమాళిగలని నీళ్లతో నింపాలంటే దగ్గర్లో ఎక్కడా ఒక్క నీటిచుక్కైనా లేదు.

శత్రువులకు ఒక కొత్త ఆలోచన తట్టింది. నేలమాళిగల తలుపులనీ, గాలి లోపలికి వచ్చే యితర కన్నాలనీ పూర్తిగా దిగ్బంధం చేసిన తర్వాత ఆ నేలమాళిగల్లోకి విషవాయువుని బలవంతంగా చొప్పించారు. స్టేషన్ రక్షకులలో చాలా మంది యీ విషవాయుతో ఉక్కిరిబిక్కిరైనప్పటికీ, మిగతా వాళ్లంతా కూడా తమ అసమాన పోరాటాన్ని కొనసాగిస్తూనే వున్నారు.

ఆ నేలమాళిగలను పెట్రోలుతో నింపి నిప్పు అంటించాలని చేసిన ప్రయత్నం కూడా నిష్ఫలమైపోయింది. ఇక చిట్టచివరికి నాజీలు, స్టేషన్‌కు లారీలలో తెచ్చిన మలమూత్రాదులతో నిండిన మురికి కాలువ నీళ్లతో ఆ నేలమాళిగలను నింపేందుకు నిశ్చయించుకున్నారు.

ఆ పైశాచికయుద్ధం రెండువారాలుపైగా జరిగింది. దాదాపు పూర్తిగా అంధకారంగా వున్న ఆ నేలమాళిగల్లోని రక్షకులు ఆకలితో మల మల మాడి అలసిపోయివున్నప్పటికీ కూడా ఆ దుర్గంధపు మురికి నీళ్లల్లో ఏ నడుములోతునో, కంఠంలోతునో అతి ప్రయాసతో కదలాడుతూ వున్నారే గాని తమ రైఫిళ్లని మాత్రం ససేమిరా విడిచిపెట్టలేదు. లొంగి పొమ్మనమని కోరుతూన్న శత్రువులకు తమ కాల్పులద్వారా సమాధానం పంపించారు. యుద్ధ విరామ సమయాల్లో ఫిరంగుల కాల్పులధ్వానమూ, రైఫిళ్ల శబ్దమూ దుర్గంనుండి వినవస్తోంది. దగ్గర్లోనే వున్న తమ స్నేహితులు కూడా పట్టుదలతో కొనసాగిస్తున్న పోరాటాన్ని చెవులారా విని తామెంతా వేదనలో వున్నప్పటికీ నూతనోత్సాహాన్ని చేకూర్చుకున్నారు.

జులై తొలిరోజుల్లో బాసావ్, మరికొంతమంది మనుషులూ కలసి శత్రువలయాన్ని ఛేదించుకుపోవాలనే ప్రయత్నం చేశారు. తమను నాలుగు వైపులా దిగ్బంధం చేసేందుకని హిట్లరు సైనికులు మూసివేసి బారికేడు చేసిన ద్వారాలలో ఒకదానిని రాత్రిపూట బద్దలుకొట్టి నేలమాళిగల్లో నుంచి హాలులోకి వచ్చారు. అక్కడ చేతిబాంబులు బద్దలౌతున్న ధ్వనీ తుపాకి కాల్పుల శబ్దమూ నేలమాళిగల్లో వుండిపోయిన మిగతా మనుషులకు వినిపించింది. పైకి వెళ్లిన వాళ్లల్లో ఒక్కరూ వెనక్కి తిరిగి రాలేదు. బా వ్, అతని మనుషులు శత్రువుల వలయాన్ని ఛేదించుకుని వెళ్లిపోయారో లేక అక్కడే మరణించారో ఎవరికీ తెలియదు.

జూలై పది నాటికి బహుకొద్దిమంది మాత్రమే నేలమాళిగల్లో సజీవులై వున్నారు. ఒకనాటి రాత్రి ఈ కట్టకడపటి పరిరక్షకులు నేలమాళిగల్లో చనిపోయిన బ్రెస్ట్ నగరవాసుల మృతదేహాలనుండి వారు తొడుగుకొనున్న పౌరదుస్తులను తీసివేసి, ఆ దుస్తులను తాము వేసుకుని, నేలమాళిగలల్లోనుంచి అతిజాగ్రత్తగా పైకివచ్చేసి, రాత్రి అంధకారం మాటున శత్రువలయంలోనుంచి చల్లగా బయటికి జారుకుని, అడవుల్లోనూ చిత్తడి నేలల్లోనూ పడి, తూర్పుదిశగా మార్గంచేసుకుని, ఎలాగైతేనేమి చిట్టచివరకు యుద్ధశ్రేణిని చేరుకున్నారు. ఆ వీరోచితమైన పోరాటం ఆవిధంగా అంతమైంది.

ఈలోగా, యుద్ధరంగం రోజురోజుకూ అంతకంతకు మరీ ఎక్కువ దూరానికి పురోగమించుతోంది. అప్పుడే కొత్తగా యుద్ధంలో సమీకృతులైనవాళ్లు సోవియట్ పటాలాల్లో ఎక్కువగా వుండడంవల్లనూ, వాళ్లకి యుద్ధరంగం కొత్త అవడంవల్లనూ శత్రువులు అకస్మాత్తుగా జరిపిన దాడికి వారి మనోనిబ్బరం దెబ్బతింది. అద్భుతంగా సాయుధులై, యుద్ధాలలో పోరిపోరి రాటుతేలిన జర్మన్ సైన్యాలధాటికి వారు నిలబడలేక పోయారు. వ్యక్తిగతంగా కొన్ని యూనిట్లూ, పటాలాల శ్రేణులూ పట్టుదలతో ఎంతో ప్రతిఘటనను కొనసాగించినప్పటికీ, యుద్ధరంగం ముందలి శ్రేణిలో ఒకప్పుడు ఒక చోటా మరొక్కప్పుడు మరొక చోటా లొంగిపోవడం సంభవించింది. తిరోగమిస్తున్న సైన్యాలను శత్రువులు చుట్టివేశారు. గుడేరియన్, గోట్ట్‌ల డివిజన్లు అప్పటికే సోవియట్ సైన్యాల పృష్ఠభాగంలోకి లోతుగా చొచ్చుకుపోయాయి. ఈ జర్మన్ డివిజన్లు తాము పన్నిన పటకారు వ్యూహంలో సరిహద్దు ప్రదేశంనుండి తిరోగమిస్తూ, దారిపొడుగునా పోరాడుతూ వచ్చిన సోవియట్ బలాలను ఇరికించి నొక్కిపారేయడానికి

ప్రయత్నించాయి. ప్రతిరోజూ శత్రుసైన్యాలు దేశం లోలోతులకు చొచ్చుక పోతూన్నాయి. శత్రువులని నిలువరించేందుకు అనేక నెలలుపట్టింది. అందుకు కమ్యూనిస్టు పార్టీ, సైన్యం, సోవియట్ ప్రజలు – వీరందరి యావత్తు బలమూ, యావత్తు మనోనిబ్బరమూ అవసరమైంది. ఇక చిట్టచివరకు తూర్పున దూరాతిదూరాన మాస్కో గేట్లనే శత్రువు సమీపించాడనగా, అప్పుడు మాత్రమే శత్రువును ఆపే కార్యంలో కృతకృత్యులయారు. అప్పటికి చలికాలం రానేవచ్చేసింది.

కాని, దరిమిలా సోవియట్ సైన్యానికి లభించిన విజయాలవలె మాస్కోవద్ద లభింపనున్న భవిష్యత్ విజయానికి బైలొరష్యా, బాల్టిక్ తీరం, యుక్రేనియా 1941 వ సంవత్సరపు ఆ విషాదపూరిత గడ్డపై గడచిన వీరోచిత దివసాలే నిర్దిష్టమైన రూపురేఖలను మలచాయి. అలా మలచినది ఎవరా అంటే యుద్ధంలో వీరస్వర్గం అలంకరించిన అనామకులైన వందలాది వేలాది అమరవీరులే. వారు తమను చుట్టుముట్టేసిన శత్రువులతో భయంకరంగా పోరాడారు. శత్రువుల వెనుక భాగంగుండా ముందరి శ్రేణికి మార్గం చేసుకుంటూ యుద్ధం చేశారు. వారు సైన్య పృష్ఠ భాగాన్ని రక్షించే చర్యలలో పాల్గొని శత్రువులతో ప్రాణాలకు తెగించి యుద్ధం చేస్తూ ఆ సేనారాశితోపాటే దేశం మధ్యభాగానికి తిరోగమించారు. వారి తూటాలు, గ్రెనేడ్లూ, వారి ఫిరంగిగుళ్ళూ నేలబాంబులూ, వారు శత్రువులపై జరిపిన ప్రతీకార సంఘాతములూ, యివన్నీ కూడా దాడిజరుపుతూన్న తొలి లక్షలాది విదేశ దురాక్రమణదారులను – అంటే హిట్లరు సైన్యంలోని శ్రేష్ఠాతిశ్రేష్ఠ భాగాన్ని – నాశనం చేసివేశాయి. ఆవిధంగా ఆ అనామకులైన వీరాధివీరులు భవిష్యత్ విజయానికి బలమైన పునాదిని వేశారు.

అపారమైన ఆ యుద్ధశ్రేణి పొడుగునా వారు పోరాటాన్ని కొన

సాగించడమేకాకుండా, పురోగమించిన జర్మన్ టాంకు డివిజన్లు చేరిన టువంటి శ్రేణులు మొదలుకొని సరాసరి వెనుకనున్న సరిహద్దు ప్రదేశాల వరకూ కూడా పోరాటాన్ని కొనసాగించారు. ఆ సరిహద్దు ప్రాంతాలవద్ద శత్రువులు చుట్టివేసిన సోవియట్ సైన్యాలు యింకా పోరాడుతూనే వున్నాయి. అక్కడ తొలి పార్టిజాన్ దళాలు అప్పటికప్పుడే యుద్ధచర్యలు సిద్ధం చేసుకుంటూ వున్నాయి.

బూగ్ నది గట్టుమీద వున్న ప్రాచీన రష్యన్ దుర్గకుడ్యాల వెనుక నిలిచిన ఆ చిన్న గారిజన్ పటాలం, బ్రహ్మాండమైన సోవియట్ భూమి యొక్క ఆ యుద్ధశ్రేణి చౌకీస్థానం, మన రక్షణకు మొట్టమొదటి కోటబురుజు అనుపమానమైన పట్టుదలతో, ధైర్యసాహసాలతో శత్రువును ఎదుర్కొంటోంది.

# రేయింబవళ్లు యుద్ధం

ఆ మొదటి రాత్రంతా కూడా మతాబీచువ్వలు విరజిమ్మినట్టి ప్రకాశమానమైన మునిమాపు వెలుగులో దుర్గంలోనివారు తమ పనిని నిశ్శబ్దంగా దీక్షతో కొనసాగించుకుంటూనే వున్నారు. శత్రువుల ఫిరంగి దళం అప్పుడప్పుడు కాల్పులను సాగించి వారికి విసుగుపుట్టిస్తూంది. సబ్ మెషీన్‌గన్నర్లు తమ దాడులు ఆపుచేశారు. కొన్ని విభాగాలలో జర్మన్లు తమ పటాలాలను దుర్గపు మట్టిగట్లు ఆవలివరకూ మళ్లించేశారు. ఆ మర్నాడు శత్రువులు యింకా ఎక్కువ తీవ్రంగా పోరాడుతారన్న విషయాన్ని గుర్తించిన దుర్గరక్షణసేన కమాండర్లు ఈ విరామసమయాన్ని అవకాశంగా తీసుకొని,

తమ రక్షణ స్థావరాలని తనఖీచేసి తమ మనుషుల్ని వారి వారి స్థావ రాలలో వుంచి, తమవద్దనున్న నిలవలనుబట్టి మందుగుండు సామాగ్రినీ, ఆయుధాలనీ పంచిపెట్టారు. మరణించిన తమ స్నేహితులని మనసైనికులు ఎండకు ఎండి రణజ్వాలలకు మండిపోయిన పొడిమట్టిలో గబగబా సమాధి చేశారు. నేలకొరిగిన శత్రుపటాలాలనుండి ఆయుధాలనూ, మందుగుండు సామాగ్రినీ సేకరించారు. శిథిలమైపోయిన ఆయుధశాలలనుండీ గిడ్డంగుల నుండీ కొత్త ఆయుధాలను తవ్వి బయటికి తీశారు.

ఆ పగటిపూట దుర్గంలో, శత్రువుల మెషీన్‌గన్నర్ల కాల్పుల కారణంగా చీలిపోయిన యిరుగుపొరుగు యూనిట్లు యిప్పుడు తమ రాకపోకలను తిరిగి ఆరంభించగలిగాయి. అంతేకాకుండా ఆ మర్నాడు సమన్వయ పరచి జరుపదలచుకున్న తమ యుద్ధ పథకాలను కూడా సిద్ధంచేసుకో గలిగారు. వలయాకృతి బారకాసుల ఉత్తర విభాగాన్ని బహుకొద్దిమందితో పరిరక్షిస్తోన్న 455 వ రైఫిల్ రెజిమెంటు లెఫ్టినెంట్ అనతోలియ్ వినోగ్రాదొవ్ రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్‌తో సంబంధాన్ని ఏర్పరచుకు న్నాడు. మధ్యదీవియొక్క పశ్చిమ భాగంలోని 44 వ రెజిమెంటుకు ఒప్పగించిన రక్షణవిభాగానికి నాయకత్వం వహించిన కాప్టెన్ ఇవాన్ జుబచోవ్ కూడా ఫొమీన్‌వద్దకు వార్తావహుని పంపాడు.

చీకటి పడటంతోటే తెరెస్పొల్‌స్కి గేటువద్ద సోవియట్ పటాలను పునస్సమీకరించడం జరిగింది. లెఫ్టినెంట్ కిజెవాతొవ్ నాయకత్వంకింద వున్న సరిహద్దు రక్షకులు శిథిలమైపోయిన తమ చౌకీలను విడిచిపెట్టేసి 333 వ ఇన్‌ఫెంట్రీ రెజిమెంటుతో కలసిపోయారు. అప్పుడు ఈ విభాగ

రక్షణకు నాయకత్వం వహించ డంలో లెఫ్టినెంట్లు పాతాపొవ్, సానిన్‌లతో అన్‌ద్రేయ్ కిజెవాతొవ్ సహకరించాడు. ఆ రాత్రి కమాండర్లు తమ వార్తావహులను 84 వ రెజిమెంటు వున్నవైపు పంపారు. శ్వేత భవనంలోని నేల మాళిగలో తన హెడ్‌క్వార్టర్సును నెలకొల్పిన రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్‌తో త్వరలోనే టెలిఫోన్ తీగెద్వారా వారు సంబంధం ఏర్పరచు కున్నారు. కాని వాస్తవానికి ఆ టెలిఫోను సంబంధం ఏమంత నమ్మకమైంది కాదు, అసలు ఆ టెలిఫోన్ తీగె ఎంతోకాలం వుండలేదు. ఆ మర్నాడే దుర్గనగరం ఆవరణలో జర్మన్ల ఫిరంగి గుండ్ల ప్రేలుడులకి అది అలా తెగిపోతూనే వుంది కూడా.



కాప్టెన్ ఇవాన్ జుబచోవ్

శత్రువులు చీకటి మాటున నెమ్మదిగా ప్రాకుకుంటూ వచ్చి అకస్మాత్తుగా దాడిచేస్తారేమోనని అలసిపోయిన దుర్గరక్షకులు ఒకరి తర్వాత ఒకరు ఒక్కొక్క కునుకే తీస్తూ జాగ్రత్తగా కనిపెట్టుతూ ఉండడం చేత వారు ఆ రాత్రంతా సరిగా నిద్రపోలేదనే చెప్పాలి. కాని ఆ రాత్రి శత్రువుల కమాండర్లు, పగలంతా యుద్ధంచేసి డస్సిపోయిన తమ కాల్బలాలకు విశ్రాంతి నొసగాలని నిశ్చయించుకున్నారన్నది స్పష్టంగా అగుపిస్తోంది. శత్రువులు, తమ అస్సాల్ట్ డిటాచ్‌మెంట్లలో మనుషులు

తగ్గిపోయిన కారణంగా వాటిలో కొత్త బలగాలను చేర్చి, కొత్తసైన్యాలను తీసుకువచ్చి, క్షతగాత్రులను ఖాళీచేయించారు. వారు కూడా మరణించిన సైనికులను సమాధిచేశారు. గతరాత్రితో ఆ రాత్రిని పోల్చిచూస్తే ఎంతో ప్రశాంతంగా గడచిపోయిందనే చెప్పాలి.

కాని తెల్లవారేప్పటికల్లా మళ్లీ యుద్ధం ద్విగుణీకృతశక్తితో ఆరంభమైంది. తూర్పున ప్రభాతభాను కిరణాలు తళతళా మెరిసీమెరవడంతోటే దుర్గంచుట్టూ నిలబెట్టిన శత్రు ఫిరంగులు గుండ్ల వర్షాన్ని దుర్గ వలయంలోకి కురిపించి వేశాయి. పైనుండి నేలకు సమీపంగా వచ్చి బాంబులు వేసే డైవ్ బాంబర్ విమానాలు పెద్ద కూత పెట్టుకుంటూ దుర్గ రక్షకులమీద బాంబులను వేశాయి. మళ్లీ అక్కడ ప్రతీదీ పొగతో నిండిపోయింది. మళ్లీ వివిధస్థలాలలో మంటలు ప్రజ్వరిల్లాయి. రైఫిళ్లూ మెషీన్ గన్‌లూ యుద్ధశ్రేణి అంతటా రణగణధ్వనులు చేశాయి. దుర్గంపై తుఫానుడాడిచేయడం మళ్లీ కొత్తగా ప్రారంభమైంది.

క్రిందటి రోజువలె సబ్‌మెషీన్‌గన్నర్లు గ్రూపులుగా మళ్లీ దుర్గపు మట్టిగట్లను దాటి, దుర్గం ఉత్తర విభాగంలోకి చొచ్చుకువచ్చారు. పట్టిన పట్టువిడవకుండా మధ్యదీవిపై పదేపదే దాడి చేశారు. శత్రుసేనలు ముహవేత్స్ నది ఉత్తరతీరాన్ని ఆక్రమించుకుని మూడు ఆర్చీలగేటుకు దారితీసేవంతెనకు రెండు వైపులా వున్న పొదలలో తమ స్థానాలను ఏర్పరచుకున్నాయి. బారకాసుల కిటికీలపైకీ, కాల్వులను సాగించే నరదలమీదికీ ఇక్కడనుండి వారి మెషీన్‌గన్‌లతో ఎడతెగకుండా కాల్పులను సాగించాయి. మెషీన్‌గన్నర్లు అనేకమార్లు ముహవేత్స్‌నది పాయను దాటి వెళ్లి మధ్యదీవి తూర్పు కొనపైన కాలు నిలదొక్కుకున్నారు. కమిస్సార్ ఫామీన్ యీ విభాగరక్షణా బాధ్యతను మతెవొస్యాన్‌కు వొప్పచెప్పాడు. అతడు యిప్పుడు

తన బాయొనెట్ దాడులను శ్వేత భవనం గోడ వెనుకనుండి సాగించాడు.

ఆ కాల్పుల ఉరుములలో శత్రుమూకలను ఎదుర్కోవలసిందనే సంకేతాన్ని తెలుపుతూన్న బిగులు కూత ప్రతిధ్వనిస్తోంది. బ్యాగ్లరూ, డ్రమ్మరూ వీళ్లిద్దరూ, శత్రువులమీదికి వెళ్తున్న కాల్బలాలతో పురోగమిస్తూన్నప్పుడు మెషీన్‌గన్‌ల పేలుడు శబ్దాలకి లయగా నగారా కర్కశధ్వనితో మ్రోగుతూండేది. కళ్లులోతుకుపోయి, భయంకరమైన ముఖాలతో వున్న మనుషులు, ధూళిధూమాలతో నిండిపోయి, పొగవల్లా నిద్రలేకపోవడంవల్లా చింత నిప్పులవలె మండిపోతున్న కళ్లతో శత్రువులకు హడలు పుట్టించారు. వారి ఉత్సాహపూరితమైన హర్షధ్వానాలు, భయంకరమైన బాయొనెట్ల పోదుపులూ శత్రువులను కాలికి బుద్ధి చెప్పేట్టు చేశాయి. శత్రువులు మధ్య దీవి ఈశాన్య కొనను ఆక్రమించుకోవాలని చేసిన ప్రయత్నాలన్నీ కూడా అనేకమంది సబ్‌మెషీన్‌గన్నర్ల చావుతో అంతమైయ్యాయి.

శత్రువులు హోల్మ్‌స్కి గేటుగుండా దక్షిణ దీవినుండి బారకాసులను ఎదుర్కోవడం కొనసాగిస్తూనే వున్నారు. కాని వీళ్ల దాడికి కమిస్సార్ ఫొమీన్ మనుషులు క్రిందికిటికీల నుండీనూ, పై అంతస్తుల కిటికీలనుండీనూ గురితప్పని కాల్పులతో సమాధానం చెబుతున్నారు. వీళ్లకిప్పుడు మెషీన్ గన్‌లూ, రైఫిళ్లే కాకుండా ఇతర ఆయుధాలు కూడా వున్నాయి. బొంబార్డ్మెంటును తప్పించుకున్న ఒక మందుగుండు గిడ్డంగిలో సబ్‌మెషీన్‌గన్‌ల కుప్ప ఒకటి కనిపించింది. వాటిని వెంటనే కొంత మంది ఇన్‌ఫెంట్రీ సైనికులకి యిచ్చారు. రెజిమెంటల్ ఫిరంగిదళంవారు ఈ మందుగుండు గిడ్డంగిలో మోర్టార్ గుళ్లు కొద్దిగా నిల్వ వున్నట్టు కనుగొన్నారు. వారు అప్పుడు కిటికీలగుండా, ఆస్పత్రికి సమీపంలో వున్న శత్రుస్థావరాలపైకి



బ్యూగ్లర్ పేత్య క్లీప, 1941

కాల్పులను సాగించారు. ఒక విధమైన కాల్పుల పోటీ జరుగుతోంది. శత్రువులు స్వస్తిక చిహ్నంతో వున్న ఒక పెద్ద పతాకాన్ని ఆస్పత్రి భవనం పైకప్పుమీద ఎగరవేశారేమో సోవియట్ ఫిరంగిదళంవారు ఆ జెండా మీదికి కాల్పులు సాగించారు. నాజీలు ఆ జెండాను రెండు పర్యాయాలు ఎగరవేశారు. ఆ రెండు పర్యాయాలో కూడా సోవియట్ ఫిరంగిదళంవారు ఆ జెండాను నేలకూల్చారు.

ఆ రోజున 333 వ రెజిమెంటుకు సబ్‌మెషీన్‌గన్‌లూ, మోర్‌టార్‌లూ సరఫరా అయ్యాయి. ఆ కిందటి రోజున యీ రెజిమెంటువారి మందుగుండు సామాగ్రంతా దాదాపు అయిపోయిందనే చెప్పవచ్చు. వీరు రాత్రిపూట బహుకొద్దిపాటి జర్మన్ సబ్‌మెషీన్‌గన్‌లనూ తూటాల పెట్లనూ సంపాదించగలిగారు. కాని యివి సరిపోవు. కాబట్టి యీ యుద్ధ సామాగ్రి అయిపోవడంతోటే ఏంచేయవలసి వుంటుందా అని వీరు భయపడ్డారు.

ఈ విషమపరిస్థితిని రెజిమెంట్ బ్యాండు దళంలో బిగుల్బువూదే వానిగా పనిచేస్తున్న పేత్య క్లీప అనే కుర్రాడు కాపాడాడు.

పేత్య వయసు పథ్నాలుగు సంవత్సరాలు. కాని పొట్టిగావుండి పది పన్నెండేళ్లు మించని కుర్రాడిలాగా అగుపించేవాడు. అతడు కుశాగ్రబుద్ధి,

చీమమిరపకాయలాంటి కుర్రాడూ, ధైర్యశాలీ అవడంచేత రెజిమెంటులోని వాళ్లందరికీ కూడా అతనంటే ఎంతో అంత ప్రేమ.

అతని తండ్రి బ్ర్యాన్స్క్ నగరవాసి, అయిన దీర్ఘానుభవంగల కమ్యూనిస్టు, రైల్వే కార్మికుడు. చిన్నతనంలోనే తండ్రిని కోల్పోయిన పేత్య తన పెద్ద అన్నలతో కూడా కలిసి వుండాలని చెప్పి, వెళ్లిపోయి సైన్యంలో చేరాడు. అతని అన్న లెఫ్టినెంట్ నికొలాయ్ క్లీప రెజిమెంటు బ్యాండు దళానికి కమాండరు. బిగిలువూదే వానిగా చేరాడు పేత్య. చిన్నవయసులోనే తాను ఎర్ర సైన్యపు కొత్త దుస్తులను ధరించగలుగుతున్నాననే చిన్నకుర్రాళ్లకుండే సహజగర్వంతో పేత్య ఆ యూనిఫారంను ధరించి, అసలైన సైనిక హుందాతనంతో అందరివద్దకూ వెళ్లేవాడు. దుర్గంలోని వాళ్లంతా కూడా చమత్కారంగా మాట్లాడే ఆ చిన్న సైనికుని ఎరుగుదురు. ఆ కుర్రాడంటే వాళ్లంతా అతి ఆపేక్ష పడేవారు.

శనివారం సాయంత్రం లెఫ్టినెంట్ నికొలాయ్ క్లీప ఎప్పటిలాగానే దుర్గంవెలుపల వున్న తన బసకు వెళ్లిపోయాడు. యుద్ధం ఆరంభమైనప్పుడు అతడు తన యూనిట్‌ని చేర లేకపోయాడు. అదృష్టవశాత్తు, రెజిమెంటు దత్తపుత్రుడైన తన స్నేహితుడు పదహారు సంవత్సరాల యీడుగల కోల్య నోవికొవ్‌తో పేత్య బ్యాండుమనుషుల బారకాసులలో ఆ రాత్రి గడిపాడు. హిట్లరు సైన్యాలు దాడిజరిపిన నాటి రాత్రి వాళ్లిద్దరూ కూడా దుర్గంలోనే వున్నారు.

పేత్య కళ్లు తెరచి తన చుట్టూ ఏం జరుగుతోందో చూసేప్పటి కల్లా ఫిరంగిగుళ్లు బ్రద్దలౌతున్నాయి. ఒక ఫిరంగిగుండు ప్రేలుడికి అతడు మొదటి కొద్ది నిముషాలవరకూ మ్రాన్పడి పోయినప్పటికీ ధైర్యాన్ని మాత్రం కోల్పోలేదు. అతడు సగంసగం దుస్తుల్ని మాత్రమే తొడుక్కొని, ముఖంమీద

నెత్తురు వున్నప్పటికీ లెక్కించక శత్రువులను ఎదిరించేందుకని ఎంత పట్టుదలతో తుపాకీని పట్టేందుకు ఎంత త్వరగా తయారుపడ్డాడంటే ఆఫీసర్లంతా కూడా మతులు తప్పిన పెద్దవాళ్లకు అతనిని ఆదర్శప్రాయునిగా చూపించారు.

ఫిరంగి గుండ్లపేలుడు ఫలితంగా కలిగిన అదురునుండి అతడు త్వరలోనే తెప్పరిల్లి తన కమాండరు ఆజ్ఞలని శిరసావహించాడు. అతడు పై అంతస్తు కిటికీవద్ద నక్కుకొని వుండి శత్రువుల కదలికలను కనిపెట్టుతూ వాటిని లెఫ్టినెంట్ సానిన్‌కు నివేదించాడు. అతనిని గస్తీపనిమీద వెలుపలికి పంపినప్పుడు సర్వసాధారణంగా అతడు తన పాతస్నేహితుడు కోల్యా నోవికొవ్ తోపాటు అత్యంత ప్రమాదకరమైన విభాగాలలోకి దారిచేసుకొని వెళ్ళేవాడు. హిట్లరు సైనికులు దుర్గనగరంలోకి చొరబడి ముఖాముఖి పోరాడుతున్న ప్పుడు పేత్య కూడా తనకంటే పెద్దవయసుగల ఆ శత్రువులతో ధైర్యంగా పోరాడాడు.

రెండో రోజు ప్రభాత సమయంలో కుర్రాళ్లిద్దరూ కలసి సీనియర్ లెఫ్టినెంట్ పొతాపొవ్ దగ్గరకెళ్ళి, తమకు రికన్నాయ్‌సెన్సు పనిని యివ్వ వలసిందని అడిగారు. అతడు వాళ్లని బూగ్ నది గట్టుమీద శత్రువుల మెషీన్‌గన్ స్థావరాలగురించి భోగట్టా కనుక్కొనే పనిపైన పంపించాడు.

పేత్య నేలమాళిగలగుండా తెరేస్పోల్‌స్కి గేటు కనిపించే ఒక కిటికీ వద్దకు చేరుకున్నాడు. తన స్నేహితుడ్ని లోపలే ఉంచేసి అతిజాగ్రత్తగా కిటికీనుండి ఆవలికి దిగాడు. గేటును చేరాలంటే అతడు సుమారు పదిహేను గజాలమేరకు వెల్లడి జాగాగూండా పరుగెత్తవలసివుంటుంది. అతడు శర వేగంతో గేటువద్దకు దూసుకుపోయాడు. కాని ఆ గేటు బురుజుపైనుండి ఒక మెషీన్‌గన్ కాల్పులు సాగించింది. అతడు వెనకకు తిరిగితే లాభంలే

పరిస్థితి అది. గేటుపక్కనే, బాగా సమీపంలో వున్న ఒక బారకాసు గేటు గుమ్మంలోకి మెరపులాగా పరుగెత్తి అందులోకి దూరిపోయాడు పేత్య.

ఆ బిల్డింగు సరిహద్దు పరిరక్షకుల అశ్వశాల అని స్పష్టమైంది. గుర్రపు సాలలన్నీ ఒకదానితో ఒకటి వరసగా కలిసి ఒకేఒక పొడుగాటి షెడ్డు లాగా వున్నాయి, షెడ్డు మధ్యను ఏకంగా ఒక నడవ వుంది. దీవి పశ్చిమ కొనకు వెళ్తూ ఒక సాలనుండి మరొక సాలకు దాటుతూన్నప్పుడు పేత్యకు అకస్మాత్తుగా ఆయుధాలూ, మందుగుండూ మొదలైన యుద్ధసామాగ్రి గల స్టోరు గది కనిపించింది. బాగా గ్రీజు పులిమిన కొత్త సబ్‌మెషీన్‌గన్‌లు (వాటిని యిటీవలనే దుర్గముకు తీసుకొచ్చారు) చక్కగా అరలమీద వున్నాయి. తూటాలు, చేతిబాంబులు, మోర్‌టార్ గుండ్ల పెట్టెలు ఒక దానిపై ఒకటి పేర్చివున్నాయి. ఆ స్టోరు సరాసరి శత్రువులకభిముఖంగా వున్న బార కాసు పశ్చిమ కట్టకొనను వున్నప్పటికీ కూడా ఏదో అదృష్టవశాత్తూ ఏప్రమాదానికీ లోనుగాకుండా చెక్కుచెదరకుండా వుండి పోయింది.

పేత్య సంతోషంతో తన స్నేహితునిదగ్గరకు పరుగెత్తాడు. ఆ తర్వాత అయిదు నిముషాలకు వాళ్లిద్దరూ కూడా తాము కనుగొన్న విష యాన్ని తమ కమాండర్‌కు నివేదించారు. తక్షణమే కొంత సేనావిభాగాన్ని ఆ యుద్ధసామాగ్రిని తెచ్చేందుకై నియోగించారు. యుద్ధసామాగ్రిని తెచ్చేందుకై ఆ కుర్రాళ్లిద్దరూ సేనావిభాగంతో వెళ్లారు. గేటు బురుజుమీద నుండి జర్మన్ సబ్‌మెషీన్‌గన్నరు కాల్పులు సాగిస్తున్నప్పటికీ వాళ్ళు ఆ బహిర్దేశంలో పరుగులు తీస్తూనే వున్నారు గాని వెనక్కి తగ్గలేదు. ఆ కుర్రాళ్లిద్దరినీ ఆనాడు వీరాగ్రేసరులుగా అందరూ అభినందించారు. ఎందు వల్లనంటే యీ కుర్రాళ్లకారణంగానే 333 వ రెజిమెంటు తన విభాగాన్ని ఎక్కువ కాలం చెక్కుచెదరకుండా నిలబెట్టుకోగలిగింది.

రాత్రిపూట ఫాసిస్టులు బూగ్‌నది కడ్డంగా పడవలపై ఒక పెద్ద బల్లకట్టు వంతెనను వేసినప్పుడు కూడా యీ కుర్రాళ్లిద్దరే ఆ వంతెనను పశ్చిమ బారకాసులనుండి చూపించారు. ఆ వంతెనమీదుగా శత్రువుల కాల్బలాలూ, బాగా మందుగుండు సామాగ్రితో నిండిన లారీలూ ప్రవాహం లాగా నడిచాయి.

ప్రస్తుతం మందుగుండు సామాగ్రి కొల్లలుగా వున్న మోర్‌టార్ దళంవారు ఆ వంతెనమీదికి కాల్పులు సాగించారు. వారి తొలి గుండ్లు ఆ బల్లకట్లను నాశనం చేసివేసి ఆ కాల్బలాలనీ, లారీలనీ ఆపివేశాయి. గుండు దెబ్బ తగిలి చెడిపోయిన మందుగుండు సామాగ్రి లారీ ఒకటి నీళ్లలోకి తిరగ బడింది. మరొకటి ఆ వంతెన మధ్యలో రోడ్డుకు అడ్డంగా నిలిచిపోయింది. అకస్మాత్తుగా కలిగిన భయభీతులతో ఇన్‌ఫెంట్రీ మనుషులు గట్టువైపు మూక వుమ్మడిగా పరుగెత్తారు. అయినా వాళ్లని మెర్‌టార్‌దళంవారి గుండ్లు వెంబడించడం మాత్రం మానలేదు. వంతెన కొనవద్ద తొక్కు లాడుతూన్న ఆ గుంపుల మధ్యనుండి నల్లని పొగ స్తంభాలు పైకిలేచాయి. జర్మన్ ఫిరంగిదళం సోవియట్ మోర్‌టార్‌దళం కాల్పులకు సమాధానం చెప్పి దానిని అణచివేయాలని ప్రయత్నించిందే కాని మోర్‌టార్‌దళం బారకాసులలో దాగొని వుండి, ఎడతెగకుండా వంతెనపైకి కాల్పులను సాగిస్తూ శత్రువులను ఆ వంతెనను దాటకుండా చేసివేసింది.

ఉత్తరవిభాగంవద్ద జరుగుతోన్న యుద్ధం ఆ కిందటి రోజుకంటే చాలా తెగువతో జరుగుతోంది. మట్టిగట్లమీద స్థిరంగా నిలదొక్కుకొని వున్న గ్రవీలొవ్‌యొక్క కంపెనీలు శత్రువుపై దెబ్బమీద దెబ్బతీస్తున్నాయి. శత్రువుల సబ్‌మెషీన్‌గన్నర్లు తోసుకువచ్చి అగడ్తను దాటి మట్టిగోడను ఎక్కాలని చేసిన ప్రయత్నాలన్నీ కూడా విఫలమైపోయాయి. అలా ప్రయ

త్నం చేసినప్పుడల్లా కూడా డజన్ల కొద్దీ శవాలు కాలవగట్టుమీద మిగిలి పోయేవి. చావగా మిగిలినవారు ప్రాకులాడుకుంటూ వెనకకు వెళ్లిపోయి పొదలమాటున తాము అదివరకే ఏర్పరచుకున్న విస్తృత కందక విన్యాసంలో తల దాచుకున్నారు.

ఒక్కొక్కప్పుడు ఆ పొదలనుండి టాంకులు వెలుపలికి వచ్చేవి. దుర్గరక్షకులు వాటిని మట్టిగోడకుదగ్గరగా రానిచ్చి, వాటిమీద చేతిబాంబులను విసిరేవారు. ఆ టాంకులలో ఒక టాంకు బాగా చొట్టలు పడిపోయికుంటు పడిపోయింది. హిట్లరు సైనికులు ఆ టాంకును మరొక దానికి కట్టి వెనక్కి తీసుపోక తప్పింది కాదు.

అయినా ఒక టాంకు జట్టు మాత్రం ఉత్తర గేటుగుండా చొచ్చుకు పోగలిగింది. వాటిని అనుసరిస్తున్న ఇన్‌ఫెంట్రీని గ్రవీలొవ్ ఇన్‌ఫెంట్రీవారు తమ కాల్పులతో వెనక్కి తరిమి వేసినప్పటికీ రెండు మూడు టాంకులు ఆఫీసర్ల బసలను దాటి మూడు ఆర్చీల గేటుగుండా దాడి చేసి దుర్గపు మధ్య ఆవరణలోకి వచ్చాయి. వాటిల్లో ఒకటి గేటు సమీపంలో ఆగి సరాసరి ఎదురుగా వున్న బారకాసులమీదికి సూటిగా కాల్పులు సాగించడం మొదలు పెట్టింది.

ఈ సమయంలోనే 333 వ రెజిమెంటు బారకాసుల బేస్‌మెంటు నుండి యిద్దరు వ్యక్తులు వెలుపలికి వచ్చారు. ఒకరు సీనియర్ లెఫ్టినెంటు సెమేనెన్‌కొ. ఇంకొకరు అనామకుడైన ఫిరంగిదళం సార్జెంట్-మేజరు. వీరిద్దరూ ఆ జర్మన్ టాంకుతో పోరాడటానికి నిశ్చయించుకున్నారు.

యుద్ధం ఆరంభంకాకముందు 333 వ రెజిమెంటు ఫిరంగులు బేస్‌మెంటుకు ఎదురుగా వున్న చౌకులో నిలిచివున్నాయి. ఈపాటికి వాటిల్లో చాలా వరకు జర్మన్ కాల్పులకు ధ్వంసం అయిపోయాయి. కాని ఒకటి మాత్రం



సీనియర్ లెఫ్టినెంట్
ఎ. సెమేనెన్కొ, 1941

చెక్కుచెదరకుండా యింకా అలాగే వుండిపోయింది. మన వాళ్లిద్దరూ ఆ ఫిరంగితో, ముఖ్యంగా ఆ ఫిరంగి పక్కనే గుండ్లతో నిండివున్న పెద్ద పెట్టె ఒకటి వున్న కారణాన ఆ నాజీ టాంకుని ఎదుర్కోవడానికి నిశ్చయించుకున్నారు.

దుర్గపు ఆవరణలో జర్మన్ మోర్టార్ గుళ్లు ప్రేలుతున్నా లెక్కించక సెమేనెంకొ, సార్జెంట్-మేజరూ కలిసి ఆ ఫిరంగిని టాంకుపై నిగిడేందుకని తీవ్ర ప్రయత్నాలు చేశారు. గురి చూసే పరికరం ధ్వంసం అయిపోయింది. అయినా సార్జెంట్-మేజరు ఫిరంగి గొట్టంతోనే గురి చూశాడు. సెమేనెంకొ మొదటి గుండును దట్టించాడు. ఫిరంగి ప్రోగింది. ఆ దెబ్బతో టాంకు అడుగు భాగంనుండి నల్లనిపొగ పైకెగచిమ్మింది.

జర్మన్లు యీ ఫిరంగి ఎక్కడుందో కనిపెట్టారన్నది స్పష్టమయింది. ఎందువల్లనంటే టాంకు గోపురం యీ ఫిరంగి వైపు తిరిగడం మొదలు పెట్టింది. అప్పటికే రెండో గుండును ఫిరంగి కానాలో సిద్ధంగా వుంచారేమో ఆ టాంకు యిటువైపుకు తిరిగేలోగానే, ఆ ఫిరంగిని ప్రేల్చారు. ఆ దెబ్బతో టాంకు గోపురం ఎగిరిపోయింది. మరో రెండు ఫిరంగి గుళ్లను ప్రేల్చారు.

దాంతో ఆ టాంకు తుక్కు అయిపోయింది. ఆ మరుక్షణాన్నే ఫిరంగి చుట్టూ మోర్‌టార్ గుళ్ళు ప్రేలడం మొదలైంది. ఇద్దరు స్వచ్ఛంద సైనికులూ తల దాచుకునేందుకై పరుగెత్తారు. ఏమైతేనేం వారు తమ ఆశయాన్ని సాధించుకున్నారు. నాజీలు ఆ టాంకుకు తాడు కట్టి మరోటాంకుతో దానిని దుర్గపు గేట్లగుండా యీడ్చుకుపోయారు.

ఈలోగా టాంకుల రెండో సముదాయం ఉత్తర విభాగంలోని సింహద్వారంవద్ద ప్రత్యక్షమయింది. వాటిని మేజర్ గవ్రీలొవ్‌యొక్క విమానవిధ్వంసక ఫిరంగిసైనికులు ఎదుర్కొన్నారు.

భారీ బాంబులు విపరీతంగా పడ్డాయేమో ఫిరంగిదళంవారికి కాల్పులను సాగించగలిగే ఒక్క ఫిరంగి మాత్రమే మిగిలింది. వారి కమాండరు క్షతగాత్రుడయ్యాడు. అయినా అతడు తన గాయాలకు ఏదో ఒక విధంగా కట్టుకట్టేసుకొని ఫిరంగివద్ద నిలబడ్డాడు. ఆ గేటు పొరంగంలో నాజీల మొదటి టాంకు అగపడీ అగపడిందో అతడు కాల్పులను సాగించేందుకని ఎంతో బాధతో పైకి లేచి నిలబడ్డాడు.

విమానాలను ధ్వంసంచేసే గన్నర్లు మొదటి గుండును పేల్చేంత వరకూ కూడా వారిని హిట్లరు సైనికులు గమనించనేలేదు. వారు తమ టాంకును గేటువద్దనే ఆపుజేసి త్వరత్వరగా కాల్పులు సాగించారు. నాజీ గన్నరు గురి చూసి కాల్పులను సాగించేలోగానే గురితప్పని సోవియట్ ఫిరంగి గుండు ఆ టాంకును ధ్వంసంచేసి పొగలు కక్కేట్టు చేసింది. అసలే ఆ సింహద్వారం సన్నగా వుందేమో యీ ధ్వంసమైపోయిన టాంకు మిగతా టాంకులకు అడ్డంగా ఆ సింహద్వారంవద్ద వుండిపోయింది.

తానెంత క్షతగాత్రుడైనప్పటికీ ఆ యువ లెఫ్టినెంటు ఫిరంగిని స్వయంగా పేల్చి విజయంకొరకు తన ప్రాణాన్ని ఒడ్డాడు. నెత్తురం స్రవించిపోవడం

చేత అతడు ఆ ఫిరంగిమీదే కూలిపోయి, తన మనుషులు వచ్చే సరికే ప్రాణాలు వీడాడు.

అతని మరణవార్త మేజర్ గ్రవీలొవ్‌కు నివేదించారు. ఆ ద్వంద్వ యుద్ధాన్ని స్వయంగా చూసిన మేజర్ వెంటనే ఛీఫ్ ఆఫ్ స్టాఫ్ కసాత్కిన్‌ను పిలిపించాడు.

"చనిపోయిన లెఫ్టినెంటుకు సోవియట్ వీరుడనే బిరుదు మరణానంతరమొసగ వలసిందిగా సిఫారసు చేస్తూ పత్రం వ్రాయి. మనం యీ పనినుండి విడుదల అయిన వెంటనే నేను ఆ పత్రాన్ని హెడ్‌క్వార్టర్సుకు పంపుతాను," అని అతని నాజ్ఞాపించాడు.

కాని ఆ పత్రం, అనేక యితర పత్రాలలాగానే ఆ దుర్గంలో జరిగిన యుద్ధసమయంలో నాశనమైపోయింది. ఆ వీరుని పేరు కూడా యీనాటి వరకూ ఎవరికీ తెలియకుండా వుండిపోయింది.

సాయంత్రం పూట ఒక మోస్తరుగా నిశ్శబ్దంగానే వుంది. దుర్గంపై శత్రువులు సాగిస్తున్న బొంబార్డ్‌మెంట్లు కూడా బాగా తగ్గిపోయాయి. ఈ సమయంలో ఉత్తర విభాగంలోని వలయాకృతి బారకాసుల కిటికీల వద్ద కావలి వున్న సైనికులు ముహవేత్స్ నది ఆవలిగట్టున సోవియట్ ఆఫీసరు దుస్తుల్లో వున్న ఒక వ్యక్తిని చూశారు. ఆ మనిషి మట్టిగోడ కిందినుండి శరవేగంతో నదివద్దకు పరుగెత్తి ఆ పూర్తి దుస్తుల్తోనే నీళ్ల లోకి దూకి నదికడ్డంగా యీదాడు. శత్రువులు అతనిని చూడలేదనేది స్పష్టం. ఎందువల్లనంటే ఒక్క గుండైనా పేల లేదు.

ఇది ఏదైనా శత్రువులు ఎత్తిన ఎత్తుకావచ్చునని ఊహిస్తూ ఆ కిటికీలవద్దనున్న రైఫిల్ సైనికులు ఆ వ్యక్తిని ఎదుర్కోవడానికి సిద్ధంగా వున్నారు. తనను శత్రువుల గూఢచారిగా పరిగణిస్తారేమోనని అనుమానిస్తూ

ఆ ఆఫీసరు గట్టును చేరీ చేరడంతోటే పెద్దగా అరిచాడు: "నామీద కాల్చకండి. నేను సోవియట్ మనిషిని!"

ఆ మరుక్షణాన్నే అతడు గట్టుమీదకి పరుగెత్తి ఎక్కి గోడమీదవున్న జర్మన్ మెషీన్‌గన్నరు కాల్పులను సాగించేలోపునే కింది అంతస్తు కిటికీలలో ఒకదానిగుండా సురక్షితంగా బారకాసులలోకి దూరాడు. మరుక్షణమే రైఫిల్ సైనికులు అతని చుట్టూ చేరారు.

44 వ రెజిమెంటులో పనిచేసిన వ్యక్తులు ఆ ఆఫీసరు రెజిమెంటల్ నాన్‌కమీషన్డ్ ఆఫీసర్స్ కోర్సులకు పెద్ద అయిన సీనియర్ లెఫ్టినెంటు వసీలియ్ బిత్కో అని గుర్తుపట్టారు. అతడు బాగా తడిసిపోయాడు. కత్తి పెట్టుకొనే పట్కాతోసహా ఫిన్‌లాండ్ యుద్ధంలో పొందిన "ఎర్ర నక్షత్రం" ఆర్డర్ వున్న పూర్తి ఆఫీసర్ దుస్తులతో అతడు అంతకు ముందే కాల్పులు సాగించాడేమో యింకా వేడిగా వున్న తన పిస్తోలును గట్టిగా పట్టుకొని వాళ్ల ఎదుట నిలిచాడు. బిత్కో తన యూనిట్‌కు నాయకత్వం వహించేందుకని శత్రుసైన్యాల వలయంగుండా దారి పొడుగునా యుద్ధం చేసుకుంటూ ముట్టడిలో చిక్కుకున్న దుర్గరక్షణ సేనవద్దకు వచ్చాడు.

ఒంటరిగా ముట్టడి శ్రేణిని చీల్చుకుంటూ వచ్చిన సీనియర్ లెఫ్టినెంటు అద్భుత చర్యగురించిన వార్త ఆ దుర్గరక్షకుల మెప్పుదలనీ ఆనందాన్నీ చూరగొంది. అతని రాక ఒక యూనిట్ తర్వాత మరొక యూనిట్‌కు తెలియడంతోటే మొత్తం విభాగం పొడుగునా ఆనందాతిశయాలతో కూడిన కేకలు వెల్లివిరిశాయి. బిత్కో యుద్ధ పరిస్థితిని త్వరగా అర్థం చేసుకొని తన మనుషుల స్థానాలను మార్చుతూ నాన్‌కమీషన్డ్ ఆఫీసర్లకు వారు ఏంచేయవలసి వుందో ఉత్తరువులొసగుతూ తన విభాగాన్నంతటినీ కలయ తిరిగాడు. మంచి పట్టుదలతోనూ ఉత్సాహంతోనూ వున్న యీ ఆఫీసర్ని

చూసీచూడ్డంతోటే అతని మనుషులందరిలోనూ త్వరలోనే తమకు విముక్తి కలుగుతుందనే ఆశ రేకెత్తింది. నూతన శక్తి ఉద్భవించింది. యుద్ధం చేయాలి అనే మనోనిశ్చయాన్ని మరింత దృఢపరచింది.

మూడవనాడు ఉదయాన హిట్లరు సైన్యాలు దుర్గ ఉత్తర విభాగంనుండి కేంద్ర బారకాసులపైన ప్రబలమైన దాడి చేశాయి. వంతెనా, మూడు ఆర్చీల గేటూ యీ రెండిటి చుట్టూరా తీవ్రమైన యుద్ధం జరిగింది. శత్రువులని వెనుకకు వెళ్లగొట్టారు. కాని యువకమ్యూనిస్టు లీగు కార్యదర్శి మతెవొస్యాన్ మాత్రం తీవ్రంగా గాయపడ్డాడు. అతనిని శ్వేత భవనం నేళమాళిగలోకి తీసుకువెళ్లక తప్పింది కాదు. హిట్లరు సైన్యాలు వెనక్కి వెళ్లిపోయాయి. అవి మళ్లీ తమ దాడిని కొనసాగించలేదు. కాని త్వరలోనే "యుంకర్స్" విమానాలు పెద్ద కూత పెట్టుకుంటూ మధ్య దీవిపైన ఎగురుతూ బారకాసులపైన క్రమపద్ధతిలో సుదీర్ఘంగా బాంబుల వర్షాన్ని కురిపించాయి.

బాంబులు కురవడం ఒక విశ్రాంతి సమయంగా పరిగాణించారు దుర్గరక్షకులు. ఎప్పుడైతే విమానాలు ఆకాశంలో అగుపించాయో శత్రు ఇన్‌ఫెంట్రీ దాడులు ఆగిపోయాయి. దాదాపు మొత్తం దుర్గరక్షణసేనంతా కూడా నేలమాళిగల్లో సురక్షిత స్థావరాలకు వెళ్లిపోగలిగింది. విమానదాడి జరుగుతున్నప్పుడు కేవలం మెషీన్‌గన్నర్లు మాత్రం తమ యుద్ధస్థానాల నుండి కదలేవారు కారు. దుర్గరక్షణసైనికులయొక్క యీ విరామసమయాన్ని శత్రువులు అదనుగా తీసుకొని లాభాన్ని చేకూర్చుకోకుండా చూసేందుకనే మెషీన్‌గన్నర్లు ఆవిధంగా తమ స్థానాలలో నిలిచిపోయేవారు.

జూన్ 24 వ తేదీన జరిగిన విమానదాడి ముఖ్యంగా చాలా సుదీర్ఘ కాలమే జరిగింది. ఈ అధిక కాలపు "విశ్రాంతి" సమయంలో దుర్గం మధ్య

ప్రదేశంలోని రక్షణకు నాయకత్వం వహిస్తోన్న సోవియట్ కమాండర్ను ఒక సమావేశాన్ని ఏర్పాటు చేసుకోగలిగారు. పరిస్థితి బాగా చర్చించిన తర్వాత, తగు నిర్ణయాలను తీసుకున్న పిదప ఆఫీసర్లు ఒక ఆజ్ఞను తయారు చేశారు. దానికి లెఫ్టినెంట్ వినోగ్రాదొవ్ వెంటనే నకలు తీశాడు.

యుద్ధానంతరం యీ దుర్గ శిథిలాలను వెదికినప్పుడు రాళ్ళూ రప్పల్లో సగం చీకిపోయిన యీ కాగితాలు కనిపించాయి. ఆ కష్టదినాలలో ఎవరు దుర్గరక్షణకు నాయకత్వాన్ని వహించిందీ తెలుసుకునేందుకు యీ కాగితాలే మొట్టమొదటి ఆధారాలు.

పరిస్థితులనుబట్టి ఇటుపైని దుర్గరక్షణకు సమైక్య నాయకత్వం ఆవశ్యకమనీ, ఆ సమావేశానికి హాజరైన ఆఫీసర్లు తమతమ పటాలాలన్నిటినీ ఒకే ఒక గ్రూపుకింద కలిపివేయడానికే నిశ్చయించుకున్నారనీ "ఆర్డర్ నెం. 1," జూన్ 24, 1941 తెలిపింది.

అంతర్యుద్ధంనూ శ్వేత ఫిన్నులకు వ్యతిరేకంనూ పోరాడిన అనుభశాలి అయిన కమ్యూనిస్టు, 44 వ రెజిమెంటుయొక్క అనుభవజ్ఞుడైన రెండవ కమాండర్ కాప్టెన్ ఇవాన్ జుబచోవ్‌కు యీ సమైక్యసముదాయ నాయకత్వాన్ని ఒప్పగించారు. అతనికి రాజకీయ సహాయకునిగా కమిస్సార్ ఫొమీన్‌నీ, ఛీఫ్ ఆఫ్ స్టాఫ్‌గా సీనియర్ లెఫ్టినెంట్ సెమేనెంకొనూ ఏర్పాటు చేశారు. జూనియర్ కమాండర్లంతా కూడా తమ మనుషుల జాబితాను తయారుచేసి వారిని ప్లాటూన్‌లగా ఏర్పరచమని ఆ ఆజ్ఞలో వుంది.

ఆ ఆజ్ఞాపత్రాన్ని పూర్తిగా వ్రాయనే లేదు. విమానదాడి ఆఖరయింది. శత్రు సబ్‌మెషీన్‌గన్నర్లు ఒక్కుమ్మడి దాడిలోకి విరుచుకుపడ్డారు. కమాండార్లు గబగబా తమ యూనిట్లకు పరుగెత్తారు. ఆ తర్వాత జరిగిన యుద్ధం ఎంత తీవ్రంగా వుందంటే వివిధ యూనిట్లలో వున్న వ్యక్తుల



ఆర్డర్ నెం. 1

జాబితాలను వ్రాయడం అసంభవమైపోయింది. ఎందువల్లనంటే క్షణక్షణా నికీ మారుతూన్న పరిస్థితులనుబట్టీ, శత్రు దాడి అధికమౌతూండడాన్ని బట్టీ సోవియట్ సైన్యాల కూర్పూ, స్థానమూ మారుతూ వచ్చింది.

ఆర్డర్ నెం. 1 అనేక విషయాల్లో కొనసాగక పోయినప్పటికీ దుర్గ రక్షణ విషయంలో మాత్రం అది చాలా ప్రధానమైన పాత్రను వహించింది. దుర్గనగరం మధ్యప్రదేశంలో సమైక్యనాయకత్వం సంఘటితమవడంవల్ల సోవియట్ రక్షణ మరింత బలీయమైంది. అంతేకాకుండా ఆ రక్షణను నిర్వహించడం కూడా సులభమయింది.

# మేం చిట్టచివరివరకూ పోరాడుతాం

తూర్పున దూరంలో ఫిరంగుల గర్జన ఆగిపోయి చాలా కాలం అయింది. యుద్ధరంగం సరిహద్దునుండి వందలాది మైళ్ల దూరానికి తిరోగమించింది. రాత్రిపూట యుద్ధ విరామసమయాల్లో ఎక్కడో యుద్ధశ్రేణుల వెనుక ఎంతో **దూ**రాన వుండే నిశ్శబ్దత దుర్గంలో తారాడింది. అప్పుడప్పుడు పైన చాలా ఎత్తులో లాంగ్‌రేంజ్ బాంబర్ విమానాల దడదడ శబ్దం ఆ ప్రశాంతతను భగ్నం చేస్తోంది. అయినా అలాంటి విరామసమయాలు బహు అరుదుగా వుండేవి. ఫిరంగిదళాల కాల్పులూ, ఇన్‌ఫెంట్రీ దాడులూ నిరంతరం రేయింబవళ్లు కొనసాగుతూనే వున్నాయి. ఎక్కడా ఆపకుండా యుద్ధం చేసినట్లైతే గారిజన్ బాగా అలసిపోయి త్వరలోనే తమకు వశమైపోతుందనే ఆశతో శత్రువు ఆ దుర్గరక్షకులకు ఒక్క క్షణమైనా విరామమివ్వకుండా వుండేందుకై ప్రయత్నించింది.

కాని అదనపు సహాయదళాలు రావడంవల్ల తమకు విడుదల కలుగుతుందనే ఆశే రోజుకిరోజూ దుర్గరక్షకులని జీవించేట్టూ యుద్ధంచేసేట్టూ చేస్తోంది. ఆశా విశ్వాసాలు వారికి తప్పనిసరి అయ్యాయి. సోవియట్ ఎదురుదాడి ప్రారంభమైందనీ, సోవియట్ టాంకులు బ్రెస్ట్ ప్రదేశాన్ని సమీపిస్తున్నాయనీ పుకార్లు ఎప్పటికప్పుడు దుర్గం నలువైపులా ప్రతిధ్వనించేవి. ఈ వార్తలు అక్కడి మనుషులకు నూతన శక్తిని కలుగచేశాయి. వారు తమ యుద్ధ శ్రేణులను ద్విగుణీకృతమైన పట్టుదలతో పరిరక్షించుకొనేవారు. వారు శత్రువులపై తీసే ఎదురుదెబ్బలు తీవ్రతరమయ్యేవి. ఈ పుకార్లు

నిరాధారమైనవని తేలిపోయినప్పటికీ కూడా అవి పదేపదే తలయెత్తేవి. వారు మారుప్రశ్న వేయకుండా వాటిని నమ్మేవారు.

ఒక నాటిరాత్రి సోవియట్ లాంగ్‌రేంజ్ బాంబర్ విమానాల సముదాయం పైనుండి వెళ్ళింది. ఇంజన్ల శబ్దంబట్టి దుర్గరక్షకులు వాటిని గుర్తుపట్టారు. పశ్చిమాన దూరంలో బూగ్ నదికి అడ్డంగా వున్న రైల్వే జంక్షన్‌నుండి బాంబులు పేలిన శబ్దం వినవచ్చింది. శత్రువు తాలూకు రైళ్లను సోవియట్ విమానాలు బాంబుచేస్తున్నాయని ప్రతి మనిషికీ అర్థమైపోయింది. దాంతో దుర్గమంతా కూడా సంతోషంతో ఉప్పొంగిపోయింది. 'హుర్రా' అనే కేకలతో ఆకాశం నిండిపోయింది. కొంతమంది మనుషులు శత్రుస్థానాలపై కాల్పులను సాగించారు కూడాను: హిట్లరు సైనికులు చికాకుపడడం మొదలెట్టారు. వారి ఫిరంగిదళం తక్షణమే దుర్గనగరంపై మళ్లీ కాల్పులను సాగించింది.

మరొక సందర్భంలో సోవియట్ ఫైటర్ విమానం ఒకటి దుర్గం పైన ఆకాశవీధుల్లో అగుపించింది. దూరపు యుద్ధరంగంనుండి అది అక్కడికి ఎలా వచ్చిందో ఎవరికీ తెలియదు. ఆ ఒంటరి విమానం మేఘాల నుండి ఊడిపడినట్లుంది. అది మధ్యదీవిపైన వలయం తిరిగి స్వాగతం చెప్పడానికి తన రెక్కలని కిందికి దించింది. ఆ రెక్కలమీది సోవియట్ నక్షత్రాలు స్పష్టంగా అగుపించాయి. దుర్గం అంతటా కూడా ఎలాంటి హర్షధ్వానాలు మార్మోగాయంటే, చెవులు చిల్లులు పడేట్టుగా ధ్వనించే ఫిరంగి గుండ్లపేలుడు శబ్దంలోనూ తన యింజను ధ్వనిలోనూ కూడా ఆ పైలట్ వారి కేకలను తప్పకుండా వినేవుంటాడు.

అప్పుడు కొన్ని ''మెస్సెర్‌ష్మిట్'' విమానాలు సరిహద్దునుండి వచ్చాయి. ఎక్కడా సద్దులేకుండా అయిపోయిన దుర్గంలోని మనుషుల

కళ్లన్నీ కూడా ఆ సోవియట్ ఫైటర్ విమానంపైనే వున్నాయి. అది ఉండుండి తన మషీన్‌గన్ పేల్చుకుంటూ మేఘాల చాటున రక్షణను తీసుకొనేందుకై పైపైకి వెళ్తూ తూర్పుదిశగా ఎగిరిపోయింది. ఇతర విమానాలన్నీ కూడా ఆకాశంలో అదృశ్యమైపోయాయి. ముట్టడింపబడిన దుర్గరక్షణసేన రోజంతా కూడా యింకా ఎక్కువ పట్టుదలతో యుద్ధం చేసింది. ఆఖరికి చాలామంది క్షతగాత్రులు కూడా రైఫిళ్లను చేతబట్టి తమ శ్రేణుల వద్దకు ప్రాకుకుంటూ వెళ్లారు. దుర్గాన్ని రక్షిస్తోన్న వారికి ధైర్యాన్ని గొలిపేందుకనీ, వారికి సహాయం చేసేవారు దగ్గరలోనే వున్నారని గుర్తించేందుకనీ ఆ ఏకాకి ఫైటర్ విమానాన్ని హెడ్‌క్వార్టర్సు పంపిందనడంలో ఎవరికీ సందేహం కలగలేదు. అసలైన కారణం ఏమైనప్పటికీ, ఆ అనామక సోవియట్ పైలెట్ మాత్రం దుర్గరక్షణసేనలో ఒక నూతన శక్తినీ, అంతిమ విజయం మనదేనన్న విశ్వాసాన్నీ రేకెత్తించాడు.

కాలం గడచిపోయింది, ఎటునుండీ సహాయం లేదు. యుద్ధరంగం పరిస్థితి సోవియట్ సైన్యాలకు యింకా ప్రతికూలంగానే వుందని ప్రతి ఒక్కరూ తలపోశారు. విధిలేక పైకి ఎంతటి విశ్వాసాన్ని కనపరచినప్పటికీ కూడా విజయం లభించే అవకాశాలు సన్నగిలుతున్నాయనే ప్రతి వ్యక్తీ తన హృదయాంతరాళాలలో తెలుసుకున్నాడు. ఎవరైనా ధైర్యంచేసి తమ సందేహాలని పైకి వ్యక్తం చేసినట్లైతే వెంటనే ఆ వ్యక్తి స్నేహితులు అతని నోరు మూసేవారు. ఆ దుర్గరక్షణసేనలో యుద్ధానికి చెందిన కష్టాల గురించి మాట్లాడటంగానీ, విజయం లభించదేమోనన్న స్వల్పాతి స్వల్ప సందేహాన్ని వెలిబుచ్చడంగానీ జరగకూడదనేది అలిఖిత శాసనంగా రూపొందింది.

"ఏమైనప్పటికీ కూడా మేం చిట్టచివరివరకూ పోరాడుతాం" అనే ఈ నిర్ణయం వ్రాతమూలకంగా లేకపోయినప్పటికీ, బిగ్గరగా పైకి అనక పోయినప్పటికీ దుర్గరక్షకుల ప్రతి ఒక్కని హృదయంలోనూ గాఢంగా నాటుకుపోయింది. సీనియర్ హెడ్క్వార్టర్సుతో అన్ని సంబంధాలనూ కోల్పోయి, దానికి దూరమైపోయిన ఈ చిన్న గారిజన్ అక్కడినుండి యేవిధమైన ఉత్తరవులనూ అందుకోకపోయినప్పటికీ తన కర్తవ్యం ఏమిటో తెలుసుకుంది, అర్థం చేసుకుంది. దుర్గాన్ని ఎంత ఎక్కువ కాలం నిలబెట్టుకోగలిగితే దుర్గాన్ని ముట్టడిస్తోన్న శత్రుపటాలాలు యుద్ధరంగాన్ని చేరేందుకు అంత ఆలస్యమౌతుంది. కాబట్టి ఇంకా మరింత కష్టపడి పోరాటాన్ని కొనసాగించాలి. ఎంత కాలం వరకూ తాము సాగడానికి వీలుంటుందో అంతకాలమూ సాగాలి. శత్రువులు బాగా వెనుక భాగంలోనే వుండిపోయేట్టు వారిని యీ దుర్గంవద్దనే నిలిపి వేయాలి. సాధ్యమైనంతవరకు శత్రువులకు తీరని నష్టాన్ని కలిగించాలి. ఆవిధంగా శత్రువులను పురోగమించకుండా వుండేట్టుగా వారి శక్తిని అణచివేయాలి. ఈవిధంగా చేయాలంటే యింకా ఎక్కువ ధైర్యంతోనూ పట్టుదలతోనూ పోరాడి తీరాలి. తమ ప్రాణాలను ఎంతో ప్రియంగా అమ్మాలి.

నిజానికి వారు ఆవిధంగానే మృత్యువును తృణీకరించుతూ అపూర్వమైన పట్టుదలతో అసామాన్యమైన తెగువతో పోరాడారు.

అనేకమార్లు క్షతగాత్రులైన మనుషులు కూడా కాల్పుల శ్రేణిని విడిచి వుండలేదు. గాయాలకు కట్టినకట్లునుండి నెత్తురు పైకెగజిమ్ముతూ వున్నా కొందరు బాయొనెట్ దాడిలో పాల్గొన్నారు. అత్యంత ప్రమాదమైన గాయాలు తగిలినవారు కూడా తమ స్థానాలని వదలిపెట్ట లేదు. గాయాలు మరీ ఎక్కువ ప్రమాదకరమై తామిక పోరాడలేని పరి

స్థితి గనక ఏర్పడినట్లైతే ప్రాణాలతో శత్రువుల చేతుల్లో చిక్కకుండా వుండేందుకనీ, తమ బాగోగులను చూస్తూన్న స్నేహితుల భారాన్ని తొలగించేందుకనీ వారు ఆత్మహత్య చేసుకున్నారు. ఆ రోజుల్లో, ''సెలవు కామ్రేడ్స్ నా మరణానికి ప్రతీకారం తీసుకోండి!'' అనే కేక వినబడేది, ఆ కేక వెను వెంటనే ఆఖరి తుపాకిగుండు శబ్దం వినబడేది.

దుర్గం వుత్తర విభాగంలో ఆఫీసర్ల బసలవద్ద యుద్ధం జరుగుతున్న మొదటి రోజుల్లో హిట్లరు సైనికులు క్షతగాత్రుడై వుండిన 125 వ రెజిమెంట్‌లో బటాలియన్ కమాండర్ కాప్టెన్ వ్లదీమిర్ షబ్లోవ్‌స్కి నాయకత్వంకింద వున్న ఒక ఎర్ర సైన్యపు జట్టును పట్టుకున్నారు. అదే సమయంలో కొంతమంది స్త్రీలనూ పిల్లలనీ కూడా ఖైదీలుగా పట్టుకున్నారు. వాళ్లలో షబ్లోవ్‌స్కి భార్య, నలుగురు చిన్న కూతుళ్లూ వున్నారు. అందరికంటే పెద్దమ్మాయి వయసు ఎనిమిది సంవత్సరాలు. అందరికంటే చిన్నపిల్ల వయసు ఎనిమిది మాసాలు.

సబ్‌మెషీన్‌గన్నర్లు గట్టి కాపుదలమీద ఖైదీలను యుద్ధరంగం వెనుక భాగానికి నడిపించి తీసుకువెళ్లారు. గాయాలుతగిలి, బాగా అలసిపోయిన ఖైదీలు నడవలేకపోయారు. ఒకరిని పట్టుకుని ఒకరు నడవలసి వచ్చింది. షబ్లోవ్‌స్కి ఒక చెయ్యి కట్టులో వుంది. రెండో చేత్తో తన కడసారి కూతుర్ని ఎత్తుకుని వెళ్తున్నాడు. దార్లో ఆ ఖైదీల శ్రేణి ఒక వంతెనను దాటవలసి వుంది. ఖైదీలు ఆ వంతెన మధ్యకు వచ్చినప్పుడు కాప్టెను తన కుమార్తెను ముద్దు పెట్టుకొని ఆ బిడ్డను తన భార్యకందిచ్చాడు. ''నన్ను అనుసరించండి!'' అని అంటూ అతడు తన మనుషుల్ని హెచ్చరించి వంతెన పైనుండి నదిలోకి దూకాడు. అతని వెంటే అతని మనుషులు చాలామంది కూడా దూకేశారు. జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్లు వెర్రిగా కాల్పులు సాగించారు.

నీళ్లల్లోకి దూకిన ప్రతివ్యక్తీ ఆ తుపాకీ గుండ్లకు ఆహుతైపోయాడు. వాళ్లు మృత్యువునే అన్వేషించారు. వారు బాగా గాయపడి అలసిపోయి వున్నారేమో, యీది తప్పించుకునే మాట కల్ల.

కాప్టెన్ వ్లదీమిర్ షబ్లోవ్స్కి

కాప్టెన్ షబ్లోవ్స్కి మరణమూ, అతని అనుచరుల మరణమూ శత్రువుల హృదయాలలో బాగా నాటుకుపోయింది. జర్మన్లు ఆ ఖైదీల శ్రేణిని వెంటనే వెనక్కి మళ్లించి బ్రెస్ట్ పట్టణం జైలుకు నడిపించారు. ఒకటి రెండ్రోజుల తర్వాత దుర్గంలో పట్టుబడిన స్త్రీలు, పిల్లల సముదాయాన్ని ఆ వంతెనమీదుగా తీసుకువెళ్తున్నప్పుడు వాళ్లకు కాపలాగా వెళ్తున్న ఒక జర్మన్ వృద్ధసైనికుడు ఆ రష్యన్ కాప్టెనూ అతని మనుషులూ ఏవిధంగా మరణించిందీ వాళ్లతో చెప్పాడు. సోవియట్ సైనికుల ధైర్య సాహసాలు చూసి శత్రువుకు ఎంతటి గౌరవసహితమైన ఆశ్చర్యం కలుగిందీ అతని గొంతునిబట్టే తెలుసుకోవచ్చు.

దుర్గంపై గుండ్లవర్షం కురిపించి దుర్గాన్ని వశపర్చుకోవలసిందని ఆజ్ఞాపించిన హిట్లర్ జనరల్స్‌కూ వారి స్టాఫులకూ దుర్గరక్షకులు తలవని తలంపుగా చూపుతోన్న పట్టుదల చూసి ఎక్కడ లేని కోపం వచ్చింది. వారి యూనిట్లు సోవియట్ గడ్డపైని తొలి అడుగులనే దాటలేకుండా వున్నాయి.

పురోగమిస్తున్న జర్మన్-ఫాసిస్టు సైన్యం అప్పటికే మిన్స్క్ పట్టణాన్ని వశపరచుకొని స్మొలేన్స్క్‌కూ, మాస్కోకూ కదలిపోతోంది. ఒకవైపు యుద్ధ రంగం ముందలి శ్రేణిలో పురోగమిస్తోన్న సైన్యాలు గ్రాసులనూ పత కాలనూ గెలుచుకుంటూ పట్టణాలలోనూ పల్లెల్లోనూ మాంచి విలువైన జయసూచకాలను వశపరచుకుంటూ విజయచిహ్నాల కొరకై పోటీపడు తూంటే ఇక్కడ బ్రెస్ట్ దుర్గం గోడలవద్ద జర్మన్ ఆఫీసర్లు చాటుగా వుండికాల్పులు సాగించే సోవియట్ సైనికులయొక్క గురితప్పని తోటాలకు ఎర అవడమే కాకుండా తమ హైకమాండ్ వారి అసంతృప్తికి గురియై చీవాట్లు తింటున్నారు. ఆ దుర్గాన్ని యింకా ఎందుకని వశపరచుకోలేకపోయారంటూ హిట్లర్ హెడ్‌క్వార్టర్సునుండి తాఖీదుల పరంపర కుంభవృష్టిగా కురు స్తోంది. ప్రతిరోజూ యీ ఆజ్ఞల ధోరణి మరింత అసంతృప్తికరంగానూ, ఉద్రిక్తంగానూ తయారైంది. ముట్టడిదారులు దుర్గరక్షణసేన ప్రతి ఘటనను భగ్నంచేయడానికి ఎంతగా ప్రయత్నించినప్పటికీ కూడా దుర్గ రక్షకులు మాత్రం యింకా పోరాటాన్ని సాగిస్తూనే వున్నారు.

బూగ్ నది గట్టుమీదికి ఎక్కువ కెక్కువ ఫిరంగి బేటరీలను ఎక్కిం చారు. ఇప్పుడు రేయింబవళ్లు ఎక్కడా విరామంలేకుండా ఫిరంగి బొంబార్డ్ మెంటును కొనసాగిస్తున్నారు. మోర్‌టార్ గుండ్లు బారకాసుల ఇటుక గోడలను నల్లగా మాడ్చి వేస్తూ, ఇనుప కప్పులను ముక్కలుముక్కలుగా చీల్చివేస్తూ దుర్గం ఆవరణలోని ప్రతి అంగుళం మేరనూ నాగలితో దున్ని నట్టు దున్ని వేస్తున్నాయి. శత్రువుల భారీ ముట్టడి ఫిరంగులు దుర్గనిర్మా ణాలను క్రమక్రమేణా శిధిలాలుగా చేసి వొదలిపెట్టాయి. యుద్ధం ఆరంభావస్థలో ఫాసిస్టుసైనికులు అగ్నికారిణి గుండ్లను ప్రయోగించారు. త్వరలోనే వీటికి అదనంగా జ్వాలాశిఖలను కూడా విసరడం ప్రారంభించారు.

విమానాలు బాంబులతోపాటు మందుతూన్న పెట్రోలు డబ్బాలను కూడా వేయడం మొదలుపెట్టాయి. రానురానూ దుర్గమంతా కూడా అగ్ని సముద్రంగా తయారైంది.

దుర్గరక్షకులకు ఆశ్రయాన్నొసగిన గోడలు ఎక్కడికక్కడ విడిపోయి శిథిలాలుగా క్రమక్రమేణా కూలిపోయాయి. ప్రాణి అన్నది ఏదీ కూడా ఇక జీవించడం దుస్సాధ్యమే ననిపించింది. అయినా కొద్ది సేపటిలోనే ఆ కూలిన కుప్పల్లోంచి మెషీన్‌గన్‌లూ రైఫిళ్ళూ తమ కాల్పులతో శత్రువులని పలకరించేవి. మరణించగా మిగిలిన దుర్గరక్షకులు తామెంత క్షతగాత్రులైనప్పటికీ, శరీరాలు కాలిపోయి ఎంత బాధపడుతున్నప్పటికీ, తమ పోరాటాన్ని మాత్రం విడిచిపెట్టలేదు.

శత్రువులు రాత్రిపూట బారకాసుల గోడలవరకూ విధ్వంసకుల సమూహాలని పంపారు. వారు ప్రేలుడు సామాను పెట్టెలను యీడ్చుకుంటూ దుర్గరక్షకులు వుంటోన్న భవనాలవరకూ ప్రాకుకుంటూ వెళ్ళి, భవనాలని ధ్వంసం చేయడానికి ప్రయత్నించారు. సాపర్ల సముదాయాలు చిమ్నీలగుండా డైనమైటు పడవేస్తూ దుర్గపు పైకప్పుల వెంట ప్రాకుకుంటూ వెళ్ళారు. ఆ చీకట్లో మిద్దలమీద ముఖాముఖి యుద్ధం అకస్మాత్తుగా ఆరంభమైంది. ఉన్నట్టుండి ప్రేలుళ్ళు వినిపించాయి. రక్షకులను పూడ్చివేస్తూ భవనాల పైకప్పులూ, గోడలూ కూలిపోయాయి. కాని ఆ దుర్గరక్షకులు ఎంత శ్రమపడి, ఎంత గాయపడినా, సగం నలిగిపోయినప్పటికీ కూడా తమ ఆయుధాలని మాత్రం జారవిడువ లేదు. ఒక జర్మన్ వార్తలో తమ సాపర్‌దళం యుద్ధచర్యను తెలుపుతూ యిలా వుంది: "మధ్యదీవిలోని ఆఫీసర్ బసలను నుండి వచ్చే పార్శ్వ దాడులను మట్టుపెట్టేందుకని ఆ భవనాన్ని తుడిచిపెట్టి వేయమనే ఆజ్ఞలనిచ్చి 81 వ సాపర్ పటాలాన్ని పంపడం జరిగింది.

వారు కిటికీల మట్టానికి ప్రేలుడుసామానులను దించారు. వత్తులకు నిప్పు అంటించి వాటిని పేల్చివేశారు. ప్రేలుడువల్ల క్షతగాత్రులైన రష్యన్ల కేకలు మూల్గులూ వినబడ్డాయి. అయినా వారు యింకా కాల్పులను సాగిస్తూనే వున్నారు.''

దుర్గరక్షకులను సాధ్యమైనంత తక్కువ సమయంలో అణచివేసేందుకని శత్రువులు ఎంతటి నీచాతినీచమైన యుద్ధ విధానాలనైనా అవలంబించడానికి యిక వెనుదీయలేదు. ఆస్పత్రిని వశపరచుకుని అందులో వున్న క్షతగాత్రులను హత్యచేసిన ఒక సబ్ మెషీన్‌గన్నర్ల గ్రూపు ఆస్పత్రి గౌన్లను తొడుక్కొని హోల్మస్కి గేటు వంతెనను పరుగున దాటేందుకని ప్రయత్నించింది. కాని ఫొమీన్ మనుషులు మాత్రం సకాలంలోనే ఆ ఎత్తుని కనిపెట్టేశారు. దాంతో శత్రువుల యత్నం విఫలమైంది. మరొకసారి, యీ విభాగంపై దాడి చేస్తోన్న శత్రుపటాలాలు ఆస్పత్రిలో పట్టుబడిన నర్సులను తమ ముందు పెట్టుకొని నడిచాయి. పై అంతస్తులో వున్న సోవియట్ మెషీన్‌గన్నర్లు యీ దాడిని కూడా తిప్పికొట్టినప్పుడు ఆ ఫాసిస్టులు స్వయంగానే ఆ స్త్రీలను కాల్చివేశారు. అందుకు కారణం ఆ ఫాసిస్టు పిశాచాలకు స్త్రీలవెనక రక్షణ దొరకకపోవడమే. ఫాసిస్టులు తూర్పుకోటమీద దాడి చేస్తున్న సమయంలో సోవియట్ ఖైదీలను తమ శ్రేణులముందు నడిచేట్టు చేశారు. అప్పుడు దుర్గరక్షకులు ఆ ఖైదీలు యీవిధంగా అరవడం విన్నారు: ''కామ్రేడ్స్, కాల్పులు సాగించండి! మాకోసమని కాల్పులు మానకండి!''

మొదటినుండీ కూడా శత్రువులు తమ గూఢచారులను సోవియట్ ఆఫీసర్ల దుస్తుల్లోనూ, సోవియట్ సైనికుల దుస్తుల్లోనూ దుర్గంలోకి పంపించడానికి ప్రయత్నం చేశారు. వాళ్లల్లో ఒక్కొక్కప్పుడు కవ్వింపు చర్యదార్లు కూడా వుండేవారు. జర్మన్ ఖైదు శిబిరాలనుండి తప్పించు

కొని వచ్చిన వాళ్ళమని చెప్పుకుంటూ దుర్గరక్షకులకు భయాందోళనలు కలిగేట్టుగా పలురకాల పుకార్లను లేవదీసేవారు. ఒక్కొక్కప్పుడు విధ్వంస కులను కూడా పంపేవారు; వీళ్ళు ద్రోహపూరితంగా మన మనుషుల వెన్నున పొడిచేవారు. కాని త్వరలోనే సోవియట్ పటాలాలు యీ వంచకులను గుర్తు పట్టడం నేర్చుకొని ఆ తర్వాత వాళ్లని త్వరితగతిని పట్టుకొని కాల్చి చంపి వేశారు.

ప్రతిరోజూ విమానాలు బాంబుల వర్షాన్ని కురిపించి వెళ్లిపోయిన తర్వాత ఒక చిన్న విమానం కరపత్రాలను కిందికి విడుస్తూ ఆ దుర్గంపైన ప్రత్యక్షమయేది. యుద్ధారంభానికి పూర్వం బెర్లిన్‌లో అచ్చు అయిన ఆ కరపత్రాలలో, జర్మన్ పటాలాలు మాస్కోను వశపరచుకున్నాయనీ ఎర్ర సైన్యం శరణు అర్థించిందనీ యిక ప్రతిఘటన నిష్ప్రయోజనమనే హెచ్చరికలు ఉండేవి. ఆ తర్వాత ఆ విమానం గారిజన్‌కు సూటిగా విజ్ఞప్తి చేస్తూన్న కరపత్రాలను విడిచిపెట్టడం మొదలుపెట్టేది. నాజీ కామాండర్లు దుర్గరక్షకుల పట్టుదలనూ ధైర్యాన్నీ మెచ్చుకున్నారు. ఇక యుద్ధం చేయడంవల్ల వచ్చేలాభం ఏమీ లేదని రుజువుపరచేందుకు ప్రయత్నించారు. "గౌరవప్రదంగా లొంగిపోవచ్చున"ని రక్షణసేనవారికి విజ్ఞప్తిచేశారు. కాని దుర్గంలోని వారు యీ విజ్ఞప్తులన్నిటికీ కూడా ఫిరంగుల కాల్పులనే సమాధానాలుగా పంపారు. ఒక రోజున 84 వ రెజిమెంట్ విభాగపు రైఫిల్ సైనికులు కరపత్రాలను కిందికి వదలుతోన్న శత్రువిమానంపై కాల్పులు సాగించి పడగొట్టారు. మరొకసారి ఫామీన్ ఇన్‌ఫెంట్రీ సైనికులు యీ కరపత్రాలను రెండు మూడు డజన్లు సేకరించారు. ఒక వోల్గా జర్మను సోవియట్ సార్జెంట్-మేజరు ఆ కాగితాల ప్రతి ఒక్కదానిపైనా హిట్లర్ మీసాలతో వున్న ఒక పంది బొమ్మ గీసి దానికింద జర్మన్‌భాషలో యిలా వ్రాశాడు:

"ఫాసిస్టు పందులు సోవియట్ తోటలో అడుగుపెట్టలేవు!" ఒక యువ కమ్యూనిస్టు లీగ్ గ్రూపు శత్రువేటకై వెలుపలికి వెళ్లింది. ఆ రెజిమెంటు వారు త్వరలోనే ఒక జర్మన్‌ను ఖైదీగా పట్టుకున్నారు. ఆ తర్వాత అతని శరీరంనిండా ఆపాదమస్తకమూ ఆ బొమ్మలు గీసిన కరపత్రాలని అంటించి వేశారు. అతడు ఆ వేషంతోనే తన శ్రేణులకి తిరిగి వెళ్లిపోయేట్టు చేశారు.

బహు అరుదుగా వుండే యుద్ధ విరామసమయాల్లో జర్మన్ లౌడ్ స్పీకర్లు దుర్గంలోని వివిధ భాగాలలో వినబడేవి. వారు కూడా రేడియో ప్రసారం ద్వారా గారిజన్‌కు, అస్త్రసన్యాసం చేయమనీ ఎవరైతే లొంగి పోతారో వారికి "మంచి ఆదరణ, ఉత్తమమైన భోజనం, గాయాలకు చికిత్స" మొదలైన సదుపాయాలను కలుగజేస్తామని వాగ్దానం చేస్తున్నట్టూ విజ్ఞప్తి చేశారు. కాని రోజులు గడచిన కొద్దీ యీ ప్రసారాలు బాగా భయపెడుతున్నట్టుగా రూపొందాయి. ఎంతో ఆప్యాయంగా చేసిన విజ్ఞప్తులస్థానే, దుర్గరక్షకులంతా సంప్రదించుకొని లొంగి పోయేందుకొరకు ఒక అరగంట లేదా ఒక గంట వ్యవధిని మాత్రమే యిస్తున్నట్టూ ఈ వ్యవధి తర్వాత శత్రువులు "గారిజన్‌ను యీ అవనినుండి తుడిపెట్టేవేస్తామనీ, దుర్గ రక్షకులను పిండిపిండి చేసేస్తామని" బెదరించే ఆఖరి హెచ్చరికలు ప్రత్యక్షమైయ్యాయి. ఈ బెదరింపులకు కూడా కాల్పులతోనే సమాధానం చెప్పారు దుర్గరక్షకులు. వారు ఒక పర్యాయం మాత్రం "మేమంతా మరణించినప్పటికీ కూడా దుర్గాన్ని మాత్రం మీ వశం చెయ్యం," అని రక్తాక్షరాలతో లిఖించిన జెండాను ఉత్తరపు గేటుమీద ఎగరవేశారు.

జర్మన్లు ఆఖరు హెచ్చరికను యిచ్చిన తర్వాత మామూలుగా చేసే పని ఏమిటంటే దుర్గంమీద బాంబులు వేయడాన్ని ఆపు చేయడం. దాంతో దుర్గం అంతటా ప్రశాంతత నెలకొంటుంది. ఆ ప్రశాంతతను అనౌన్సర్

గొంతు మాత్రమే భగ్నం చేస్తుంది. అతడు కొద్దిపాటి విరామాలతోపాటు అంటుంటాడు: "పది నిమిషాలు మిగిలి వున్నాయి!" "అయిదు నిమిషాలే మిగిలి వున్నాయి!" గడువుకాలం అయ్యీఅవడంతోటే శత్రువిమానాల దాడితోపాటు జర్మన్ ఫీల్డ్ ఫిరంగులనుండీ, మోర్టార్‌నుండి వెలువడిన అగ్ని తుఫానుతో ఆ దుర్గం నిండి పోతుంది.

శత్రువులు భారీ బాంబులనూ, అంతకంటే పెద్ద బాంబులనూ ప్రయోగించడం మొదలుపెట్టారు. అవి ఎంతటి బలమైన దుర్గపు కట్టడాలనైనా ధ్వంసం చేయగల శక్తి కలిగినటువంటివి. దుర్గరక్షణసేనలు తలదాచుకొని వున్న అట్టడుగు నేలమాళిగల కాంక్రీటు గచ్చులు బీటలు వారేవి. ప్రేలుడుల అదురువల్ల అక్కడి మనుషుల ముక్కులనుండీ చెవులనుండీ నెత్తురు స్రవించింది.

శత్రువులు ముఖ్యంగా జూన్ 29 వ తేదీన భారాతిభారమైన బాంబులను ప్రయోగిస్తూ దాడిచేశారు.

ఆ రోజు ఉదయం జర్మన్ ఆఫీసర్లు పట్టణంలోని పెద్దపెద్ద భవనాల పైకప్పులమీద నిలబడి బైనాక్యులర్స్‌తో దుర్గాన్ని చూస్తూ వుండటాన్ని బ్రెస్ట్ పట్టణవాసులు గమనించారు. అప్పటికే ఫాసిస్టులు పట్టణవాసులతో ఆ నాడు దుర్గంమీద తెల్లజెండా తప్పకుండా ఎగురుతుందని ప్రగల్భాలు పలికారు. దుర్గంమీద డజన్లకొద్దీ బాంబర్ విమానాలు గర్జనలు చేస్తున్నాయి; ఆ మరుక్షణానే మొత్తం పట్టణం అంతా చెవులు చిల్లులుపడే బాంబుల పేలుడుతో యీ మూలనుండి ఆ మూలవరకూ కంపించిపోయింది. ఆ భూకంపపు అదురుకు పట్నంలోని గోడలు కూడా పగిలిపోయాయి. దుర్గం యావత్తూ ధూళిధూమాలతో నిండిపోయింది. బాగా దూరంనుండి పర్యవేక్షిస్తున్న వారికి బాంబుల ప్రేలుడువల్ల ప్రేళ్లతోసహా

గాలిలో బాగా ఎత్తుకి ఎగిరిపోయిన చెట్లు అగుపించాయి. అలాంటి దాడికి ప్రాణం వున్న ఏ జీవి కూడా బ్రతికి వుండదనడంలో ఎట్టి అతిశయోక్తి లేదనే చెప్పాలి.

అయినా, దాడి అంతమై ధూళిధూమాలు పూర్తిగా తొలగిపోయిన తర్వాత జర్మన్ ఆఫీసర్లు యిళ్ల పైకప్పులమీదనుండి తమ బైనాక్యులర్స్‌తో దుర్గంవైపు చూశారేగాని పాపం లాభం లేకపోయింది. ఎంత కన్నులు పొడుచుకొని చూసినా ఆ శిధిలాలలో మాత్రం ఎక్కడా తెల్లజెండా అగుపించ లేదు. ఆ జెండాను ఎగరవేసేందుకు ఒక్క వ్యక్తైనా కూడా బ్రతికి వుండ లేదేమోనని వాళ్లు అనుకొని వుండవచ్చు. కొద్ది నిమిషాలు గడచిపోయాయి. మళ్లీ మెషీన్‌గన్‌ల చప్పుడూ రైఫిల్ కాల్పుల శబ్దమూ వినిపించింది. ఈ బాంబుల పెనుతుఫానునుండి ఎక్కడా నమ్మడానికే వీల్లేనట్టుగా తప్పించుకుని బ్రతికిన దుర్గరక్షకులు తమ పోరాటాన్ని యింకా కొనసాగిస్తూనే వున్నారు.

# అగ్నిజ్వాలావలయంలో

వినాశకరములైన విమాన దాడులూ, ఎడతెగకుండా కురిపించే మోర్‌టార్‌గుళ్ల వర్షమూ మెషీన్‌గన్ కాల్పులూ, అంతకంతకు అధికమవుతూన్న ఇన్‌ఫెంట్రీ దాడులూ సంఖ్యలోనూ సాంకేతికంలోనూ శత్రువులయొక్క అపారమైన ఆధిక్యతా — యివన్నీ కూడా దుర్గరక్షణ సేనయొక్క వీరోచిత పోరాటాన్ని ఎంతో కష్టతమం చేశాయి. ఐతేనేం యివన్నీ కూడా మిలిటరీ స్వభావాన్ని కలిగినటువంటి కష్టపరంపరలే. సైనికునికి తప్పనటువంటివే. అతడు వీటిన్నిటికీ ముందుగానే సిద్ధపడివుంటాడు.

ఉన్న తేడా అల్లా ఏమిటంటే యిక్కడ యివన్నీ కూడా విపరీతమైన స్థాయిలో వుండడమే.

ఏమైతేనేం, ముట్టడి మొట్టమొదటి రోజులనుండీ కూడా గారిజన్‌ను అపూర్వమైన విపత్కర పరిస్థితులలో వుండే మరోవిధమైన కష్టాలు కూడా యీ కష్టపరంపరలకు జత అవుతూ వచ్చాయి. ఇది కేవలం యుద్ధం చేయడమనే విషయమే కాదు. ముట్టడింపబడిన దుర్గరక్షణసేనలో సైని కుల జీవితమంతా తన శారీరక శక్తినీ నైతిక శక్తినీ మానవాతీతంగా పటిష్ఠం చేసుకోవలసి వచ్చింది. ఈ విచిత్రమైన పరిస్థితులే బ్రెస్ట్ దుర్గముయొక్క పురాణప్రసిద్ధమైన రక్షణకు అసామాన్యమైన వీరోచిత విషాద స్వభావాలని చేకూర్చిపెట్టాయి. అనన్యసామాన్యమైన ఈ వీరోచిత విషాద స్వభావమే దేశభక్తియుత మహాసంగ్రామ చరిత్రలో ఒక అపూర్వమైన పుటను లిఖించింది.

ఒదేస్స, సెవస్తోపొల్ పట్టణాలను కాపాడిన రక్షకుల ధైర్యసాహసాలూ, లెనిన్‌గ్రాడ్ వీరుల దృఢమైన నిశ్చలబుద్ధీ, అద్వితీయమైన వోల్గొగ్రాడ్ యుద్ధంలో పాల్గొన్న వారి వీరోచిత చర్యలూ, 1944–1945 సోవియట్ సైన్యాల విజయ శోభితములైన ఎదురుదాడులూ, సోవియట్ సైన్యం సాధించిన యీ స్తవనీయమైన విజయాలన్నీ కూడా సైనిక శౌర్యానికి ఉత్కృష్టమైన ఉదాహరణలుగా ప్రజల మనసులలో శాశ్వతంగా నిలిచిపోతాయి. యుద్ధం తొలి నెలలలో సోవియట్ సేనలు అనుభవమనే కఠిన పాఠశాలా శిక్షణకే గనక లోనుగాకపోయినట్లయితే, ఈ యుద్ధాల్లో సోవియట్ సైనికుడు ప్రదర్శించినట్టీ, ప్రపంచంలోకల్లా ఉత్తమ సైనికుడనే ఖ్యాతిని అతడికి గడించిపెట్టినట్టీ వాస్తవమైన యుద్ధరంగపు గుణగణాలు అనూహ్యములై వుండేవి. సైన్యాన్ని పరిరక్షించుకుందుకు వందలాది యుద్ధ

చర్యలలోనూ భారీస్థాయి యుద్ధాలలోనూ స్వల్ప సంఘర్షణలలోనూ సోవియట్ సైనికుల, ఆఫీసర్ల పదునెక్కింది, వారి యుద్ధనైపుణ్యం ఉన్నత స్థాయి పరిణతి నందుకుంది, పరాజయపు చేదును చవిచూసిన పిమ్మట పోరాడాలనే యిచ్ఛ మరింత దృఢతరమయింది, కష్టభూయిష్ఠమైన తిరోగమన కంటక పథాన వారు అడుగిడినప్పుడు, దురాక్రమణదారుని పట్ల ఏ భావం లోపించి వుండినట్టయితే భావి విజయాలు అసాధ్యములై వుండేవో అట్టి పవిత్ర ద్వేషంతో వారి హృదయాలు నిండిపోయాయి.

ముట్టడి వలయంలోనూ ఫిరంగి గుళ్ళూ బాంబుల వర్షంలోనూ ఆ దుర్గం ఒక చిన్న ఒదేస్స వలె ఒక చిన్న సెవస్తోపొల్ వలె వుందనే చెప్పాలి. లెనిన్‌గ్రాడ్ వీరులవలె ఆ దుర్గరక్షకులు భరింపరాని కష్టాలను ఓర్చుకుంటూ యుద్ధం చేశారు. వారు తమ బొందిలో ప్రాణాలు వున్నంతవరకూ ఆ దుర్గ శిథిలాలలో నిలబడి వోల్గోగ్రాడ్ వీరులవలె మొండి పట్టుదలతో పోరాడారు.

అయినా తమకూ మిగతా దేశానికీ అభేద్యమైన, ప్రాణాధారమైన సంబంధం వున్నట్టు ఒదేస్స, సెవస్తోపొల్, లెనిన్‌గ్రాడ్, వోల్గోగ్రాడ్ పట్టణాలకూ అనుక్షణమూ ప్రతినిత్యమూ తెలుసు. మహత్తరమైన మాతృభూమి యావత్తూ వాటి వెనుక నిలిచి వుంది. మొత్తం దేశం కళ్ళన్నీ ఆ పట్టణాలపైనే వున్నాయి. అవి సాగించుతోన్న అసమానమైన పోరాటంలో మహత్తర కమ్యూనిస్టు పార్టీ సంకల్పం వాటికి నిరంతరమూ ఆవేశం కల్గిస్తూండేది. సుప్రీం కమాండ్‌వారే వాటి చర్యలన్నిటినీ కూడా గట్టిగా, విశ్వసనీయంగా నడిపించారు. శత్రువులచే దిగ్బంధమైపోయిన ఆ వీరనగరాల గారిజన్‌లుకి ఏ సరఫరా కొరత రాకుండా మొత్తం దేశం పాటుబడింది. ఆ సేనల వీరోచితమైన పోరాటాన్ని యావత్ ప్రపంచానికీ పత్రికలూ,

రేడియో తెలియపరుస్తూనే వచ్చాయి. ప్రతి నోటా పరాక్రమశాలుర పేర్లే ప్రతిధ్వనించాయి.

బ్రెస్ట్ దుర్గ రక్షకులకు యిలాంటివేవీ లేవు. దేశం ఎదుర్కొన్న భయంకరక్షణాలలో, మాతృదేశం భవిష్యత్తు ఏమౌతుందో అని ప్రతి సోవియట్ వ్యక్తీ తన హృదయంలో ఆత్రతపడుతూన్నప్పుడు సరిహద్దువద్ద పోరాడుతోన్న యీ చిన్న గారిజన్‌ను అగ్ని మృత్యువుల కుడ్యం అడ్డి వేసింది. ఆ సేనకు వెలుపలనుండి అందిన వార్తలల్లా ఏమిటూ అంటే సోవియట్ సైన్యాన్ని తాము నాశనం చేశామనీ, మాస్కో తమ వశమైపోయిందనీ, సోవియట్ యూనియన్ తమకు లొంగి పోయిందంటూ నాజీ రేడియో ప్రచారకులు చేసిన అబద్ధపు ప్రచారమే. నాజీ కరపత్ర రచయితల అబద్ధపు వార్తా నివేదికలే. ఈ బ్రెస్ట్ దుర్గరక్షణసేనకు హెడ్‌క్వార్టర్స్‌నుండి ఉత్తరువులు లేవు. ఏ సరఫరాలూ విమానాలనుండి దిగలేదు. పత్రికల్లో వారిని గురించి ఏ వార్తలూ లేవు. వారు యింకా పోరాటం సాగిస్తున్నట్టు ఆ సమాయంలో మిగతా దేశానికి తెలియనే తెలియదు. మాతృదేశాన్ని గురించి, తూర్పు వైపుకు తిరోగమించిన తమ స్నేహితుల గురించి, తమ బంధువుల గురించి, తమకు ప్రియమైనవారి గురించిన ఆలోచనలను బాధాకలితమైన అనిశ్చయత్వం అనుసరించింది. ముందు ఏం జరగనుందో అన్న ఆలోచనలకు, శత్రువుల ఖైదులో మృత్యువు, తలవంపులు, అవమానాలు, అనేవే తప్ప వేరే సమాధానం లభించలేదు. తమ వీరోచితమైన పోరాటం గురించి ఎవరికీ తెలియదేమోననీ ఆఖరికి తమ పేర్లు కూడా ప్రజలకు తెలియకుండానే వుండి పోతాయేమోననీ వారు అప్రయత్నంగానే ఆలోచించడం మొదలుపెట్టారు. అయినా వారు తమ పోరాటాన్ని కొనసాగిస్తూనే వున్నారు. శత్రువులవల్ల దూరమైపోయిన మాతృదేశం ఆ దుర్గరక్షణ

సేనలోని ప్రతివ్యక్తి హృదయంలోనూ సజీవంగా ప్రతిబింబించడంవల్లనే వారు తమ పోరాటాన్ని కొనసాగించగలిగారు. వారు తమ పేరు ప్రఖ్యాతుల కొరకు పోరాడలేదు. ఆఖరికి తమ ప్రాణాలకోసమైనా పోరాడలేదు. త్వరలోనే ఎప్పుడో ఒకప్పుడు శత్రువులను తమ దేశంనుండి తరిమి వేయడం తథ్యం అనే గట్టి విశ్వాసంతో వారు దేశంయెడల తమ ధర్మాన్ని నిర్వర్తించారు.

భీకర యుద్ధాలలో పాల్గొని అశేషానుభవం సంపాదించుకున్న యుద్ధరంగం ప్రథమశ్రేణికి చెందిన ఏ అనుభవజ్ఞునికైనా సరే, బ్రెస్ట్ దుర్గ రక్షణసేన మొదటినుండి చివరివరకూ ఏలాంటి నమ్మశక్యంకాని కష్ట పరిస్థితులలో పోరాడిందీ ఊహించుకోవడం కష్టమైన పనే.

దుర్గంలోని ప్రతి అంగుళం నేల బాంబులతోనూ, ఫిరంగిగుండ్ల తోనూ దున్నినట్లైపోయింది. తూటాల శబ్దంతో గుండ్లధ్వనులతో ఆకాశం నిండిపోయింది. బాంబుల ప్రేలుడు శబ్దం మాత్రం రేయి యందు గానీ పగటి పూటగానీ ఆగిపోలేదనే చెప్పవలసివుంటుంది. ఎప్పుడూ యిచ్చే ఆఖరి హెచ్చరిక తర్వాత వుండే కొద్ది పాటి నిశ్శబ్దసమయం, దుర్గ రక్షణసేన అలవాటు పడిపోయిన ఎడతెగని బొంబార్డ్మెంటుకంటే యింకా ఎక్కువ భయంకరంగా వుంది.

అగ్నికారిణిబాంబులు, ఫిరంగిగుళ్లు, జ్వాలా శిఖల విసుర్లూ, విమా నాలుపైనుండి కిందికి విసిరే పెట్రోలు డబ్బాలు మొదలైనవి వాటిపని అవి చేసుకుంటున్నాయి. దుర్గంలో నిప్పు అంటుకుని మండిపోయే ప్రతీదీ దగ్ధమై పోయింది. 22 వ తేదీ ప్రాతఃకాలాన ప్రారంభమైన నిప్పు ఒక నెల వరకు కూడా ఆరలేదు, ఒక చోట ఆరిపోతోందీ అంటే ఎక్కడో వేరొక చోట కొత్తగా తలయెత్తుతోందన్నమాటే. ప్రశాంతంగా వున్న రోజుల్లో,

దట్టమైన నల్లని మబ్బు కప్పును మింగిన పాములె ఎటూ కదలలేక దుర్గం మీదే స్తంభించిపోయి వుండేది.

రవాణా బటాలియన్‌యొక్క శకటాలు పశ్చిమ బారకాసులకెదురుగా వున్న చౌకులో ఎన్నో రోజులపాటుగా తగలబడిపోతున్నాయేమో అక్కడ పోరాడుతోన్న 44 వ రెజిమెంటు సైనికులు ఆ రబ్బరు కాలుతూన్న ఘాటైన పొగర్లకు ఉక్కిరి బిక్కిరైపోయారు. వలయాకృతి బారకాసుల వాయవ్య విభాగంలో ఒక పెద్ద యూనిఫారం దుస్తుల స్టోర్‌కు నిప్పంటుకుంది. అక్కడినుండి వచ్చే పొగ ఎంత భరింపరానిదిగా వుందంటే ఆ పక్కనే వున్న బారకాసులలో ఉన్న 455 వ రెజిమెంటువారు తప్పనిసరిగా రెస్పిరేటర్లను ఉపయోగించవలసి వచ్చింది.

నేలమాళిగల్లోకి నిప్పు కూడా చొచ్చుకుపోయింది. పైన మండుతోన్న మంటలవల్ల ఉష్ణోగ్రత బాగా పెరిగిపోయి ఆ వేడికి ఇటుక గోడల్లో పగుళ్ళు అగుపించాయి. బాంబులు వేయడం ప్రారంభమవడంతోటే ఏర్పడిన మేఘాల తెరలో పేలుళ్లవల్ల పైకి లేచిన వేడి పొడి దుమ్ము, కార్డైటు కారపువాసనతో మిళితమైపోయింది. పొగకీ దుమ్ముకీ సైనికుల గొంతులూ నోళ్ళూ ఆర్చుకొనిపోయేవి. అవి వారి ఊపిరితిత్తుల లోలోతులకి చొచ్చుకుపోయి వారికి బాధాకలితమైన దగ్గునూ భరింపరాని దాహాన్ని పుట్టించాయి.

వేసవి రోజులు బాగా వేడిగా వున్నాయి. రోజురోజూ శవాల దుర్గంధం మరీ ఎక్కువైపోయి వెగటు కలిగిస్తోంది. ఆ శవాలను పూడ్చివేసేందుకని దుర్గరక్షకులు తమ రక్షణ స్థావరాలనుండి వెలుపలికి పాకుకుంటూ రాత్రిపూట వచ్చారు. అక్కడ శవాల సంఖ్య మరీ హెచ్చుగా వుండడంవల్ల వారు వాటిపైన పలుచని మట్టిపొరతో మాత్రమే కప్పగలిగారు. మర్నాడు సూర్యుడు తన వినాశకార్యాన్ని యథాప్రకారంగా కొనసాగించాడు. అప్పుడు గాలి వీచి

నప్పుడల్లా ఆ కుళ్లినశవాల భయంకరపు వాతావరణం కొద్దిగా చెల్లా చెదరై వారికి మంచిగాలిని పీల్చుకొనే అవకాశాన్నిచ్చేది.

ఇంతకంటే ఎక్కువ ఘోరమైన కష్టాలే వారిని ఎదుర్కొన్నాయి.

అక్కడ వారికి తగు ఆహారం లేదు. దాదాపు అన్ని భోజన సమాగ్రి నిల్వలూ యుద్ధం ఆరంభ గడియల్లో నాశనమైపోవడమో, లేదా దగ్ధమై పోవడమో సంభవించింది. కొంతకాలం గడచిన తర్వాత భోజన సామాగ్రి అక్కరనూ, ఆ నష్టాన్నీ ఇక వారు పట్టించుకోక తప్పింది కాదు. యుద్ధం చేయడంవల్ల కలిగిన విపరీతమైన నరాల వొత్తిడి కారణంగా అసలు వారికి మొట్టమొదటలో ఆకలే కలగలేదు. రెండో రోజున మాత్రమే వారు భోజన సామాగ్రికోసం వెదకడం మొదలుపెట్టారు. శిధిలమైపోయిన నిల్వలనుండి కొంత సరుకుని మట్టుకు వెలుపలికి లాగారు. రెజిమెంటల్ భోజనశాలల్లో కొంత భోజన సామాగ్రి బయటపడింది. కాని ఆ దుర్గ రక్షణసేన అంతటికీ భోజనం పెట్టాలంటే యింకా ఎక్కువ భోజన పదార్థాలు అవసరమయ్యాయి. రోజుకిరోజూ ఆకలిబాధ ఎక్కువై పోయింది. ఒక్కొక్కప్పుడు చనిపోయిన శత్రువుల జేబులనూ, సంచులనూ దుర్గరక్షణసైనికులు వెదకుతున్నప్పుడు వారికి బిస్కత్తులు, పంచదార ముక్కలూ, చాక్లేట్లూ, బిళ్లలూ దొరికేవి. వాటిల్లో ఎక్కువ భాగాన్ని నేలమాళిగల్లో తల దాచుకున్న క్షతగాత్రులకీ స్త్రీలకీ పిల్లలకీ యిచ్చేవారు. 44 వ రెజిమెంటు వంటయింటి సమీపంలోని ఒక చిన్న భోజన సామాగ్రి కొట్టుగదిలో వెన్నపీపా ఒకటి దొరికింది. అది రెండు రోజులవరకూ సరిపోయింది. మూడో నాడు 84 వ రెజిమెంట్ మనుషులు వంటింటి శిధిలాలల్లో చెమ్మగిలిపోయున్న సగం సంచినిండా బటాణీలు దొరికాయి. ఫామీన్ ఆజ్ఞల ప్రకారం ఆ బటాణీగింజలను బహు జాగ్రత్తగా



సైనికుడు నికొలాయ్ గ్రైవొరోన్స్కి

లెక్కపెట్టి ప్రతి ఒక్కరికి పంచిపెట్టారు. ఆ తర్వాత గారిజన్ సైనికులు యుద్ధంలో చనిపోయిన గుర్రాల మాంసం తినడం మొదలుపెట్టారు. కాని త్వరలోనే ఎండవేడిమి కారణంగా వారికి యీవిధమైన ఆహారం కూడా దక్క లేదు. జనమంతా ప్రాణాలతో వున్న అస్థిపంజరాల్లాగా తయారయ్యారు. వారి చేతులూ కాళ్ళూ బిగుతుగా చర్మంతో కప్పిన ఎముకలేనని చెప్పాలి. అయినా ఆ చేతులు మాత్రం తమ ఆయుధాలని యింకా గట్టిగానే పట్టుకొని వున్నాయి. తమ యుద్ధ సంకల్పాన్ని ఆకలి నాశనం చేయలేకపోయింది.

అన్నిరకాల మందులకూ కొరత ఏర్పడింది. మొదటి రోజున ఎంతో నెత్తురు స్రవించింది. ఎందరికో గాయాలు తగిలాయి. దాంతో నిలువవున్న బాండేజీలనూ, యుద్ధరంగపు గాయపుకట్టు సామాగ్రినీ పూర్తిగా వుపయోగించడం జరిగింది. బాండేజీలకని ఆడవాళ్లు తాము లోపలతొడుక్కునే దుస్తులని చించి యిచ్చారు. పక్కదుప్పట్లనూ దిండు గలేబులనూ ఆ విధంగానే ఉపయోగించారు. అయినా అవి యింకా సరిపోలేదు. ఏది కనిపిస్తే దాంతోనే జనం తమ గాయాలకు కట్టుకట్టుకున్నారు. లేదా ఏ కట్టూ కట్టుకోకుండానే ఒకవైపు నెత్తురు కారుతూ వున్నా సరే యుద్ధం చేస్తూనే

వున్నారు. నాజీ మోర్‌టార్ గుండు నుండి వెడలిన ఒక తునుక సైనికుడు నికొలాయ్ గ్రైవొరోన్‌స్కి కడుపును చీల్చివేసింది. అతని స్నేహితులు ఆ భయంకరమైన గాయానికి తమ చొక్కాలతో కట్టుకట్టారు. గ్రైవొరోన్‌స్కి యుద్ధశ్రేణిలో మూడు వారాలు వున్నాడు. బాయొనెట్ యుద్ధాలలో పాల్గొన్నాడు కూడాను. 333 వ రెజిమెంటుయొక్క బారకాసుల బేస్ మెంటులో షెల్‌షాక్ తగిలి క్షతగాత్రుడైన సరిహద్దు పరిరక్షక సైనికుడు వున్నాడు. అతని పేరు బొబ్రోవ్నొక్. అతడు స్మృతి తప్పుతున్నప్పటికీ కూడా రైఫిల్‌ను మాత్రం విడిచిపెట్టలేదు. స్మృతి వచ్చినప్పుడు అతడు నెమ్మదిగా కిటికీవద్దకు పాకుకుంటూ వెళ్లి తాను మళ్లీ స్మృతి తప్పిపోయేంత వరకూ ఆ దాడి చేస్తున్న శత్రు సైన్యాలమీదికి కాల్పులను సాగిస్తూనే వున్నాడు.

బాండేజీలను మార్చికట్టడానికి అక్కడ వారికి మరేదీ అందుబాటులో లేదు. అందువల్లనే ప్రమాదకరంగా క్షతగాత్రులైన వారి గాయాలు చీముపట్టిపోవడంవల్ల వారు డజన్ల కొద్దీ మరణించారు. నెత్తురు స్రవించిపోతున్నప్పటికీ, ప్రాణాలను కొరికి వేసే బాధకలగుతున్నప్పటికీ కొందరు క్షతగాత్రులు తమ శ్రేణులలోనే వుండిపోయారు.

దుర్గరక్షణసేనలోని వైద్యకార్యకర్తలు క్షతగాత్రుల బాధలకు ఉపశమనం కలిగించేందుకై చెయ్యగలిగినదంతా చేశారు. వీరోచితమైన శ్రద్ధాభక్తులతో వారు తమ విధిని నిర్వహించారు.

యుద్ధం ప్రారంభమైన తొలిక్షణాలనుండీ కూడా 333 వ రెజిమెంటులో సీనియర్ అసిస్టెంట్ సర్జన్‌గా పనిచేస్తున్న వలెన్‌తీన రయేవ్‌స్కాయ యుద్ధంలో గాయాలు తగిలిన వారికి శత్రువుల గుళ్లవర్షం మధ్యనే కట్టుకడుతోంది. ఎంత ప్రమాదకరమైన పరిస్థితినీ లెక్కచేయక పని



సీనియర్ అసిస్టెంట్ సర్జన్
వలెన్‌తీన రయేవ్‌స్కాయ, 1941

చేసిందేమో చివరికి ఒక గుండు తునుక తగిలి తానే గాయపడింది. ఇతరులను తీసుకొని వెళ్లినట్లే ఆమెని కూడా నేలమాళిగల్లోకి తీసుకువెళ్లారు. అక్కడ ఆఫీసర్ల భార్యలు గాయపడిన వారికి ఉపచారం చేస్తున్నారు. కాని దుర్గంలో యితర చోట్లలాగానే యిక్కడ కూడా మందులూ అదనపు బాండేజీలూ లేవు. అందువల్ల క్షతగాత్రులు భరించరాని బాధలు అనుభవించారు.

బ్యాగ్లర్ కుర్రాడు పధ్నాలుగేళ్ల పేత్య క్లీప ఇక్కడ కూడా సాయపడ్డాడు. అతడూ అతని స్నేహితుడూ ఒకవైపు కాల్పులు జరుగుతున్నప్పటికీ కూడా శిథిలమైపోయిన వైద్య యూనిట్ స్టోరువద్దకు పరుగెత్తారు. ఆ రాళ్లకుప్పకింద కొద్దిగా బాండేజీలూ మందులూ వున్నట్టు కనుగొన్నారు. ఈ పధ్నాలుగేళ్ల కుర్రవాని ధైర్యసాహసాల పుణ్యమా అంటూ డజన్లకొద్దీ క్షతగాత్రులు మృత్యునోటనుండి బైటపడ్డారు.

బ్రెస్ట్ దుర్గంయొక్క అసలైన వీరనారి రయీస అబకూమొవ. ఆమె చిన్నదే. అసిస్టెంట్ సర్జన్‌గా పనిచేస్తోంది. దుర్గంపైన మొదటి ఫిరంగి గుళ్లు పడేపడటంతోటే వృద్ధురాలైన తల్లిని యింటివద్దే వదిలేసి ఆమె తన మందుల సంచీని తీసుకొని, మధ్యదీవికి దారితీసే వంతెనవద్దకు పరుగెత్తింది. అక్కడ ముఖ్యంగా శత్రువుల కాల్పులు చాలా ఎక్కువగా వున్నాయి. వంతె

నకు వెళ్ళే దారినిండా క్షతగాత్రులే. నాలుగు వైపులా నాజీల ఫిరంగి గుళ్ళు పేలుతున్నాయి. తూటాల మూలుగు ధ్వని, పైనుంచి పడుతూన్న బాంబుల శబ్దంతోనూ, వాటిని వేస్తున్న విమానాల గర్జనతోనూ మిళితమైపోయింది. అయినా అబకూమొవ మాత్రం ఒక్కొక్క క్షతగాత్రునికీ కట్టుకట్టుతూ వారిని సురక్షితమైన స్థలంలోకి తీసుకు వెళ్తోంది. ఆమె తన మందుల సంచీలోని బాండేజీ సామాగ్రి సంపూర్ణంగా అయిపోయినప్పుడు మాత్రమే ఆమె తన పనిని ఆపుచేసింది.



అసిస్టెంట్ సర్జన్ రయీాస
అబకూమొవ, 1941

తర్వాత ఆమెకు దగ్గర్లోనే ఆఫీసర్ల బసలలో వున్న స్త్రీల సంగతీ పిల్లల సంగతీ జ్ఞాపకంవచ్చి వాళ్ళను చూసేందుకని పరుగెత్తింది. సమీపంలో వున్న భవనాలలోని ఆఫీసర్ల భార్యలనీ పిల్లలనీ ఒక దగ్గరకు చేర్చి అక్కడికి దగ్గర్లోనే వున్న తూర్పు కోట గోడలవద్దకి వారిని తీసుకువెళ్ళింది. వారికి కోట కొట్లు ఒకదానిలో రక్షణ చిక్కింది. ఈ సమూహానికి నాయకత్వం వహించిన మేజర్ గవ్రీలొవ్ ఆ మరుక్షణానే రయీాస అబకూమొవకూ యింకా యితర స్త్రీలకీ క్షతగాత్రుల గాయాలకు కట్లుకట్టే పనిని పురమాయించాడు.

మంచి చాకచక్యంతో, గాయాలను మాన్పే వైద్యురాలి చలవైన హస్తాలతో పొడుగ్గా వున్న యీ యువతిని దుర్గరక్షణసైనికులందరూ ఎరు

గుదురు. తూటాలను లెక్కచేయకుండా ఆమె అనేక పర్యాయాలు యుద్ధ రంగం ముందలి ప్రదేశానికి వచ్చి శత్రువులు కళ్ళెదుటనుండే క్షతగాత్రు లను యీడ్చుకుంటూ రక్షణ ప్రదేశానికి తీసుకు వెళ్ళేది. కోటలో ఏర్పాటు చేసిన తన చిన్న ఆస్పత్రిలో బాండేజీలూ మందులూ అయిపోయినప్పటికీ బాధను నివారించే మార్గాలను మాత్రం ఆమె ఎలాగో కనిపెట్టేది. బాండేజీల కోసమని మగవాళ్ల చొక్కాలను చించియిచ్చేవారు. బల్లచెక్క ముక్కలనూ, విరిగిపోయిన రైఫిళ్ల మడమలనూ కట్టుకట్టే బద్దలుగా వుపయోగించేవారు.

దగ్గర్లో వున్న మట్టిగట్లలో కొన్ని మంచుగడ్డలు నిలువచేసి వున్నట్టు కొందరు సైనికులు తెలుసుకోగానే రయీస అబకూమొవ అక్కడికి తక్షణమే పరుగెత్తింది. అక్కడికి వెళ్లడం చాలా అపాయకరమైన విషయం. ఎందు వల్లనంటే అక్కడికి వెళ్లాలంటే ఒక నాజీ మెషీన్‌గన్నునుండి గుళ్లవర్షం పడుతూన్న మైదానంలో నేలమీద ప్రాకుకుంటూ వెళ్లవలసి వుంటుంది. ఐనా, ఆ గుళ్లను ఏమాత్రమూ లక్ష్యంచేయకుండా ఆ ప్రదేశంగుండా అనేక సార్లు వెళ్లింది అబకూమొవ. విపరీతంగా గొంతులార్చుకుపోతోన్న క్షతగాత్రులకు ఆ మంచు గడ్డలవల్ల దాహంతీర్చాలనే అపేక్షతోనే ఆమె ఆ సాహసానికి పూనుకుంది.

చిట్టచివరివరకూ కూడా రయీస అబకూమొవ ఒక డాక్టరుగా తన విధ్యుక్తధర్మాన్ని నిర్వహించింది. చాలా రోజులు గడిచిన తర్వాత కోట పరిస్థితి నిరాశాజనకమైపోయినప్పుడు కమాండరు అక్కడి స్త్రీలనీ పిల్లలనీ ఖైదీలుగా శత్రువులకు ఒప్పగించేందుకు నిశ్చయించాడు. కాని ఆమె మాత్రం వాళ్లతోపాటు వెళ్లడానికి నిరాకరించింది. ఏదేమైనాసరే, క్షత

గాత్రులతోపాటే తానూనూ అంటూ ఆమె తన తల్లితో అక్కడే వుండి పోయింది.

ముట్టడి సమయంలో దుర్గరక్షకులు భరింపశక్యంగాని అనేక విషమ పరీక్షలకు లోనుకావలసి వచ్చింది. క్షతగాత్రులకూ, గాయాలుతగలని వారికీ, అందరికీ అన్నిటికంటే ఎక్కువ కష్టమైన పరీక్ష ఏమిటంటే అను క్షణమూ గొంతులనార్చి వేసే వెర్రిదాహం. దీవులపైన నిర్మాణమైన ఆ దుర్గం నలువైపులా నదులూ కాలవలూ వున్నప్పటికీ కూడా దుర్గంలో నీళ్లు లేకపోవడమే ఒక విచిత్రమైన విషయం.

జర్మన్లు బాంబులు వేయడం మొదలుపెట్టిన తొలిక్షణాలలోనే నీటిసరఫరా విధానం పాడైపోయింది. దుర్గంలోపల బావుల్లేవు. నీళ్లను పట్టి నిలువ వుంచలేదు కూడాను. మొదటి రోజున ముహవేత్స్, బూగ్ నదులలోని నీటిని తీసుకొనే అవకాశం చిక్కింది. కాని శత్రువులు ఆ నదుల గట్లను వశపరచుకున్న తక్షణమే నీరు తెచ్చుకుందుకు వచ్చే మార్గాలన్ని టినీ అందుబాటులో లేకుండా వుండేట్టుగా వారు మెషీన్‌గన్‌లను నది గట్టునున్న పొదలలో వుంచారు. ఇప్పుడు ఆ మంచినీళ్లను తీసుకురావడానికై వెళ్లిన ధైర్యశాలురంతా మరణానికి గురికావలసి వచ్చింది. ఈ దాహం అత్యంత భయంకరమైన సమస్యగా పరిణమించింది. ఆ సమస్య పరిష్కరింప రానిదిగా తయారైంది. రాత్రులందు కూడా నదివద్దకు ప్రాకుకుంటూ వెళ్లడం ఎంతో ప్రమాదమైన విషయం. మొత్తం గట్టంతా మాతా బీచువ్వల వెలుగుతో పిండి ఆరబోసినట్టు వుంది. మెషీన్‌గన్‌లు కాపలాకుక్కల వలె అప్రమత్తతతో వుంటాయి. ఏమాత్రం ఆకు అల్లాడినా, నదిగట్టు నున్న గడ్డిలో కదలిక అగుపించినా అవి విపరీతంగా కాల్పులు సాగిస్తాయి.

అయినప్పటికీ రాత్రిపూట కొద్దిమంది ఎలాగో ఒకలాగున మంచి నీళ్లను పట్టుకు రాగలిగారు. నీళ్లు తీసుకుడానికి వెళ్లిన మనిషి నీళ్లు తెచ్చే పాత్రకున్న లోహపు పిడిని పండ్లతో గట్టిగా కరచిపట్టి, పైన మతాబీచు వ్వల వెలుగు వెలిగినప్పుడల్లా ప్రాణాలు బిగపట్టుకొని నేలకు అంటుకుని పోయి, పొట్టమీద ప్రాకుకుంటూ నది గట్టుకు వెళ్తాడు. నదిగట్టును అంటి తేలుతూన్న అనేక శత్రువుల శవాలని పక్కకు నెట్టివేసి, అతి జాగ్రత్తగా ఎక్కడా నీళ్లచప్పుడు అవకుండా చూసుకుంటూ ఆ పాత్రను నింపుకుంటాడు. ఆ తర్వాత నెమ్మదిగా నిశ్శబ్దంగా వచ్చిన దారినే వెనక్కి వెళ్లిపోతాడు. అతడు ఆ అమూల్యమైన పాత్రను పట్టుకొని బారకాసులలో నడుస్తూ వుంటే అక్కడున్న మనుషులు అతడు పట్టుకొచ్చిన నీళ్లవైపు చూడకుండా మొహాలని తిప్పేసుకుంటారు. ఆ నీళ్లల్లోని ఒక్క చుక్కనైనా వారు అడగరు. తెచ్చిన మొత్తం నీటిని నేలమాళిగల్లోకి తీసుకు వెళ్తారు. అక్కడున్న ఆడవాళ్లకీ, పిల్లలకీ, బురదగానూ నెత్తురుతో రోజారంగున వున్న ఆ నీటిని అతి జాగ్రత్తగా ఒక్కొక్కరికి ఒక్కొక్క గుక్కెడు సరిపోయేటట్టు ఒక జర్మన్ ఫ్లాస్క్ మూతతో కొలిచి యిస్తారు.

కాని యుద్ధశ్రేణిలో వున్న వారికి మాత్రం నీళ్లు లేవు. వాళ్లు శత్రువు కాల్పులకింద వున్న ముహవేత్స్‌ను దాటుతూ శత్రువుపై ఎదురుదెబ్బ తీసేప్పుడు మాత్రమే వాళ్లల్లో బహు కొద్దిమంది ఎలాగో ఒక లాగున ఒకటి రెండు గుక్కలను మింగ గలిగేవారు. కాని మిగతా సమయమంతా దాహంవల్ల చిత్రహింసకు గురి అయ్యేవారు. వేడి, దుమ్ము, ధూమం యివి వారి బాధను పదిరెట్లు అధికం చేశాయి. వారి గొంతులు ఎండిపోయి పిడుచకట్టుకుపోయాయి. వారి నోళ్లు దుమ్ము అనే చర్మంతో చేయబడినట్టున్నాయి. తడి ఆర్చుకుపోయిన వారి నాలుకలు భరింప శక్యంగానంతగా

గరుకుతేలి, పచ్చిపుళ్ళు అయిపోయాయి. వేడి గాలిని పీల్చిన ప్రతి సారీ కూడా వారి ఊపిరితిత్తులు మండిపోయినట్లుండేది. బగా అలసిపోయిన సైనికులలో ఏ ఒకరైనా అలా కొన్ని నిముషాలపాటు కునుకు తీసే సరికల్లా అతడు నీళ్లనీ నదులనీ సరస్సులనీ ఉపశమాన్ని కలిగించే చల్లని, మంచినీళ్ల సముద్రాలనీ కలలు కనేవాడు. కాల్పులవల్లగానీ, తనకంటె మెలకువగా వున్న పక్కమనిషి తనను మెల్లగా తట్టినప్పుడుగానీ అతడు మేల్కొని తాను కన్నది కలేనని గ్రహించినప్పుడు అతనికి నిజంగా వెర్రెత్తినట్లనిపించేది. ఒక్కొక్కప్పుడు మానవుని బలం చిత్రహింసని సహించలేదు. దాహంవల్ల మనుషులకు వెర్రెత్తిపోవచ్చు.

నేళమాళిగల్లో, బాయొనెట్లతోనూ కత్తులతోనూ బావులను తవ్వే ప్రయత్నం జరిగింది. గోతులు మాత్రం త్వరలోనే పడ్డాయి. అయినా లోతుకు తవ్వడం అసంభవమైపోయింది. 84 వ రెజిమెంటు విభాగంలో అలాంటి లోతులేని ఒక బావిలో మొత్తం రోజంతటికీ ఒక తపేలా నీళ్లు మాత్రమే తీయగలిగారు. ఆ నీళ్లు తీవ్రంగా గాయపడ్డవారికే చాలవు. తూర్పుకోట సమీపంలో యింతకంటే లోతైన బావిని తవ్వారు. కాని దానిని ఒక మురికి కాలవదగ్గర తవ్వినట్టు తేలింది. ఆ బావిలోని నీళ్లు తాగడానికి వీల్లేకుండా అయిపోయాయి.

వర్షం అనేది ఎన్నడూ విననటువంటి అద్భుతకార్యంగా ప్రజలు వర్షాన్ని కలగన్నారు. రోజురోజుకీ ఆకాశం మేఘరహితమైపోయింది. వేసవి ఎండలు నేలని మాడ్చివేస్తున్నాయి. ప్రతిరోజూ చిత్రవధ చేసివేస్తోన్న దాహం ద్విగుణీకృతమౌతూ భరింపరానిదిగా తయారయింది.

యుద్ధంచేస్తోన్న వ్యక్తుల కష్టాలు అసలే భయంకరంగా వున్నాయి. పిల్లలు, ఆడవాళ్లు పడుతూన్న అగచాట్లు చూడాలంటే వారికి మరీ భయాన

కంగా వుంది. కుటుంబాలతో వున్న ఆఫీసర్లు ఆకలిదప్పికలవల్ల సంభవించే మృత్యువు తమ తల్లులనూ భార్యాపిల్లలనూ క్రమక్రమేణా సమీపిస్తుండటాన్ని కళ్లారా నిస్పృహతో చూస్తున్నారు. చర్మం ఎముకులకు అంటుకుపోయిన తమ బిడ్డలను చూస్తున్న వ్యక్తులు వారి బాధను తప్పించేందుకని ఎటువంటి త్యాగాన్నయినా చేయడానికి సిద్ధపడ్డారు. ఏ కొద్దిగానో లభించిన అన్నపానాదులలో ఎక్కువ భాగం పిల్లలకు యిచ్చారు. తీవ్రంగా గాయపడ్డవారు కూడా తమకు లభించే కొద్దిపాటి రేషన్‌ను సహితమూ ఆ రేషన్‌ను చిన్నపిల్లలకు యివ్వవచ్చును కదా అని నిరాకరించారు.

స్త్రీలు తమ పిల్లల్ని వెంటతీసుకొని శత్రువులకు ఖైదీలుగా లొంగిపోవడం మంచిదని అనేకసార్లు సలహాలు వచ్చాయి. కాని ఎన్నాళ్లవరకైతే తమ పిల్లల ప్రాణాలు నిలబెట్టుకోగలిగే అవకాశం లభిస్తుందో అన్నాళ్లు కూడా శత్రువులకు ససేమిరా లొంగమన్నారు. ఫాసిస్టులకు ఖైదీలుగా పట్టుబడడం అంటే దుర్గాన్ని రక్షిస్తోన్న మనుషులకు ఎలాంటి హేయమైన భావం కలుగుతుందో, అలాంటి భావమే ఆ స్త్రీలకు కూడా కలిగింది.

దుర్గంలో వున్న పవర్‌స్టేషన్ సమీపంలో ఫాసిస్టులు కొంతమంది స్త్రీలనూ పిల్లలనీ పట్టుకున్నారు. ఆ సముదాయంలో బ్యాండు సార్జెంట్-మేజర్ ఇవాన్ జేన్‌కిన్‌యొక్క భార్య, అతని పధ్నాలుగేళ్ల కుమార్తె వాల్య వున్నారు. అక్కడికి దగ్గర్లోనే పొతాపొవ్, కిజెవాతొవ్‌ల సైనికులు 333 వ రెజిమెంట్ బారకాసులని రక్షిస్తూన్నారు. హిట్లరు సైనికులు ఖైదీలను వెనుక భాగానికి పంపించే ముందు ఒక నాజీ ఆఫీసరు వాల్యను, ఆమె తల్లి ఎంత బతిమాలినా లెక్కచేయక, ఆ ఖైదీల శ్రేణినుండి వెలుపలికి లాగి, రైఫిలు, మెషీన్‌గన్ కాల్పులు వస్తోన్న బారకాసులవైపు చూపి వాళ్లు గనక తక్షణమే లొంగిపోవనట్లైతే వాళ్లని "మట్టికింద నలిపేస్తా" మని చెప్ప

మని ఆ పిల్లని ఆజ్ఞాపించాడు. రయ్‌మని దూసుకుపోతోన్న తూటాలలోకి పేలిపోతోన్న ఫిరంగి గుండ్ల మధ్యకి అతడు ఆ పిల్లని తోసివేశాడు. ఆపిల్ల కాళ్ళులు సాగిస్తోన్న బారకాసులవైపుకు పరుగెత్తింది.



వాల్య జేన్‌కిన, 1941

అదృష్టవశాత్తూ ఆ దుర్గరక్షకులు ఆమెను గుర్తుపట్టి కాల్పులను ఆపుచేశారు. ఆమె బేస్‌మెంటు కిటికీలలో ఒక దానివద్దకు రాగానే లోపలికి లాగారు. ఆమెను వెంటనే తమ సీనియర్ లెఫ్టినెంట్ పొతాపొవ్‌వద్దకు తీసుకువెళ్ళారు. ఆ పిల్ల నాజీల అంతిమ హెచ్చరికను అతనికి తెలిపింది.

నిజానికీ, శత్రువుల హెచ్చరికను అంగీకరించాలానే తలపు ఎవ్వరికీ లేదు. ఆమె యిక దుర్గరక్షకుల సమాధానంతోపాటు నాజీ ఆఫీసరు వద్దకు వెళ్ళవచ్చునని తెలుపగా ఆమె అందుకు నిరాకరించింది. తన తల్లి ఫాసిస్టుల బందీగా వున్నప్పటికీ కూడా, ఫాసిస్టుల చేతుల్లో వుండడమనేది ఫిరంగి గుళ్ళూ, బాంబుల పేలుళ్ళకంటే ఎక్కువ భయంకరమైన విషయంగా ఆ అమ్మాయి భావించింది. ఆ నేలమాళిగలో వీరోచితంగా పోరాడుతోన్న ఆ సైనికుల మధ్యనే ఉండటం మంచిదిగా భావించింది వాల్య.

కాబట్టి ఆమె క్షతగాత్రులకు ఉపచారం చేస్తున్న స్త్రీలకు సహాయ పడుతూ అక్కడే ఉండిపోయింది.

ప్రమాదకరంగా గాయపడిన సైనికులను స్త్రీలు తమ కన్న బిడ్డల్ని పోషించుకుంటున్నట్టే చూసుకుంటూ వారి గాయాలకు కట్లుకట్టారు. కొందరు స్త్రీలు, ఆడపిల్లలూ కాల్పులు సాగిస్తోన్న సైనికులకు ఆ కాల్పుల మధ్యనే మందుగుండు సామాగ్రిని అందించడంలో సహాయపడ్డారు. కొంతమంది ఆయుధాలను చేపట్టి తమ భర్తలూ, తండ్రులూ, అన్నల పక్కనే నిలబడి యుద్ధంచేశారు కూడాను.

కాత్య తరస్యూక్ అనే యువతి యువకమ్యూనిస్టు లీగు సభ్యురాలు. ఆమె ఒక ఆఫీసరు భార్య. ఆమె కథని కూడా మరచిపోకుండా భద్రంగా వుంచారు. ఆమె ఒక పల్లెటూరిలో ఉపాధ్యాయురాలు. యుద్ధం యిక కొద్ది రోజుల్లో మొదలౌతుందనగా ఆమె తన భర్తతో సెలవు గడిపేందుకని దుర్గానికి వచ్చింది.

మొదట కాత్య నేలమాళిగలోని క్షతగాత్రుల యోగక్షేమాలు చూసు కుంటూ యితర స్త్రీలతోపాటే ఉండిపోయింది. ఆమె భర్త లెఫ్టినెంట్ తరస్యూక్, అతని మనుషులూ శత్రువుల దాడులను తిప్పికొడుతున్నారు. ఎప్పుడైతే అతని మనుషులలో చాలామంది గాయపడడమో, వీరస్వర్గాన్న లంకరించడమో సంభవించిందో ఆ మరుక్షణానే తరస్యూక్ స్వయంగానే అక్కడి భారీ మెషీన్‌గన్‌ను తన ఆధీనంలో తీసుకొన్నాడు. అతడు దానిని ఒక పెద్ద చెట్టుమొదలు దగ్గర నెలకొల్పి ప్రశాంతంగా, గురితప్పకుండా కాల్పులను సాగిస్తూ శత్రువుల దాడులను ఒక దాని తర్వాత ఒక దానిని తిప్పి కొడుతున్నాడు. ఆ ఒంటరి మెషీన్‌గన్నర్‌పైన శత్రువుల మోర్ టార్ కాల్పులు సాగించాయి. త్వరలోనే ఆ చెట్టూ మసి బొగ్గై పోయింది.

అక్కడ కేవలం మెలికలు తిరిగిపోయిన బోదె మాత్రమే మిగిలింది. అనేక గాయాలు తగిలినప్పటికీ శత్రువుల గుండు తగిలి చనిపోయేవరకూ అతడు యుద్ధంచేస్తూనే వున్నాడు.

అయినా ఆ మెషీన్‌గన్ మాత్రం అట్టే కాలం ఊరకనే వుండలేదు. తరస్యూక్ స్థానాన్ని అతని మనుషులలో ఒకరు అందుకున్నారు. తన భర్త మరణవార్త ఎప్పుడైతే కాత్య చెవుల పడిందో వెంటనే ఆమె నేల మాళిగనుండి వెలుపలికి వచ్చి చీలికలైపోయిన ఆ చెట్టువద్దకు పాకుకుంటూ వచ్చింది. అక్కడ మెషీన్‌గన్ యింకా కాల్పులను సాగిస్తూనే వుంది. కొద్ది సేపట్లోనే ఆ మెషీన్‌గన్నర్ కూడా మరణించాడు. అప్పుడు కాత్య ఆ మెషీన్ గన్‌వద్ద బోర్లా పడుకొని గుండు తునుక తగిలి ప్రాణాంతకంగా గాయ పడేవరకూ కూడా కాల్పులను సాగించింది. కాత్య వీరోచితంగా పోరాడి మర ణించిన ప్రదేశంలోని ఆ చీలిపోయి పెట్లిపోయిన చెట్టుబోదెను బ్రెస్ట్ పట్టణ ప్రజలు ఆ రోజునుండీ "సమరవృక్షం" అని పిలుస్తూ వచ్చారు.

దుర్గరక్షణ స్థలాలలోని వివిధ విభాగాలలో స్త్రీలు రైఫిళ్లనూ, పిస్తోళ్లనూ, చేతిబాంబుల్నీ మోసుకువెళ్తుండడం సర్వసామాన్యమైన దృశ్యమే. ఆ వీరాంగనలలోని చాలామంది పేర్లు తెలియకపోయినప్పటికీ వారు తమ భర్తలతో పోరాడిన విషయం మనికి తెలుసు. దుర్గనగరంపై అగ్ని తుఫానుతో దాడిచేసిన శత్రువులలో దుర్గరక్షణ పోరాటంలో సోవియట్ "స్త్రీలపటాలం" పాల్గొంటోందనే పుకార్లు చలరేగడానికి కారణం ఏమిటో మనం అర్థం చేసుకోవచ్చు.

# వీరుల మరణం

ఎడతెగని ఫిరంగి గుండ్లతోనూ, ఎక్కడా ఆగని బాంబుల వర్షంతోనూ, తెంపులేని పోరాటంతోనూ నిన్నటివలె నేడూ, నేటివలె మరునాడూ యీవిధంగా రోజులు గడచిపోయాయి. ప్రతిప్రాతఃకాలమూ తూర్పు దిశను ధూళి ధూమాల వెనుక సూర్యుడు ఉదయించినప్పుడల్లా, తమ కష్టాలు గట్టెక్కేందుకు యీ రోజు ఆఖరి రోజు కావచ్చుననే ఆశ, ఎన్నాళ్లనుండో ఎదురుచూసిన సోవియట్ సైన్యంయొక్క ఫిరంగుల గర్జన యీ నాడు తప్పకుండా వినగలమేమోననే ఆశ ఆ దుర్గరక్షకుల హృదయాలలో చెలరేగేది. ప్రతి సాయంత్రమూ పశ్చిమదివిలోని మోడువోయిన చెట్ల వెనుక సూర్యుడు అస్తమించినప్పుడల్లా ఆ ఆశ పగటి వెలుగుతోపాటే సమసిపోయేది.

ఏమైతేనేం మొట్టమొదటినుంచీ కూడా ఆ దుర్గరక్షణసైనికులు తమకు సహాయం లభిస్తుందనే నిస్తబ్ధతా నిరీక్షణకు కట్టుబడి ఉండకూడదనీ, శత్రువుల దాడులను తిప్పికొట్టడమే కాకుండా ముట్టడిస్తోన్న పటాలాల వలయాన్ని ఛేదించుకొని పోవడానికి ప్రయత్నించాలనీ కృతనిశ్చయులై వున్నారు. పట్టణానికి ఆవలగా తూర్పుదిశకు బైలొరష్యాయొక్క బ్రహ్మాండమైన అడవులూ, దాట శక్యంగాని బురద నేలలూ విస్తరించి వున్నాయి. దుర్గానికి ఈశాన్యదిశకు ఇరవై ముప్ఫై మైళ్లదూరంనుండీ బెలొవేజ్‌స్కాయ పూశ్చయొక్క దట్టమైన అడవులు ప్రారంభమయ్యాయి. వారు ఆ అడవులను గనక చేరకోగలిగినట్లైతే తమ పోరాటాన్ని కొనసాగించుకో

గలుగుతారు. వారు పార్టిజాన్‌లుగా తయారై యుద్ధరంగం చేరేంతవరకూ కూడా పోరాడగలుగుతారు.

శత్రువలయాన్ని ఛేదించుకుపోవాలనే ప్రయత్నాలు రక్షణశ్రేణి అన్ని విభాగాలలోనూ జూన్ 24 నుండే ప్రారంభమయ్యాయి. కాని ఆ శత్రువలయం దట్టమైనటువంటిది. హిట్లరు సైనికులు అప్రమత్తులై వున్నారు. ఆ ముట్టడింపబడిన దుర్గంనుండి బహు కొద్దిపాటి చిన్న సమూహాలు మాత్రమే విజయవంతంగా బయటపడగలిగాయి. చాలావరకు ఆ రాత్రిదాడులను మెషీన్‌గన్ కాల్పులు తుడిచిపెట్టేశాయి. మరణించగా మిగిలినవారు తప్పనిసరిగా తమ బారకాసులకు తిరోగమించవలసి వచ్చేది. అలా తిరోగమించేప్పుడు కూడా వారు తమ మిత్రులలో చాలా మందిని కోల్పోవలసి వచ్చేది.

శత్రువలయాన్ని ఛేదించుకొని వెళ్లాలనే అత్యంత నిశ్చితమైన, సంఘటితములైన ప్రయత్నాలు 44 వ, 84 వ రెజిమెంట్ల విభాగాలలో జుబచోవ్, ఫొమీన్, సెమేనెన్‌కొ, బిత్కోల నాయకత్వంకింద జరిగాయి. ఉత్తర, ఈశాన్య దిశలవైపున దెబ్బతియ్యాలని వీరు నిశ్చయించుకున్నారు. జూన్ 24 వ తేదీన మధ్య దీవి మీది ప్రధాన దుర్గరక్షణ సేనను ముహవేత్స్ నదిమీద వలయాకృతి బారకాసుల ఉత్తర దిశవైపునున్న సగంభాగంలో కేంద్రీకరించారు. కేవలం రక్షణ గ్రూపులని మాత్రమే దక్షిణ పశ్చిమ విభాగాలలోనూ, క్లబ్బులోనూ శ్వేత భవనంలోనూ వుంచారు.

జూన్ 25 వ తేదీ సాయంత్రాన సంయుక్త సముదాయం కమాండర్లు ఒక యుద్ధ పుటాజ్ఞను జారీచేసి మధ్యదీవిలోని ఉత్తర విభాగంలో పోరాడుతోన్న ఆఫీసర్లకూ, సైనికులకూ ఆ ఆజ్ఞను చదివి వినిపించారు. 100–120 మంది సైనికులుగల ఒక అగ్రగామి డిటాచ్‌మెంటును

ఏర్పాటు చేసుకొని జూన్ 26 వ తేదీన ముట్టడి వలయాన్ని ఛేదించి పట్టణ ముఖంగా వెళ్లవలసిందిగా లెఫ్టినెంట్ వినొగ్రాదొవ్‌ను ఆజ్ఞాపించారు. ఈ ప్రయత్నం గనక సఫలమైనట్లైతే పైన ఏర్పడిన గండి గుండా మధ్య దుర్గంలోని గారిజన్ యొక్క ప్రధాన బలగాలు పురోగమించవలసి వుంటుంది.



లెఫ్టినెంట్ అనతోలియ్ వినొగ్రాదొవ్, 1941

లెఫ్టినెంట్ వినొగ్రాదొవ్ తన డిటాచ్‌మెంటును ఏర్పాటు చేసుకోవడంలో మొత్తం రాత్రి అంతా గడిపాడు. అతడు అనుభవజ్ఞుడైన కమాండరు. 1940 లో తన పరాక్రమానికిగాను "ఎర్ర నక్షత్రం" ఆర్డరను బహుమానంగా పొందాడు. రక్షణ ప్రారంభ దినాల్లో అతని చర్యలు అతి నైపుణ్యంతోనూ నిశ్చయతతోనూ నిండి వుండేవి. అతడు దుర్గరక్షకులలో గణనీయమైన అధికారాన్ని సంపాదించుకోగలిగాడు.

మర్నాడు ఉదయం పదకొండు గంటలకల్లా వినొగ్రాదొవ్ డిటాచ్‌మెంటువారు మూడు ఆర్చీలగేటు సమీపంలోని తమ ఆరంభస్థానాలవద్ద కేంద్రీకృతమవడం మొదలుపెట్టారు. వారి కదలికలను శత్రువులు కనిపెట్టి మరుక్షణన్నే ఆ ప్రాంతంపై ఫిరంగి కాల్పులు సాగించారు. కాని వినొగ్రాదొవ్ అతి చాకచక్యంతో తన మనుషులకు మాటుచూపగలిగాడు.

మధ్యాహ్నంకల్లా అంతా సంసిద్ధం చేశాడు. జాబచోవ్, ఫామీన్‌ల ఎదుట లెఫ్టినెంటు హాజరై కార్యారంభానికి అనుమతిని కోరాడు.

బారకాసు కిటికీలవద్దనున్న మెషీన్‌గన్‌లు ముహవేత్స్ నది ఆవలి గట్టుమీద మట్టిగట్ల పైనున్న జర్మన్ స్థానాలపై కాల్పులను సాగిస్తూ వుండగా వినొగ్రాదొవ్ తన మనుషులను వంతెన మీదుగా నడిపించుకొని వెళ్లాడు. మట్టిగట్లను చేరడంతోటే డిటాచ్‌మెంటువారు తమ శత్రువుల కాల్పులను అణచివేశారు. అంతేకాకుండా ఆ మరుక్షణాన్నే నదిగట్టువెంట తూర్పువైపుకు తిరిగారు. తీవ్రమైన ప్రతిఘటనాభిముఖంగా పురోగమించవలసి వచ్చినప్పటికీ కూడా, వారు త్వరలోనే దుర్గం వెలుపలికి రాగలిగారు. ప్రధాన బలగాలు ఏక్షణంలోనైనాసరే తన డిటాచ్‌మెంటును కలుసుకోవచ్చునని వినొగ్రాదొవ్ ఎదురు చూస్తున్నాడు. కాని వాటికేదో ఆటంకం కలిగింది. వినొగ్రాదొవ్ తన డిటాచ్‌మెంటును తూర్పువైపుకు నడిపించుకొని వెళ్లాడు.

సాయంత్రం ఏడుగంటలకల్లా ఆ డిటాచ్‌మెంటులోని సంఖ్య సగమైపోయి మాస్కో రోడ్డు సమీపంలోని బ్రెస్ట్ పట్టణపు దక్షిణ పొలిమేరల వెలుపలికి వచ్చింది. హిట్లరు పటాలాలు ఒక దృఢమైన స్రవంతివలె రోడ్డు వెంట నడుస్తున్నాయి. ఇంకా వెలుగ్గానే వుంది. శత్రువులు తక్షణమే వినొగ్రాదొవ్‌యొక్క డిటాచ్‌మెంటు ఉనికిని కనుక్కోగలిగారు. వారి ఇన్‌ఫెంట్రీ నాలుగు వైపులనుండీ ఆ డిటాచ్‌మెంటు మీదికి పురోగమించింది. స్పష్టంగా అగుపిస్తోన్న ఆ డిటాచ్‌మెంటుమీదికి వారు సూటిగా తమ ఫిరంగులను కాల్చారు. సుమారు పదిహేను టాంకులుగల దళం ఆ డిటాచ్‌మెంటును వెనుక భాగంనుండి ఎదుర్కొంది.

డిటాచ్‌మెంటువారు బహిరంగ స్థలంలో చిక్కుకుపోయారు. వారు తమ స్థానాలను వలయాకృతిలో ఏర్పరచుకొని మాత్రమే తమ్మతాము రక్షించుకోగలిగారు. కాని సంఖ్యలో తమకు ఎన్నోరెట్లు మించిన శత్రువుతో వారు పోరాడవలసి వచ్చింది. ఈ అసమానమైన యుద్ధంలో త్వరలోనే ఆ డిటాచ్‌మెంటు దాదాపు సంపూర్ణంగా నాశనమైపోయింది. ప్రేలుడుకు ప్రమాన్పడిన వినొగ్రాదొవ్గా, గాయాలవల్ల స్మృతి తప్పిపోయిన అతని మనుషులలో కొందరూ ఖైదీలుగా పట్టుబడిపోయారు.

మధ్య దీవిపైనున్న ప్రధానబలగం వినొగ్రాదొవ్ డిటాచ్‌మెంటును అనుసరించ లేకపోయింది. శత్రుసైన్య వలయంలో ఛేదించుకొని వెళ్లిన గండిని హిట్లరు సైనికులు కొత్త సైనికులతో త్వరత్వరగా నింపివేశారు. ముహవేత్స్‌ను దాటడానికి ప్రయత్నించిన జుబచోవ్, ఫొమీన్‌ల డిటాచ్ మెంటును శత్రువులు విపరీతంగా నష్టపరచి వెనక్కి మళ్లగొట్టారు.

అయినా ముట్టడి వలయాన్ని ఛేదించుకొని వెళ్లాలనే అభిప్రాయాన్ని మాత్రం గారిజన్ మనుషులు వదలిపెట్టలేదు. ఆ ప్రయత్నాన్ని రాత్రి పూటనే చేయాలని ఆఫీసర్లంతా నిర్ణయించుకున్నారు. అప్పటినుండీ ప్రతిరాత్రీ దుర్గంనుండి వెలుపలికి వెళ్లాలనే ప్రయత్నాలు జరిగాయి.

రాత్రి భళ్లున తెల్లవారుతుందనగా వుండే చీకటి గడియల్లోకల్లా చిమ్మచీకటి గడియలో దుర్గద్వారాని కిరువైపులా, ఉత్తర బారకాసుల మొత్తం శ్రేణివెంట దాడి సన్నాహాలను చేసుకుంటూ రెండు పెద్ద డిటాచ్ మెంట్లు ఏర్పడ్డాయి. ఒక డిటాచ్‌మెంటుకు రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్ నాయకత్వం వహించాడు. రెండవ దానికి సీనియర్ లెఫ్టినెంటు బిత్కో నాయకత్వం వహించాడు. అదే సమయంలో జుబచోవ్ నాయకత్వంకింద

నున్న ఒక చిన్న బలగం, దాడిచేసేవారికి రక్షణకోసం కాల్పులు సాగించే వుద్దేశంతో పైకిటికీలవద్ద సిద్ధంగా నిలిచి వుంది.

అవతల గట్టునుండి తరచూ తళుక్కుమని ఎగసే మతాబీచువ్వలు తమ తళతళామెరిసిపోయే వెలుగును మహావేక్స్ నదిలోని నిశ్చలమైన నీటి పైనా, దానికావల చీకటిలో అడ్డుగా శత్రుస్వాధీనంలో వున్న మట్టిగోడ పైనా వెదజల్లుతున్నాయి. అప్పుడప్పుడు ట్రేసర్ తారాచువ్వల తళతళా మెరిసిపోయే రేఖలు చీకటిని చీల్చుకుంటూ మధ్యదీవిని చేరుకుంటున్నాయి. మెషీన్‌గన్ను టపటప శబ్దం వినవస్తూంది. ఒక్కొక్కప్పుడు ఒక గుండు నెత్తిమీదుగా రంయ్‌మని వెళ్లి దుర్గం లోపలి ఆవరణలో పెద్ద ధ్వని చేసు కుంటూ బ్రద్దలౌతోంది. దాడి సముదాయాలు మహావేక్స్ నదికి ఎదురుగా వున్న కిటికీలవద్దా, గేటుదగ్గరా తమ కమాండర్ల ఆజ్ఞకోసం, చెవులు నిక్కబొడుచుకొని వింటూ, అవతలి గట్టుయొక్క ఆకారాన్ని గమనిస్తూ నిలబడి వున్నాయి. చివరికి ఆజ్ఞ ఒక విద్యుత్ వెలుగువలె తమ శ్రేణిలో తళుక్కుమన్నప్పుడు సైనికులు రివ్వున వంతెనకడ్డంగా పరుగెత్తారు, లేదా బారకాసు కిటికీలగుండా ఆవలికి దూకి తమ ఆయుధాలను తలమీదికి ఎత్తి పట్టుకొని, బురదగా వున్న నీటి అడుగుభాగాన తమ పాదాలు జారిపోతూ వున్నప్పటికీ త్వరత్వరగా నదిని దాటుకుంటూ వెళ్లారు. ఒక్క కేకైనా వెయ్యలేదు. ఒక్క తుపాకినైనా పేల్చలేదు.

కాని కొద్ది క్షణాల్లోనే శత్రువులు తమ మతాబీచువ్వల వెలుగుతో వీరిని కనిపెట్టేశారు. మట్టిగట్టు పైభాగంనుండి మెషీన్‌గన్‌లు నిప్పులు కురిపించాయి. తూటల దెబ్బకు మహావేక్స్ నురుగులు కక్కింది. వంతెనను రెండు వైపులనుండీ కాల్పులతో నింపివేశారు. అప్పుడు దాడిచేస్తున్న వారి నుండి ఉత్సాహపూరితమైన భీకరనినాదాలు వెలువడి మిన్నుముట్టాయి.

బాంకాలుకటకల వద్దనున్న జుబచ ఎ మనుషులు మట్టిగట్టు పైన వున్న జర్మన్ స్థానాలపై కాల్పులను సాగించారు.

ఆ మొదటి దూకుదుని ఎవరూ ఆపలేక పోయారు. కొంత మంది మనుషులు ఆ నది చీకటి నీళ్లల్లో మునిగిపోయారు. మరి కొందరు వంతెన మీద పడిపోయారు. కాని యితరులు మరణించిన వారినీ, గాయపడ్డ వారినీ దాటేస్తూ మెషీన్‌గన్ కాల్పుల పరంపరగుండా, మట్టిగోడమీద శత్రువులపై చేతిబాంబులు విసురుకుంటూ, తమ సబ్‌మెషీన్‌గన్‌లను కాల్చుకుంటూ శరవేగంతో పరుగెత్తారు. దాడిసలుపుతున్న డిటాచ్‌మెంటువారు తమ బాయొనెట్‌లను మట్టిగట్టుమీద ఒకసారి ఉపయోగించారు. త్వరలోనే శత్రువుల కాల్పులు శ్రేణి అంతటా అణచివేయబడ్డాయి.

కాని అక్కడికి కొద్దిదూరంలోనే మట్టిగట్టుకు అవలివైపున జర్మన్‌ల మరికొన్ని అదనపుసేనలు నిలబడి వున్నాయి. కొత్త సబ్‌మెషీన్‌గన్నర్లు గోడ వద్దకు పరుగెత్తారు. శత్రువుల అధికసంఖ్యాబలం తక్షణమే తన శక్తిని చూపడం మొదలుపెట్టింది. డిటాచ్‌మెంటు పురోగమనాన్ని అడ్డివేసింది. ఇక ముందుకు వెళ్లడమంటే విపరీతమైన నష్టాలకు గురికావడమేనని డిటాచ్‌మెంటు కమాండర్లు తెలుసుకొని తమ సేనలలో మిగిలిన వాటిని నదికడ్డంగా వెనక్కి నడిపించారు. అలా వెనక్కి తిరిగిన మనుషులు తమ ప్రయత్నం విఫలమైపోయినందుకూ తమ మిత్రులను కోల్పోయినందుకూ నిరాశ చెందుతూ తమ బారకాసులకు వచ్చేశారు. కాని వారు అమర్నాడు మళ్లీ తమ ప్రయత్నాన్ని యింకా ఎక్కువ పట్టుదలతో సాగించారు. ఆవిధంగా వారు తమ ప్రయత్నాన్ని వరసగా కొన్ని రాత్రులు అలా కొనసాగించారు. కాని ప్రతిరాత్రీ కూడా ఆ దాడిచేస్తోన్న డిటాచ్‌మెంటువారి సంఖ్య తగ్గిపోతూ వచ్చింది. శత్రువులు ఆ ప్రమాదానికి గురియైన విభాగంలోకి ఎక్కువ

కెక్కువ తాజా సేనలను దింపారు. ముట్టడి వలయాన్ని బలీయం చేశారు. తమ ప్రయత్నాలవల్ల ఎంతటి నష్టం కలిగినప్పటికీ కూడా ఆ ముట్టడిలో వున్న గారిజన్ మనుషులకి ఆ ప్రయత్నాలే ఆఖరి ఆశ. తమ హృదయాల లోలోపల రగిలిపోతున్న భావనలనూ, అంటే శత్రువుల యెడల తమకున్న తీవ్రమైన ద్వేషాన్ని, ఎంత అణచుకుందామన్నా అణచుకోలేని ద్వేషాన్ని, చావో బ్రతుకో తేల్చుకొనే సమరంలో శత్రువులతో ముఖాముఖిగా పోట్లాడాలనే తమ తీవ్రమైన వాంఛనూ అవి వ్యక్తంచేశాయి.

ఇక ముందు దాడిచేయడమంటే తమ గారిజన్‌ను సంపూర్ణంగా నాశనం చేసుకోవడమేనని ప్రతి ఒక్కరూ గుర్తించినట్టి రాత్రి ఆసన్నమయింది. ఆవిధంగా దుర్గం త్వరగా పట్టుబడిపోవచ్చు కూడా. ముఖ్యంగా 28 వ తేదీనాటి దాడివల్ల గారిజన్ విపరీతమైన నష్టానికి గురికావలసి వచ్చింది. అంతేకాకుండా వెనక్కి తిరిగి రావలసివచ్చింది. దాడిచేసిన సేనలో సగంమంది కూడా బారకాసులకు తిరిగి రాలేదు. మతాబీచువ్వల వెలుగులో ఫొమీన్‌తో వున్న ఒక వ్యక్తి ఆ కమిస్సార్‌యొక్క బక్కచిక్కి గడ్డం పెరిగిపోయిన, ముఖం కన్నీటి బిందువులతో తడిసిపోయి వుండటాన్ని గమనించాడు. ప్రతిరోజూ కూడా కమిస్సార్ ముఖవర్చస్సులో ప్రశాంతమైన విశ్వాసం గోచరించేది. ఆ విశ్వాసమే అతని మనుషులందరికీ తప్పకుండా ప్రాకిపోయేది. అతడు యీనాడు కోపంతోనూ నిరాశతోనూ నిండిన కన్నీరు కార్చాడు. తాను తన మనుషుల్ని కాపాడలేకపోతున్నానే అనే బెంగ, చినిపోయినవారి గురించి విశాచరం ఆ కన్నీటిలో గోచరించింది. మరణించగా మిగిలిన వారి భవిష్యత్తు ఏమౌతుందా అని అతడు పడే విపరీతమైన ఆత్రతా ఆ కన్నీటి బిందువులలో ప్రతిబింబించింది.

ఆ అశ్రుకణాలను యింకెవరూ గమనించలేదు. తాత్కాలికమైన

తన బలహీనతను కమిస్సార్ త్వరగానే అధిగమించాడు. అతని గొంతు ఎప్పటి వలె ప్రశాంతమైన ధోరణిలో ఆజ్ఞలను యివ్వడం మళ్లీ మొదలుపెట్టింది. కట్టకడపట కూడా, దుర్గంనుండి వెలుపలికి ఛేదించుకొని పోవడమనే ఆశ అంతా భగ్నమైపోయినప్పటికీ కూడా, ఆ గారిజన్‌ను విముక్తి చేసే దళాలు వస్తాయనే ఆశ అడుగంటి పోయినప్పటికీ కూడా పోరాటం కొనసాగించాలనే లక్ష్యం మాత్రం ఆ గరిజన్‌ను యింకా వీడలేదు. శత్రుసైన్యాలను దుర్గ కుడ్యాలలో బంధించి వుంచుతూ, వాటిని వీలైనంత వరకూ హతమార్చుతూ, తమలోని ప్రతి ఒక్కని ప్రాణాన్నీ అత్యంత ప్రియంగా అమ్ముతూ దుర్గాన్ని సాధ్యమైనంత వరకూ శత్రువుల వశం కాకుండా నిలపడమన్నదే వారి లక్ష్యం.

ఆ రాత్రినుండీ 44 వ 84 వ రెజిమెంట్ల సెక్టర్ల చోట శత్రు వలయంనుండి బయటపడడమనే ప్రయత్నాలను విరమించారు.

గారిజన్‌కి సంభవించిన విపరీతమైన నష్టాలవల్లనే కాకుండా మందు గుండు సామాగ్రి కొరతవల్ల కూడా పైనిర్ణయం తీసుకోక తప్పింది కాదు. తూటాలు, చేతిబాంబులను యిప్పుడిక సంపాదించడమనేది నమ్మశక్యం కానంతటి కష్టమైన విషయం. ఉన్నవాటిని దుర్గరక్షణార్థం ఎంతో మితంగా ఉపయోగించుకోవలసి వుంది.

సగం నాశనమైపోయిన గిడ్డంగులలో దొరికిన మందుసామగ్రంతా తరచూ శత్రు దాడులను తిప్పికొట్టడానికే త్వరత్వరగా వినియోగమై పోయింది. గిడ్డంగులు మంటలతో మండిపోతూన్నప్పటికీ దుర్గరక్షకులు ఆ మంటలను లెక్కచేయక, తూటాల పెట్టెలు తరచూ ప్రేలిపోతున్న ప్పటికీ కూడా వాటిని ఎలాగో బయటికి లాగగలిగారు. కొంతమంది మను షులు తమ ప్రాణాలకైనా తెగించి దగ్ధమైపోతూన్న కుప్పలనుండి పెట్టె

లను యువతలికి లాగి పారేశారు. ఈవిధంగా సంపాదించిన మందుగుండు సామగ్రంతా ఎన్నాళ్లటివరకో సరిపోలేదు.

ప్రతిరోజూ కూడా యీ మందుగుండు సామగ్రి కొరతను తీవ్రంగా అనుభవించవలసి వచ్చింది. ప్రతి చేతిబాంబునూ, ప్రతి తూటానీ లెక్కలోకి తీసుకోవలసి వచ్చింది. ఏవ్యక్తైనా తన మందుగుండు సామగ్రిని ఉపయోగించుకోకుండా మరణించినట్లైతే మరో కామ్రేడ్ తక్షణమే అతని తూటాలను, చేతిబాంబులను తీసుకొనేవాడు. తొలిదశలో దుర్గరక్షకులు తమ శత్రువుల శవాలనుండి ఆయుధాలనూ, మందుగుండు సామగ్రి సంచులను తీసుకోవడం మొదలుపెట్టారు. ఒక వైపు కాల్పులు సాగుతున్నప్పటికీ భూమి మీద ప్రాకుకుంటూ వెళ్లి జర్మన్ దుస్తులలో వున్న ప్రతి శవాన్నీ సోదాచేసేవారు. వారిని ఒక వైపు ఆకలిదప్పులు చిత్రహింస చేస్తున్నప్పటికీ కూడా మందుగుండు సామగ్రికై సోదాచేస్తున్న వారి చేతులు, ఒక్కొక్కప్పుడు చనిపోయిన వ్యక్తి జేబులలో దొరికే ఆహారంపైకిగానీ, నీళ్ల సీసామీదికిగానీ వెళ్లేవి కావు. తూటాల సంచులు, సబ్‌మెషీన్‌గన్నూ, పొడుగాటి చెక్కపిడి జర్మన్ చేతిబాంబులే వారికి కావలసిందల్లానూ.

క్రమక్రమేణా సోవియట్ ఆయుధాలు నిరుపయోగమైపోయాయి. వాటికి మందుగుండు సామగ్రి లేదు. దుర్గరక్షకులలో ఎక్కువకెక్కువ మంది శత్రువు ఆయుధాలతోనే — అంటే యుద్ధరంగంలో దొరికినటువంటి, లేదా ఎదురుదాడులు చేసినప్పుడు పట్టుబడిన జర్మన్ సబ్‌మెషీన్ గన్‌లతోనే శత్రువులతో పోరాడవలసివచ్చింది. గారిజన్‌వారు తమ మందుగుండు సామగ్రిని నిల్వలను అదే అసాధారణమైన పద్ధతిపై నింపుకోక తప్పింది కాదు. ఆ పద్ధతిని మొత్తం యుద్ధం జరిగినంత కాలమూ బహుశ ఎక్కడా ఉపయోగించి వుండరనే చెప్పాలి.

తూటాల నిలువలు బాగా తగ్గిపోయిన మరుక్షణానే దుర్గ రక్షకులు కాల్పులను సాగించడం ఆపుచేశారు. వాస్తవంగా శత్రువులకు అగపడకుండా వుండే ప్రదేశాలలో దాగొని వెనక్కి వెళ్లిపోతున్నట్టు నటించారు. అప్పుడు శత్రువుల సబ్ మెషీన్‌గన్నర్లు తరచూ కిటికీల పైకి కాల్పులను సాగిస్తూ బహుజాగ్రత్తగా ముందుకు నడిచారు. గోడలు బాగా మందంగా వుండడం వల్ల భవనంలోపలికి చూసి అక్కడ ఏం జరుగుతోందో తెలుసుకోవాలంటే వారికెంతో కష్టమైపోయింది. కాబట్టి వారు ఆ కిటికీలగుండా లోపలికి చేతిబాంబులను విసిరారు. అవి ప్రబద్దలైనప్పుడు భవనంలోపలి గదులు వొణకిపోయేవి. చేతిబాంబులు ప్రేలినప్పుడు వెడలే తునకవల్ల రహస్యస్థలాలలో దాగున్న మనుషులు ఒక్కొక్కప్పుడు ప్రాణాలను కోల్పోవడమో లేక గాయపడడమో సంభవించేది. వారు యిందుకు సంసిద్ధంగానే వున్నారు, కాబట్టి తమ ఉనికిని శత్రువులకు తెలియనివ్వలేదు. చివరికి శత్రు సబ్ మెషీన్‌గన్నర్లకు ఆ గారిజన్ తమతమ స్థానాలను ఖాళీచేసి వెళ్లిపోయినట్టు నమ్మకం చిక్కడంతో వారు కిటికీలగుండా ద్వారాలగుండా విజయధ్వానాలు చేసుకుంటూ లోనికి చొరబడేవారు. ఇంతలోకే దుర్గరక్షకులు ముఖాముఖిగా శత్రువులను ఎదుర్కొని వారిని నాశనం చేసి వారివారి ఆయుధాలనీ, మందుగుండు సామగ్రినీ తమ స్వాధీనపరచుకునేవారు.

ఈవిధంగా మందుగుండు సామగ్రిని గారిజన్‌వారు తరచూ చేపట్టేవారు. అయినా ఆ సామగ్రి ఏమాత్రమూ సరిపోదు. ఎందువల్లనంటే శత్రుదాడులు నిరంతరాయంగా ఎక్కువయ్యాయి. తమ మందుగుండు సామగ్రులను నింపడం ఎంత కష్టభూయిష్ఠమో తెలుసుకొని దుర్గరక్షకులు తాము కాల్చే ప్రతిగుండూ గురితప్పి వృథాకాకుండా వుండేట్టు చూడక తప్పింది కాదు. ఒకసారి కమిస్సార్ సమక్షంలో ఫామీన్

మనుషుల్లో ఒకరు తన ఆఖరి తూటాను తనకోసమే అట్టిపెట్టుకున్నా నని చెప్పినప్పుడు వాళ్లందరినీ ఉద్దేశిస్తూ ఫామీన్ యిలా అన్నాడు: "మిత్రు లారా! మీ అభిప్రాయం సరికాదు. మీ ఆఖరి తూటాను కూడా శత్రువు పైనే ఉపయోగించాలి. మనం ముఖాముఖి పోరాటంలో మరణించవచ్చు. ప్రతి తూటా కూడా వాళ్లకోసమే, కేవలం ఆ ఫాసిస్టులకోసమే వినియో గించాలి."

84 వ రెజిమెంటు ఖాళీ చేసిన ఆగ్నేయ దిశవైపునున్న బారకాసుల లోని చాలా భాగాన్ని నాజీలు విజయవంతంగా ఆక్రమించుకున్నారు. క్లబ్బు భవనం కొరకు, శ్వేత భవనంకొరకూ చాలా గట్టి పోరాటం జరిగింది. ఆ రెండు భవనాలు కూడా అనేక సార్లు యిరుపక్షాల చేతులనుండీ మారాయి. ఎక్కువ తరచుగా నాజీ టాంకులు మూడు ఆర్చీలగేటు గుండా మధ్యదుర్గం ఆవరణ లోకి చొచ్చుకు పోయేవి. అవి తిన్నగా బారకాసులవద్దకి వెళ్లి కిటికీల లోకి కాల్పులను సాగించాయి. ఒక్కొక్కప్పుడు అవి గిడ్డంగి పెద్దతలుపుల గుండా భవనంలోకే బలంతో దూసుకుపోయేవి. 455 వ రెజిమెంటు విభాగంలోని బారకాసులలో కొంత భాగంలోకి ఫాసిస్టుల టాంకు ఒకటి చొచ్చుకు వచ్చింది. ఆ బారకాసుల తలుపుమీద ఒక సోవియట్ వైద్యసహా యకుడు ఒక పెద్ద రెడ్ క్రాస్ చిహ్నం వున్న గుడ్డను వ్రేలాడగట్టాడు. అది దూరానికి కూడా అగపడుతుంది. కాంక్రీటు చేసిన నేలమీద తీవ్రంగా గాయపడినవారు పడుకొని వున్నారు. తలుపువద్ద టాంకు కనపడడంతోటే క్షతగాత్రులంతా భయభీతులతో నిండిన అరుపులు అరిచారు. ఆ టాంకు ఒక క్షణం ఆగింది. తర్వాత, పడుకొని వున్న క్షతగాత్రుల శరీరాల మీదుగా గర్జిస్తూ నేలమీద ముందుకు సాగిపోయింది. అది గది మధ్యకు చేరుకో గానే అకస్మాత్తుగా బ్రేకు వేసి తన క్యాటర్‌పిల్లర్ పాదాలపైన

గ్రరున తిరిగి ఆ అసహాయులైన మనుషులను నిర్దాక్షిణ్యంగా కాలరా సేసింది.

గారిజన్ ఎంత గట్టిగా ఎదిరించినప్పటికీ కూడా శత్రువులు దానిని క్రమక్రమేణా మించిపోయారు. ప్రతిరోజూ శత్రువుల ఆధిక్యత విపరీతంగా పెరిగిపోతోంది. ఈ పరిస్థితుల్లో స్త్రీలనీ పిల్లలనూ యింకా దుర్గంలో వుంచడమనేది అర్థంలేని పని. ఇప్పుడో అప్పుడో వారు ఆకలి దప్పులతో మరణించక తప్పదు. లేదా ప్రతి రోజూ శత్రువులు ఆ దుర్గంపై వేసే భారీబాంబులకు ఆహుతికాక తప్పదు. శత్రువులు ఎంతటి క్రూరులైనప్పటికీ, ఖైదీగా పట్టుబడడమనేది ఎంతటి బాధాకరమైనదైనప్పటికీ, ఎంతటి అవమానకరమైనదైనప్పటికీ శత్రువులు స్త్రీలనూ పిల్లలనూ చంపకుండా వొదిలి పెట్టుతారనే ఆశ వారిని యింకా వీడలేదు. ఈ కారణంవల్లనే స్త్రీలూ పిల్లలూ శత్రువులకు ఖైదీలుగా లొంగిపోవాలనే నిర్ణయం జరిగింది.

తీవ్రంగా క్షతగాత్రుడైనప్పటికీ కూడా యింకా తన మనుషులకు నాయకత్వం వహిస్తోన్న లెఫ్టినెంట్ కిజెవాతొవ్ 333 వ రెజిమెంటు బారకాసుల నేలమాళిగకు వచ్చి పైనిర్ణయాన్ని తెలిపినప్పుడు వాళ్ళు యీక్రింది విధంగా తమ ఆక్షేపణను తెలిపారు.

"మమ్మల్ని చిత్రహింసల పాలు చేయకండి," అని వారు అశ్రువులతోనిండిన కళ్లతో విజ్ఞప్తి చేసుకున్నారు. "ఆ ఫాసిస్టులు మమ్మల్ని ఎలాగైనా చంపేస్తారు. అంతేకాదు. వాళ్లు మమ్మల్ని నానాబాధలు పెడతారు. మీ అంతటికి మీరే మమ్మల్నీ, పిల్లల్నీ తుపాకీలతో కాల్చివేయడం మంచిది."

కాని కిజెవాతొవ్ ఏమాత్రమూ చలించలేదు. ఆ ఆజ్ఞ దుర్గపు కమాండరు ఆజ్ఞ అని చెప్పాడు.

"కాని మీ మాట ఏమిటి?'' అని అతనిని ఒకామె అడిగింది.

"మేం తీసుకున్న దేశభక్తి ప్రమాణానికి మేం బద్ధులం. మాకొసగిన ఆజ్ఞను అక్షరాలా ఆచరణలో పెట్టేందుకని చివరిదాకా ప్రయత్నం చేస్తాం. మనవాళ్లు వచ్చినప్పుడు ఆ సంగతి చెప్పండి,'' అని కిజెవాతొవ్ సమాధానం చెప్పాడు.

పేత్య క్లీప యింకా కుర్రవాడే కనుక అతనికి కూడా ఆడవాళ్లూ పిల్లలతోపాటు శత్రువులకు లొంగిపోయే అవకాశానిచ్చారు. కాని అతడు "నేనొక ఎర్రసైన్యపు మనిషిగా పరిగణించుకుంటున్నాను. నా స్నేహితులతోపాటే నేనూ చివరివరకూ పోరాడతాను,'' అని పలుకుతూ తనకొసగిన అవకాశాన్ని సగర్వంగా నిరాకరించాడు.

అతడు అంతకు మునుపే ఒక మంచి సైనికునిగా నిరూపించుకున్నాడు. అతడు అనేకమంది ఫాసిస్టులను అదివరకే హతమార్చాడు. ముఖాముఖి పోరాటంలోనూ, గస్తీ తిరగడంలోనూ అతడు మంచి పేరును సంపాదించుకున్నాడు. కాబట్టి వారు అతని వేడుకోలును అమోదించి తమతోపాటే ఉండిపోయేందుకు అంగీకరించారు.

మగవారు ఒక తెల్ల జెండాను తయారుచేశారు. స్త్రీలు తమ పిల్లలని చేతుల్లోకి తీసుకొని బూగ్ నదిగట్టుమీదికి వెళ్లి శత్రువులకు లొంగిపోయారు.

అలాంటి దృశ్యమే, 98 వ టాంకు విధ్వంసక ఫిరంగి బటాలియన్ ఆఫీసర్ల భార్యలూ పిల్లలూ రహస్యంగా దాగున్న నేలమాళిగలోనూ సంభవించింది.

ఈ విభాగం రక్షణకు నాయకత్వం వహిస్తోన్న సీనియర్ రాజకీయ ఆర్గనైజరు నెస్త్రెర్చ్యాక్ ఆ స్త్రీలతో యిలా అన్నాడు: "మీరు పిల్లల్ని కాపాడటానికి ప్రయత్నం చేసి తీరాలి. కాని మీరు అన్నిటికీ అవమానానికీ, హేళనకూ, దెబ్బలకీ, ఆఖరికి చావుకూ సంసిద్ధంగా వుండాలి. మీ పిల్లల కోసమనీ, మన దేశంకోసమనీ అన్నిటికీ ఓర్చుకోవాలి. అది మీ కర్తవ్యమని ఎన్నటికీ మరచి పోవద్దు."

మొట్టమొదటి రోజులనుండీ తన తండ్రితోనే వున్నటువంటి నెస్త్రెర్చ్యాక్‌యొక్క పద్నాలుగేళ్ల కుమార్తె లీద భోరున ఏడ్చింది. తనని దుర్గంలోనే ఉండనివ్వమని ప్రాధేయపడింది. కాని నెస్త్రెర్చ్యాక్ మాత్రం అంగీకరించలేదు. అతడు ఒక ఆఫీసర్‌తో:

"లాభంలేదు. ఆమె వెళ్లిపోవడమే మంచిది. ఆఖరి గడియల్లో ఆమెను చంపేయడానికి నాకు చేతులురావు. నా పిస్తోలులో రెండు తూటాలు మాత్రమే మిగిలాయి — ఒకటి శత్రువులకోసం, రెండోది నాకోసం," అని అంటూండటాన్ని లీద విన్నది.

ఇతర స్త్రీలూ, పిల్లలతోపాటే లీద కూడా శత్రువులకు లొంగిపోయింది.

భీషణ పోరాట రానురానూ మరింత భీకరమైంది. ఈ గారిజన్ పీడ వదిలించుకోవాలనే పిచ్చి అభిలాషతో శత్రువులు, తమకెంతటి నష్టం సంభవిస్తున్నప్పటికీ లెక్కచేయకుండా కొత్త సేనలని రప్పించుకుంటున్నారు.

ఎక్కడైతే ఫామీన్, జుబచోవ్‌ల నాయకత్వంకింద గారిజన్ ప్రధాన సేనలు యుద్ధంచేస్తున్నాయో ఆ మధ్య దీవియొక్క ఉత్తర విభాగంలో, మూడు ఆర్చీల దుర్గద్వారం వద్ద ప్రధానంగా జూన్ ఆఖరి రోజుల్లో భయం

కరమైన పోరాటం జరిగింది. గేటుకి పశ్చిమాన ఆనుకొని వున్న అనేక బారకాసు గదులను వశపరచుకోవడంలో నాజీలు విజయం సాధించారు. కాని యీ బారకాసుల రక్షణకార్యం వహిస్తోన్న బిత్కో మాత్రం శత్రువుల సబ్‌మెషీన్‌గన్నర్లను వలయాకృతి బారకాసులగుండా ఇంకా ముందుకు వెళ్లకుండా వుండేట్టు చేయగలిగాడు. ఈ బారకాసుల తూర్పు పార్శ్వంలో తమ స్థానాలను నిలదొక్కుకోవాలని చేసిన శత్రువుల ప్రయత్నాలను



సీనియర్ రాజకీయ ఆర్గనైజర్
నికొలాయ్ నెస్తెర్చుక్

ఫొమీన్, జుబచోవ్‌ల మనుషులు భంగపరచారు. ఈ పార్శ్వం ఒక గుడ్డి సందుగా ఏర్పడింది. ఎప్పుడైతే శత్రువులు ఒక పర్యాయం మూడు ఆర్చీలగేటుకు ఆనుకొని వున్న భవనంలోని మొదటి విభాగంలో అడుగుపెట్టగలుగుతారో అప్పుడు వారు భవనం లోపలవున్న సోవియట్ కాల్బలాన్ని అక్కడితో ఆఖరైపోయిన ఖాళీగోడకేసి నొక్కివేయగలరు. ఈ అపాయాన్ని ప్రతి ఒక్కరూ గుర్తించారు. గేటు చుట్టూ వున్న భవనాలకోసమని పోరాటం బాగా తీవ్రంగా సాగుతోంది. రోజుకు అనేక సార్లు నాజీ సబ్‌మెషీన్‌గన్నర్లు యీ భవనాలలోకి చొచ్చుకు వచ్చేవారు. కాని వారు లోపల అడుగుపెట్టగానే మొత్తం శ్రేణి అంతటా "జర్మన్స్!" అనే అరుపు ప్రతిధ్వనించేది. అక్కడి మనుషులు ఏ ఆజ్ఞలకోసమూ ఎదురుచూడక గదులలోని శత్రువులను

తుడిచి పెట్టేందుకని ముఖాముఖిగా ప్రాణాలకు తెగించి పోరాడేవారు. ప్రతిరోజూ ఈవిధంగా జరిగేది. త్వరలోనే నాజీసైనికుల, సోవియట్ సైనికుల కళేబరాలు కిటికీ ఎత్తువరకూ చిందరవందరగా పడిపోయాయి. అయిన ప్పటికీ కూడా యీ శవాలకుప్పల మీదుగానే బాయొనెట్లతోనూ, చేతి బాంబులతోనూ, తుపాకీ మడమలతోనూ పోరాటం కొనసాగింది. శత్రువులు ఆ కీలకస్థానాన్ని మాత్రం తమ వశం చేసుకోలేకపోయారు.

సాపర్ దళాలను దుర్గద్వారం వరకూ పంపారు. ఎప్పుడైతే సబ్ మెషీన్‌గన్నర్లు దాడి మొదలుపెట్టారో ఆ వెనువెంటనే సాపర్లు భవనం యొక్క తూర్పు పార్శ్వపు పైకప్పులమీదికి దారిచేసుకున్నారు. శక్తివంత మైన టి.యన్.టి. బాంబులను చిమ్నీల గుండా విసిరారు. ఆ భవనపు గోడలూ, పైకప్పులూ దుర్గరక్షకుల తలలపైన కూలిపడ్డాయి. ఆ భవనం క్రమక్రమేణా, అంగుళం అంగుళమూ తుత్తునియలైపోయింది. విరిగిపడి పోయిన గోడల దూలాల గుట్టలకిందనే ఆ విభాగపు ఆఖరి దుర్గరక్షకులు నశించిపోయారు.

శత్రువుల సబ్‌మెషీన్‌గన్నర్లు చేసిన భయంకరమైన దాడులను ఎదిరిస్తూ, రెజిమెంటల్ జెండాలను తన ఛాతీచూట్టూ చుట్టుకున్నట్టి 84 వ రెజిమెంటు గుమస్తా ఫ్యోదొర్ ఇసాయెవ్ యీ రాళ్లగుట్టకిందనే పూడ్చివేయబడ్డాడు. ఫొమీన్, జుబచోవ్‌లతోపాటు పోరాడి తమకు తగిలిన గాయాలవల్ల అలసిపోయి బలహీనమైపోయిన రాజకీయ ఆర్గనైజరు ప్యోత్ర్ కొష్కారొవ్‌నూ, ఎర్రసైనికులు అలెగ్జాండర్ ఫీల్, ఇవాన్ దొరొఫేయెవ్, అలెగ్జాండర్ రెబ్‌జూయెవ్ మొదలైనవారిని శత్రువులు ఖైదీలుగా పట్టు కున్నారు.

రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్ యింతకంటే విషాదభరితమైన

విధికి గురియై బాధపడ్డాడు. బాంబులకు కూలిపోయిన భవనపు శిథిలాల గుట్టల్లో ప్రేలుడులకు మాన్పడి సగం పూడ్చివేయబడిన ఫొమీన్‌నూ, యింకా అతని యితర మనుషులనూ నాజీలు ఆ శిథిలాలనుండి యివతలికి బరబరా యీడ్చుకొచ్చారు. వాళ్ళు ఖైదీలకు ఉపచారం చేసినతరువాత బలీయమైన కావలా బృందంవెంట వారిని హోల్మ్‌స్కీ గేటు వద్దకు పంపించారు. అక్కడ వారిని రష్యన్‌భాష బాగా తెలిసిన ఒక నాజీ ఆఫీసరు ఎదుట వుంచారు. ఆ ఆఫీసరు ఖైదీల జేబులను సోదా చెయ్యవలసిందిగా సబ్‌మెషీన్‌గన్నర్లను ఆజ్ఞాపించాడు.

ఫొమీన్ ఆజ్ఞలప్రకారం అతని మనుషులు తమ కాగితాలనన్నటినీ యిదివరకెప్పుడో నాశనం చేసి వేశారు. కమిస్సార్ స్వయంగా ఒక మామూలు సైనికుని చిన్న బొంతకోటునూ, హోదాను తెలిపే చిహ్నాలు లేనటువంటి ఒక చొక్కానూ తొడుక్కొని వున్నాడు. బాగా చిక్కిశల్యమైపోయి, పెరిగిపోయిన గడ్డంతోనూ, చింకి గుడ్డల్తోనూ వున్న ఫొమీన్‌కూ యితరఖైదీలకూ ఏమీ తేడా అగుపించదు. అందువల్ల అతని ప్రాణాలు దక్కగలవని అతని మనుషులు ఆశించారు.

కాని ఆ ఖైదీలలో ఒక దేశద్రోహి ఉన్నాడు. అతడు యిదివరలో తనవాళ్లే తనను చంపుతారనే భయంకొద్దీ తన పక్షాన్ని విడిచిపెట్టి శత్రువులను చేరలేదనేది స్పష్టమౌతోంది. ఇప్పుడు అతనికి అదను చిక్కింది. నాజీల అనుగ్రహం సంపాదించుకోవాలని అతడు నిశ్చయించుకున్నాడు. శత్రువుల దయసంపాదించుకో నుద్దేశించిన నవ్వుతో అతడు తన శ్రేణినుండి పక్కకు తొలగి నాజీ ఆఫీసర్‌ను ఉద్దేశిస్తూ యిలా అన్నాడు:

"ఈ మనిషి మామూలు సైనికుడు కాడండీ, సార్," అని అతడు ఫొమీన్‌ను చూపుతూ అన్నాడు. "అతడు కమిస్సార్. చాలా ప్రధానమైన

కమిస్సార్. ఇతడే మమ్మల్ని లొంగిపోవద్దనీ, చివరివరకూ పోరాడమనీ ఆజ్ఞాపించాడు."

ఆ ఆఫీసరు ఒక సంక్షిప్తమైన ఆజ్ఞనొసగాడు. సబ్‌మెషీన్‌గన్నర్లు ఫామీన్‌ను శ్రేణులనుండి అవతలికి నెట్టారు. ఖైదీలంతా మౌనంగా ద్వేషిస్తూ గుంటలుపడిన పోయిన తమ కళ్ళల్లో విపరీతమైన కోపాన్ని కనపరచుతూ ఆ దేశద్రోహివైపు తమ చూపులు కేంద్రీకరం చేసరికల్లా అతగాడి నవ్వు క్రమక్రమేణా అంతర్థానమైపోయింది. జర్మన్ సైనికుడొకడు తన తుపాకీ మడమతో అతగానిని ఒక తోపుతోశాడు. ఆ దేశద్రోహి తన దృష్టిని అతికష్టంతో మరల్చుకొని మళ్ళీ శ్రేణిలోకి వచ్చేశాడు.

ఆ జర్మన్ ఆఫీసరు ఆజ్ఞనొసగాడు. కొంత మంది సబ్‌మెషీన్ గన్నర్లు ఫామీన్‌ను చుట్టేశారు. అతని హోల్మ్‌స్కి గేటు గుండా ముహవేత్స్ నదిగట్టుకు తీసుకొచ్చారు. ఒక నిమిషం తర్వాత సబ్‌మెషీన్‌గన్ కాల్పుల టపటప శబ్దం వినబడింది.

అదే సమయంలో నదిగట్టున, గేటుకు సమీపంలోనే సోవియట్ ఖైదీల సమూహం మరొకటుంది. వాళ్లలో 84 వ రెజిమెంటు సైనికులు వున్నారు. వారు తమ కమిస్సార్‌ను వెంటనే గుర్తించారు. సబ్‌మెషీన్‌గన్నర్లు ఫామీన్‌ను దుర్గపుగోడకేసి నిలబెట్టడాన్నీ, ఆయన తన చేయిని పైకెత్తి ఏదో కేకవేయడాన్నీ, అతని కంఠధ్వని శత్రువుల సబ్‌మెషీన్‌గన్ కాల్పుల ధ్వనిలో తక్షణమే కలసిపోవడాన్నీ వారు గమనించారు.

ఆవిధంగా మరణించాడు కమ్యూనిస్టు పార్టీయొక్క నిజమైన బిడ్డ, రెజిమెంటల్ కమిస్సార్ యెఫీమ్ ఫామీన్. అతడు బ్రెస్ట్ దుర్గాన్ని వీరోచితంగా రక్షించిన నాయకులలోనూ, ప్రధాన ఆర్గనైజర్లలోనూ ఒకడు.

ఒక అరగంట తర్వాత యితర ఖైదీలు కూడా నాజీ సైనికుల కాపలా వెంట దుర్గంనుండి వెలుపలికి వచ్చేశారు. చీకటిపడుతూ వుండగా వాళ్లం దరనీ బూగ్‌నది గట్టున యిటుకలతో కట్టిన ఒక చిన్న అటుకకోట్లోకి తోసి ఆ రాత్రి వాళ్లను అందులోనే బంధించారు. కాని మర్నాడు ఉదయం తలు పులని తెరచి ఖైదీలందరిని వెలుపలికి రమ్మనమని ఆజ్ఞ ఇచ్చినప్పుడు ఆ జర్మన్ రక్షకసైనికులకు ఒక ఖైదీ అగుపించలేదు. ధాన్యపుకోట్లో ఒక మూలగా వున్న గడ్డికుప్పమీద ఆ ఖైదీ శవం పడి వుంది. అతడే కమిస్సార్ ఫామీన్ పట్ల నమ్మకద్రోహాన్ని సాగించిన మనిషి. అతని తలకాయ వెనక్కి వ్రేలాడి వుంది. కళ్లు భయంకరంగా ఉబికి పోయివున్నాయి. అతని మెడమీద నల్లని వ్రేలిముద్రలు స్పష్టంగా అగుపిస్తున్నాయి. తన దేశద్రోహానికి ప్రతి ఫలం తానే అనుభవించాడు.

ఏమైతేనేం హిట్లరు సైనికులు యీ సన్నివేశాన్ని ఒక లెక్కలోకే తీసుకోలేదు. ఖైదీలందరినీ ఒక శ్రేణిలో నిలబెట్టి క్యాంపుకు నడిపించుకొని వెళ్లారు. తమకు తగిలిన గాయాలవల్ల యమబాధ పడుతూ, అడుగు తీసి అడుగువేసే శక్తి లేకపోయినా కాళ్లీడ్చుకుంటూ ఆ ఖైదీలు, మృత్యువర్ణపు కారుపొగలోనుండి యింకా అగపడుతూన్న దుర్గకుడ్యాలను వెనక్కి తిరిగి చూస్తూనే నడిచారు. కాల్పులు, బాంబుల ప్రేలుళ్లూ ఆగిపోలేదు. ఆ దుర్గం యింకా యుద్ధంచేస్తూనే వుంది.

బారకాసుల తూర్పు విభాగం ఇప్పుడు శత్రువుల చేతుల్లో వుంది. అయినా శ్వేత భవనం కోసమని యింకా తీవ్రమైన పోరాటం జరుగుతూనే వుంది. క్లబ్బు భవనాన్ని కాపాడుకుంటోన్న వారిలో ఎక్కువమంది మాస్కో మనుషులు. పూర్వపు దేవాలయమైన ఆ క్లబ్బుయొక్క పొడుగాటి కిటికీల నుండి వారు శత్రు సబ్‌మెషీన్‌గన్నర్లపై తీవ్రయుద్ధం చేస్తున్నారు.

44 వ, 333 వ రెజిమెంట్లలోని మిగతాబలగాలు మధ్యదీవి పశ్చిమభాగాన్నంతటినీ కూడా గట్టిగా తమ స్వాధీనంలో వుంచుకున్నాయి.

పధ్నాల్గవ రోజువరకూ కాల్పులు ఆగనటువంటి పశ్చిమదీవిలో సరిహద్దు రక్షకుల సమూహాలు తమ పోరాటాన్ని కొనసాగిస్తూనే వున్నాయి. దుర్గం ఉత్తరవిభాగంలోని తూర్పుకోటను శత్రువులు నాలుగు వైపులా చుట్టి వేసినప్పటికీ కూడా దుర్గరక్షకులు ఆ కోటను నిలబెట్టుకొనే వున్నారు. క్రొబిన్స్కి గేటు మట్టిగోడలో దాగున్నట్టి నెస్తెర్చ్యూక్, అకీమొచ్కిన్ యొక్క ఫిరంగిదళంవారు తమ ఫిరంగులన్నిటినీ పోగొట్టుకున్నారు. అయినా వారు తమ తుపాకీలతోనూ సబ్‌మెషీన్‌గన్‌లతోనూ పోరాడుతూనే వున్నారు. ఈ సమయంలోనే మంచి పట్టుదలగల కమ్యూనిస్టు నికొలాయ్ నెస్తెర్చ్యూక్ ప్రాణాంతకంగా క్షతగాత్రుడవడమూ, చివరికి ప్రాణాలను కోల్పోవడమూ సంభవించింది. అతని ఛిఫ్ ఆఫ్ స్టాఫ్ లెఫ్టినెంట్ అకీమొచ్కిన్ ఆతని స్థానే ఆ గ్రూపు నాయకత్వం వహించాడు. ఫిరంగి బ్యాటరీ కమాండర్ కగనోవిచ్‌తోపాటూ, ప్లాటూన్‌యొక్క కమాండర్ లెఫ్టినెంట్ చెస్నొకోవ్ తోపాటూ అకీమొచ్కిన్ జెండానీ, బటాలియన్‌యొక్క రహస్యపు కాగితాలన్నీ దుర్గపుగోడలోని గదులు ఒకదానిలో పూడ్చిపెట్టేసి, తరచూ శత్రువులు సాగించుతూన్న దాడులను తిప్పికొట్టేటట్టు కాల్పులను సాగించవలసిందిగా తమ ఆఖరి మందుగుండు సామగ్రిని ఉపయోగించుకుంటోన్న ఫిరంగి సైనికులకు ఆజ్ఞాపించాడు.

జూన్‌నెల ఆఖరి రోజుల్లో ప్రధనంగా తూర్పుకోట సమీపాన చాలా పెద్ద పోరాటం జరిగింది. అంతకంతకు మరింత తీవ్రమవుతూ విధివిరామంలేని దాడులు సాగించుతూ నాజీలు దుర్గం ఉత్తరపు, ఈశాన్యపు మట్టిగట్లనూ పట్టుకోవడంలోనూ, పశ్చిమ కోటను కాపాడుకుంటోన్న కంపెనీని

మేజర్ గ్రవీలొవ్‌యొక్క ప్రధాన సేనలనుండి చీలదీయడంలోనూ, విజయాన్ని సాధించారు. కాని శత్రువులచే చుట్టివేయబడిన యీ కంపెనీలో మిగిలిన వారు యింకా పోరాటాన్ని కొనసాగిస్తూనే వున్నారు. కోటకు అంటిపెట్టు కొని వున్న బ్లాక్‌హౌస్‌లో ఒక మెషీన్‌గన్ను యీ సమర ధ్వానంమధ్య ఎడ తెగకుండా శబ్దం చేస్తోంది. దుర్గపు మట్టిగోడలనుండి విపరీతమైన నష్టా లతో వెన్నక్కి వెళ్లగొట్టబడిన మరో రెండు కంపెనీలు తూర్పుకోటలో మళ్లీ కొత్తగా ఏర్పడి గ్రవీలొవ్ నాయకత్వంకింద రక్షణను ఎంత బలీయం చేసుకున్నాయంటే, యీ పట్టెడు సోవియట్ వీరుల ప్రతిఘటనను ఛేదిం చేందుకై శత్రువులు చాలా కష్టమైన చర్యలు తీసుకోవలసి వచ్చింది.

"కాల్పులాలతో కోటను సమీపించడం అసంభవమైన విషయం," అని జర్మన్ స్టాఫ్ ఆఫీసర్లు తమ నివేదికలలో వ్రాసుకున్నారు. "ఎందు వల్లనంటే లోతుగా వున్న కందకాలనుండీ, గుర్రపునాడెం ఆకృతిలో వున్న ఆవరణనుండీ మెషీన్‌గన్ కాల్పులూ రైఫిల్ కాల్పులూ అద్భుతంగా కొన సాగాయి. వాటి బారినపడిన ప్రతి వ్యక్తీ తెగి నేలకొరగక తప్పింది కాదు. ఒకటే తరుణోపాయం మిగిలింది. రష్యన్లను ఆకలితో మాడ్చడం. ఇందు కోసం రష్యన్లను త్వరితగతిని అలసిపోయేట్లు చేసేందుకని వారు అన్ని రకాల చర్యలనూ తీసుకోవలసి వుంది: అంటే కందకాలలోగానీ దుర్గం ఆవరణలోగానీ రష్యన్లు ఒక చోటనుండి మరొక చోటికి వెళ్లకుండా వుండేందుకై భారీ మోర్‌టార్‌లను ఎడతెగకుండా పేల్చి పీడించడమూ, టాంకులను వారికి దగ్గరగా పోనిచ్చి బొంబార్డు చేయడమూ, లొంగి పొమ్మనమని మెగఫోన్‌ద్వారా విజ్ఞప్తి చేయడమూ, లేదా కరపత్రాలను విమానాలనుండి కిందికి వదలడమూనూ."

ఏమైతేనేం ఈ చర్యలవల్ల ఏమీ లాభంలేకపోయిందని పైనివేది కలో వున్న యీకింది యితర అంశాలవల్ల స్పష్టంగా తెలుస్తుంది.

"జూన్ 28 న ట్రాంకులతోనూ ముట్టడి ఫిరంగులతోనూ కోట మీద బాంబుల వర్షం ఎడతెగకుండా కురిపించినప్పటికీ విజయం మాత్రం సాధ్యపడలేదనేది స్పష్టం," అని ఆ నివేదిక అంటుంది. "88 మిల్లీమీటర్ల విమాన విధ్వంసక ఫిరంగితో గుళ్ళు ప్రయోగించినప్పటికీ కూడా లాభం లేకపోయింది. కాబట్టి డివిజన్ కమాండరు, ఆకాశంలోనుండి బాంబులను వేసే యేర్పాటును చేసేందుకని ముహవేత్స్ విమానాశ్రయంతో సంప్రతించ మని ఆజ్ఞనొసగాడు. విమాన దాడి సంభవమేనని తేలింది. కాని అలా చేయా లంటే మన సొంత పటాలాలను మట్టిగట్ల ఆవలకూ, పశ్చిమ కోట ఆవ లకూ కూడా వెనక్కి వైదొలగించాల్సి వుంటుంది. ఈ చర్యను మధ్యాహ్నం కొనసాగించాం. అలా కొనసాగిస్తున్నప్పుడు రష్యన్లు తూర్పుకోటనుండి ఛేదించుకుని బయటకు వచ్చేయకుండా వుండేట్టు అతి జాగ్రత్తగా రక్షణ కాల్పులు సాగించాం. దురదృష్టవశాత్తూ జూన్ 28 వ తేదీన బాగాకిందికి వున్న మేఘం విమాన దాడిని జరగకుండా చేసివేసింది. తూర్పుకోట చుట్టూ వున్న దిట్టమైన వలయం మళ్ళీ యథాస్థితికి వచ్చేసింది. రాత్రి పూట రష్యన్లనుండి పట్టుకున్న సెర్చిలైట్లను (అంతేకాకుండా లారీలు మొదలైన శకటాల హెడ్‌లైట్లను) కోటనంతటినీ వెలుగుతో నింపేందుకై వుపయోగించాం. అజాగ్రత్తగా జరిగిన ప్రతి కదలికకూ రష్యన్లింకా కాల్పు లతో సమాధానం చెప్పారు.

"జూన్ 29 వ తేదీన 8.00 గంటలకు విమానాలు 500 కిలోగ్రా ముల బాంబులను అనేకంగా వదిలాయి. కాని ఫలితం అగుపడలేదు. టాంకుల తోనూ, ముట్టడి ఫిరంగులతోనూ తాజాగా జరిపిన క్రియాత్మకమైన

బాంబుల దాడివల్ల కొన్ని చోట్ల కోటగోడ కూలిపోయిందన్నమాట వాస్త వమే అయినప్పటికీ, దాడి నిష్ప్రయోజనమైపోయింది.

"జూన్ 30 వ తేదీన ఎదురుదాడి సన్నాహంలో కోట చుట్టూవున్న కందకాలలోకి పెట్రోలు, నూనె, గ్రీజు పీపాలనూ సీసాలనూ ముందుకు దొర్లించి వాటిని చేతిబాంబులతోనూ, అగ్నికారిణి తూటాలతోనూ నిప్పు అంటించాం."

జర్మన్ స్టాఫ్ ఆఫీసర్లు ఒక వాస్తవిక విషయాన్ని నక్కి వినయంతో వివరించడం వదలివేశారు. ఈ సీసాలూ, పీపాలేకాకుండా బాష్పవాయువు బాంబులను కోట ఆవరణలోకి విసిరారు. మొత్తం ఆ చిన్న గారిజనూ, అక్కడి స్త్రీలూ పిల్లలూ కొన్ని గంటలకొద్దీ రెస్పిరేటర్లను ముఖాలకి ధరించ వలసి వచ్చింది. ఆ పొగమధ్యా, గ్యాసు మేఘాల మధ్య కూడా గారిజన్‌వారు పోరాటాన్ని కొనసాగిస్తూ తమ తూటాలతోనూ, చేతిబాంబులతోనూ శత్రువుల దాడులను తిప్పికొట్టారు.

జూన్ 29 వ తేదీన హిట్లరు సైనికులు ఒక అంతిమ హెచ్చరికను అందజేశారు. గారిజన్ ఒక గంటలోపుగా లొంగిపోవలసిందనీ లేకపోతే గారి జను సంపూర్ణంగా మట్టిపాలు చేస్తామనీ ఆ హెచ్చరికలో తెలియచేశారు. ఈ అంతిమ హెచ్చరిక ప్రసారమైన తర్వాత కొంత సేపటివరకూ ఏ కాల్పులూ లేకుండా నిశ్శబ్దంగా వుంది. ఈ అవకాశాన్ని తీసుకొని మేజర్ గవ్రీ లోవ్ పార్టీ బహిరంగ సమావేశాన్ని ఏర్పరచాడు. కేవలం మెషీన్‌గన్నర్లూ రక్షక ప్రహరీపై శత్రువుల జాడలనూ కనిపెట్టేవారూ మాత్రం మినహా మిగతా మొత్తం గారిజన్‌లోని వారంతా మట్టిగట్టులోని ఒక పెద్ద కొట్టులో సమావేశమయ్యారు. కమ్యూనిస్టులు ఒకరి తర్వాత ఒకరు లేచినిలబడి శత్రువులకు లొంగిపోయేకంటే చివరివరకూ పోరాడి మరణిస్తామని ప్రమా

ణం చేశారు. ఆ సమావేశంలో పార్టీలో సభ్యులుగా చేరసంకల్పించే వారి దరఖాస్తులను అమోదిస్తామని ప్రకటన చేశారు. కమ్యూనిస్టేతరులైన ఆఫీసర్లూ, యితర సైనికులూ డజన్లకొద్దీ ముందుకువచ్చి దరఖాస్తులను అందజేశారు. వారందరినీ కూడా పార్టీలో చేర్చుకున్నారు. దరఖాస్తులను వ్రాయాలంటే కాగితాలు లేవు. అందువల్ల వార్తాపత్రికల ముక్కల మీదనూ, ఆఖరికి గారిజన్‌ను లొంగిపొమ్మంటూ నాజీలు అందజేసిన కరపత్రాలమీదనూ దరఖాస్తులను వ్రాసి యిచ్చారు.

ఏమైతేనేం, కోటను యింకా ఎంతకాలమో నిలబెట్టుకోలేమనేది స్పష్టమైపోయింది. శత్రువులచేతుల్లో చిక్కకుండా వుండేందుకని గ్రవీలొవ్ ఆజ్ఞలప్రకారం స్టాఫ్ కాగితాలన్నిటినీ నాశనం చేసివేశారు. కోటలో యింకా వున్నటువంటి ప్రత్యేక ఫిరంగిదళంవారి జెండాను పాతిపెట్టేయాలని నిశ్చయించుకున్నారు.

ఈ జెండాను జాగ్రత్తగా వుంచే బాధ్యతను రక్షణ మొదటి రోజులలో సీనియర్ లెఫ్టినెంట్ క్రషమ్‌కో జూనియర్ సార్జెంట్ రొడిఓన్ సెమెన్యూక్‌కు ఒప్పజెప్పాడు. క్రషమ్‌కో యుద్ధంలో మరణించాడు. అయినా సెమెన్యూక్ మాత్రం యింకా బ్రతికే వున్నాడు. అతడు ఆ జెండాను తన చొక్కాకింద ఛాతీ చుట్టూ చుట్టేసుకున్నాడు. ఆ జెండాను దాచి వేయవలసిన సమయం యిప్పుడు ఆసన్నమయింది.

ఆ జెండాను సెమెన్యూక్ అతి జాగ్రత్తగా టార్పాలిన్‌లో చుట్టేశాడు. దగ్గరలోనే వున్న ఒక అశ్వశాలలో దొరికిన ఒక కాన్‌వాస్ బార్చీలో ఆమూటను వుంచాడు. ఆ బార్చీను ఒక లోహపు ముంతలో పెట్టాడు. తర్వాత కోటగోడ కొట్లు ఒకదానిలో గొయ్యి తవ్వి అందులో ఆ జెండా

వున్న బాల్చీని పాతిపెట్టాడు. పైన మట్టిపోసి కాలితో దిమ్మిస చేసి ఆ స్థలాన్ని బహు జాగ్రత్తగా మరుగుపరచాడు.

ఈలోగా శత్రువులిచ్చిన అంతిమ హెచ్చరిక గడువు అంతమై పోయింది. హిట్లరు ఫిరంగిదళం కాల్పులు ప్రారంభించింది. విమానాలు మళ్లీ కోటపై వలయాలు తిరగడం ప్రారంభించాయి. జూనియర్ సార్జెంటు త్వరత్వరగా శ్రేణిలోని తన స్థానానికి వెళ్లిపోయాడు. యుద్ధం నడుస్తూనే వుంది.

కోటపై పెద్ద ఎత్తున బాంబుల వర్షం కురిపించిన తర్వాతనే, కోట భవనం నాశనమైపోయి, లోని ఆవరణంతా పెద్ద అగ్ని సముద్రంవలె మంటలతో నిండిపోయిన తర్వాతనే నాజీ ఇన్‌ఫెంట్రీ, కోట మట్టిగట్లపై ఒక్కుమ్మడి దాడిచేసి లోపలి కొట్లలోకి చొరబడగలిగింది. ఈ బాంబుల వర్షం కురిపిస్తున్నప్పుడు ఒక విమానం 1800 కిలోగ్రాముల బరువుగల బాంబును వదలింది. ఆ దెబ్బతో మొత్తం బ్రెస్టు దుర్గం అంతా దద్దరిల్లి పోయింది. కొట్లలోకి చొరబడిన జర్మన్ కాల్బలం స్త్రీలనీ, పిల్లలనీ, క్షత గాత్రులనూ, అలసి మిగిలిపోయిన బహు కొద్దిమంది గారిజన్ సైనికు లనూ ఖైదీలుగా పట్టుకుంది. ప్రతీ కొట్టునీ క్షుణ్ణంగా వెదికిన ప్పటికీ కూడా ఆ కాల్బలంవారు మేజర్ గవ్రీలొవ్ జాడనుగానీ, ముట్టడి సమయమంతటా ఉత్సాహవంతంగా రెండవ కమాండరుగా పనిచేసిన మేజర్ గవ్రీలొవ్‌యొక్క రాజకీయ సహాయకుని జాడనుగానీ తెలుసుకో లేకపోయింది. వారు ఆత్మ హత్య చేసుకొని వుంటారని శత్రువులు అంతిమ నిర్ణయానికొచ్చారు.

# దుర్గనగరపు కడపటి రక్షకులు

కమిస్సార్ ఫొమీన్ మరణానంతరం కొన్ని రోజుల తర్వాత కాప్టెన్ జుబచోవ్ నాయకత్వంకింద కొంతమంది మనుషులు ప్రాణాలకు తెగించి మధ్య దుర్గంనుండి ఉత్తరానికి ఛేదించుకొని వెళ్లే ప్రయత్నాన్ని మళ్లీ ఒకసారి చేశారు. కాని యీపాటికల్లా ఫాసిస్టులు తమ శ్రేణిని ఉత్తర విభాగంలో విశాలపరచుకున్నారేమో, జుబచోవ్ మనుషులకీ జర్మన్లకీ మధ్య జరిగిన పోరాటంలో జుబచోవ్ జట్టువారు ఓడిపోయారు. వారిలో కొద్ది మందినీ, క్షతగాత్రుడైన వారి నాయకునీ ఖైదీలుగా ఫాసిస్టులు పట్టుకున్నారు.

దాదాపు అదే సమయంలో లెఫ్టినెంట్ బిత్కో నాయకత్వం కింద నున్న ఒక జట్టు యుద్ధం చేయడం లేదనే చెప్పాలి. వారికి మందుగుండు సామాగ్రి యిక అందడం లేదు. వాటి సరఫరా దాదాపు ఆగిపోయిందన్న మాటే. బిత్కో రివాల్వరులో ఒకేఒక తూటా మిగిలిపోయిన సమయం ఆసన్నమయింది. తమ సీనియర్ లెఫ్టినెంటు తమను వీడి వెళ్లిపోవ ప్రయత్ని స్తున్నట్టు అతని స్నేహితులు కనిపెట్టేశారు. అతడు మంచి ధైర్యసాహసాలుగల కుబాన్ కొస్సాక్. నిశ్చల బుద్ధిగల కమ్యూనిస్టు. దీర్ఘానుభవంగల ఆఫీసరు. బ్రతికుండగా శత్రువులకు చిక్కడమంటే అతనికి సహించరాని విషయం. అందువల్లనే వసీలియ్ బిత్కో తన ఆఖరి తూటాతో ఆత్మహత్య చేసుకోవడానికి నిశ్చయించుకున్నాడు.

కాని అతని స్నేహితులు ఆతని ఉద్దేశాన్ని పసికట్టేశారు. యుద్ధం జరుగుతూ వున్నప్పుడు మధ్యమధ్య ఏర్పడిన నిశ్శబ్ద సమయంలో బిత్కో

ఏదో ఒక సాకు చెప్పి నేలమాళిగను విడిచి వెళ్ళబోగా వారు అతనిని చుట్టు వేసి ఆత్మహత్య చేసుకోవద్దని బోధించడం మొదలుపెట్టారు. అతని మరణంవల్ల మిగతా వాళ్లంతా నిరుత్సాహపడిపోతారనీ, వాళ్లందరికీ ఏ విధి తటస్థించనున్నదో దానినే అతడూ పంచుకోవాలనీ వారు వాదించారు. బిత్కో తలవంచుకున్నాడు. సమాధానం చెప్పలేదు. కాని వారి వాదనలు అతనిపై ప్రభావాన్ని వేశాయనడం స్పష్టమైపోయింది.

వారావిధంగా సంభాషిస్తున్నప్పుడు కొంతమంది నాజీ సబ్‌మెషీన్ గన్నర్లు బేస్‌మెంటు కిటికీని సమీపించారు. బిత్కో తలనిపైకెత్తి కిటికీ లోనుంచి చూశాడు. అందరికంటే ముందున్న సబ్‌మెషీన్‌గన్నరు కొద్ది అడుగుల దూరంలో మాత్రమే వున్నాడు.

"ఓరి ఫాసిస్టు వెధవా! ఈ తూటా నాకోసం ఉంచుకున్నాను. కాని యిప్పుడు దీంతో నీ భరతం పడతా," అని బిత్కో పెద్దగా అరిచాడు.

అతడు తూపాకీని ఎక్కుపెట్టి ఆ నాజీసైనికుని అక్కడికక్కడే కాల్చిపారేశాడు.

అదే రోజున బిత్కో, సీనియర్ లెఫ్టినెంట్ సెమేనెన్‌కొ, జూనియర్ లెఫ్టినెంట్ స్గిబ్నెవ్‌ల నాయకత్వంకింద యీ గ్రూపులో మరణించగా మిగిలిన ఆఖరి సైనికులు, ముహవేత్స్ గట్టుకు చొరబడి శత్రువుతో ముఖాముఖీ పోరి వాయవ్య దిశవైపుకు బలవంతంగా తోసుకు వెళ్లేందుకు ప్రయత్నించారు. అసమానమైన ఆ పోరాటంలో మొత్తం సమూహమంతా చెల్లాచెదరైపోయింది. ముగ్గురు కమాండర్లనీ ఖైదీలుగా పట్టుకున్నారు. ఆ రాత్రి వారిని బూగ్‌నది ఆవలి గట్టుకు నడిపించుకొని వెళ్తూండగా బిత్కో, స్గిబ్నెవ్‌లు తప్పించుకు పారిపోయారు. రెండు రోజుల తర్వాత బాగా గాయపడి దెబ్బలు తిన్నటువంటి స్గిబ్నెవ్‌ను హిట్లరు సైనికులు క్యాంపులోకి



సీనియర్ లెఫ్టినెంట్ వసీలియ్
బిత్కో

యిద్దుకొచ్చారు. పశ్చిమ బూగ్‌నదిని యీదడానికి ప్రయత్నించగా శత్రువుల తుపాకిగుండుకి వసీలియ్ బిత్కో మరణించినట్టు అతడు తన స్నేహితులతో చెప్పాడు.

అదే సమయంలో బ్రెస్టు దుర్గపు మరొక ఉత్తమోత్తమ వీరుడూ, సరిహద్దు రక్షకసైన్యం లెఫ్టినెంటూ అయిన అన్‌ద్రేయ్ కిజెవాతొవ్ వీరస్వర్గాన్ని అలంకరించాడు.

సీనియర్ లెఫ్టినెంట్ పొతాపొవ్వూ, అతని మనుషులూ పశ్చిమ దీవి నుండి సబ్‌మెషీన్‌గన్నర్ల దాడులను తిప్పికొడుతూ కొద్ది రోజులవరకూ తెరేస్పొల్‌స్కీ గేటును నిలబెట్టుకుంటూ వచ్చారు. మందుగుండు సామగ్రి చాలా తక్కువగా వుంది. అయినప్పటికీ పొతాపొవ్ కూడా శత్రు వలయాన్ని ఛేదించుకొని వెళ్ళాలనే నిశ్చయించుకున్నాడు. కాని అతని పథకం జుబచోవ్, బిత్కోల పథకాలకు భిన్నంగా వుంది. ఉత్తరదిశగా ఛేదించుకొని వెళ్ళే ప్రయత్నంవల్ల పూర్తిగా నాశనమైపోవడం తప్ప వేరే లాభం వుండదని అతడు గుర్తించాడు. ఆ వైపునుండే దాడులు సంభవిస్తాయని శత్రువులు వూహించి తమ ప్రధాన సేనలన్నిటినీ ఆ ప్రాంతంలోనే కేంద్రీకరించారు. ఏమైతేనేం పశ్చిమ దిశయందుగానీ లేదా దక్షిణ దిశయందుగానీ వలయాన్ని ఛేదించుకుని బయటకువచ్చే ప్రయత్నం జరుగుతుందని హిట్లరు సైని

కులు ఎమాత్రమూ ఊహించలేదు. అందువల్లనే ఆ విభాగాలలో కొద్దిపాటి బలగాన్నే ఉంచారు. ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలని పొతాపొవ్ నిశ్చయించుకున్నాడు. అతడు తన గ్రూపును తీసుకొని పశ్చిమ దీవికి వెళ్లే వంతెనను జోరుచేసి దాటి ఆతర్వాత బూగ్‌నది పక్కపాయను యీది ఆస్పత్రి సమీపంలో పొరుగున వున్న దక్షిణ దీవిని చేరుకొని అక్కడనుండి, యుద్ధానికి పూర్వం ఎక్కడైతే సోవియట్ ఫిరంగి యూనిట్లు, టాంకు దళాలూ స్థావరం ఏర్పరచుకొని వున్నాయో, ఆ బ్రెస్టు దుర్గపు దక్షిణ మిలిటరీ కంటోన్‌మెంటుకు వెళ్లవచ్చునని భావించాడు. ఈ ప్రాంతంలో టాంకు దళాలకు చెందిన మనుషులు యింకా పోరాడుతూనే వుంటారని పొతాపొవ్ ఆశించాడు.

మామూలుగా యిచ్చే అంతిమ హెచ్చరికలలో ఒక హెచ్చరిక తర్వాత మధ్యదీవియొక్క దుర్గరక్షకులకు "ఆలోచించుకొనేందుకు" ఒక అరగంట సమయం ఇచ్చినప్పుడు, శత్రువులు తాత్కాలికంగా కాల్పులను సాగించడం ఆపివేశారు. ఇంకా జీవించి వున్న పొతాపొవ్వూ, అతని మనుషులూ తెరేస్పొల్‌స్కీ గేటును ఆనుకొని వున్న బారకాసుల వద్దకు పరుగెత్తారు. హెచ్చరిక సమయం అంతమైన మరుక్షణాన్నే శత్రువులు రెచ్చిపోయి రెండింతలు కోపంతో దుర్గ కేంద్రప్రదేశాన్ని ఫిరంగిగుండ్లతో తుడిచిపెట్టడం ప్రారంభించిన సమయంలో పొతాపొవ్ తన మనుషులకు ఆజ్ఞనొసగాడు. మొత్తం సమూహమంతా కూడా కిటికీలనుండి బూగ్‌నది గట్టుమీదికి దుమికి వంతెన మీదుగానూ దాని పక్కనే వున్న గట్టుమీదుగానూ పశ్చిమ దీవికి పరుగెత్తారు. వారు ఒక్క గుండైనా పేల్చలేదు. శత్రువు వారి దాడిని వెంటనే గమనించ లేదు. వారు అక్కడ ఏంజరుగుతున్నదీ గుర్తించి తమ మెషీన్‌గన్‌లను వంతెనమీదికీ, గట్టుమీదికీ గురిపెట్టి కాల్చేలోపునే పొతాపొవ్ మనుషులలో

చాలా మంది ఆ దీవిలో వున్న పొదలలో దాక్కోవడమూ, ఆగ్నేయ దిశగా వెళ్ళాుండడమూ సంభవించింది. పేత్య క్లీప, కోల్యా నోవికొవ్‌లు వున్నటు వంటి గ్రూపు యునిఫారమ్ టోపీని ధరించినట్టి ఒక సరిహద్దు సంరక్షకుని గట్టుపక్కనే వున్న పొదలలో కలుసుకున్నారు. అతడు నదిగట్టుకు సమీపంలో, శత్రువువైపు ఎక్కుపెట్టి వుంచిన ఒక తేలిక మెషీన్‌గన్ వెనుక పడుకొని వున్నాడు. ఉపయోగించినటువంటి తూటాలు అతనికి ఒక ప్రక్కగా కుప్పగా పడివున్నాయి. ఇంకా మిగిలి వున్న మందుగుండు సామగ్రి మరో ప్రక్కన వుంది. అతని చుట్టూ వున్న పొదలలోనూ, రొడ్డుమీదనూ నాజీ యునిఫారమ్‌తో వున్న కళేబరాలు పడివున్నాయి — అవే ఆ మెషీన్‌గన్నర్‌యొక్క పనికి నిదర్శనం.

ఆ సరిహద్దు సంరక్షకుడు చనిపోయిన వ్యక్తివలె నిశ్చలుడై వున్నాడు. పేత్య క్లీప అతని వద్దకి పరుగున వెళ్ళేసరికి అతడు నెమ్మదిగా తల పైకెత్తాడు. అతని ముఖం ఎంత భయంకరంగా వుందంటే, పరుగెడుతూ వస్తోన్న కుర్రాడల్లా సంభ్రమంతో చటిక్కున ఆగిపోయాడు. ఆ ముఖం నమ్మడానికి వీల్లేనంతగా కృశించి నేలమట్టిలాగున బూడిద వర్ణంతో వుంది. ఆ ముఖంనిండా దట్టంగా పెరిగి వుంది గడ్డం. చింతనిప్పులువలె ఎర్రగా వున్న గుంటలుపడిన కళ్ళకింద నల్లని మచ్చలు ఏర్పడ్డాయి. అతడు నిద్రాహారాలు లేకుండా, శత్రువులను అటువైపునుండి పోనివ్వకుండా చూడాలనే ఏకైక ధ్యేయంతో కొద్దిరోజులపాటుగా ఆ తుపాకీ పక్కనే పడివున్నాడనేది స్పష్టమైపోయింది.

పొతాపొవ్ గ్రూపులోని మనుషులు అతని చుట్టూ చేరి, అతడు కూడా తమతోపాటే శత్రు వలయాన్ని ఛేదించుకుని వెళ్ళవలసిందిగా కోరారు. కాని ఆ మెషీన్‌గన్నరు నెమ్మదిగా తల ఆడించి, వింతగా, నిర్లక్ష్యపు

కంఠధ్వనితో యిలా అన్నాడు: "నేను యిక్కడినుండి ససేమిరా ఎక్కడికీ కదలేను."

అతనితో వాదించి ఏం ప్రయోజనం లేదు అన్నట్టుగా వుంది అతని ధోరణి. వారు అక్కడ యిక ఏమాత్రమూ ఆలస్యం చేయకుండా పొదల గుండా పరుగెత్తారు. కొద్ది నిముషాలు తర్వాత పశ్చిమదీవినీ, దక్షిణదీవినీ విడదీస్తూన్న నదియొక్క పక్కపాయవద్దకు వచ్చి నీళ్లల్లోకి దుమికారు.

ఆ సమయంలో అక్కడి పొదలలో దాగున్న జర్మన్ మెషీన్‌గన్‌లు కాల్పులను సాగించాయి. ఆ కాల్పులకు బూగ్‌నదీ జలాలు కవ్వంతో చిలికినట్టు నురుగులు కక్కాయి. ఈదుతోన్న మనుషుల తలలు ఒకదాని తర్వాత మరొకటి నీటి కిందికి అదృశ్యమైపోయాయి. ఆవలిగట్టున పొదలలో కుక్కలతో వున్న సబ్‌మెషీన్‌గన్నర్ల ఆకృతులు కనిపిస్తున్నాయి.

పొతాపొవ్ మనుషుల్లో ఎక్కువమంది నదిలో సబ్‌మెషీన్‌గన్నర్ల తుపాకులకు బలి అయ్యారు. కొద్దిమంది మాత్రమే అవతలి గట్టును చేరుకోగలిగారు కాని వాళ్లల్లో చాలామంది శత్రువు చేతుల్లో చిక్కారు. నదిలోకి దూకని వాళ్లు మాత్రం, దుర్గంనుండి యుద్ధాన్ని కొనసాగించే అవకాశం యింకా వుంది కనక, దుర్గాన్ని చేరుకొనే ప్రయత్నంతో వెనక్కి తిరిగి వంతెన వద్దకూ గట్టుమీదికీ పరుగెత్తారు.

కేంద్రదుర్గ సంరక్షకుల ప్రధాన సమూహాలు సంఘటితమైన ఒకే మొత్తంగా ఉండకపోయినా పోరాటం మాత్రం నడుస్తూనే వుంది. యుద్ధ స్వభావం మాత్రం మారిపోయింది. దుర్గరక్షణా విధానం యిక ఏకరీతిని కొనసాగలేదు. దుర్గరక్షకుల వివిధ గ్రూపుల మధ్య తరచూ సంబంధంగానీ, సమన్వయంగానీ యిక లేకపోయింది. వారు అనేక విడివిడి ప్రతి ఘటనా కేంద్రాలుగా ఏర్పడ్డారు. కాని ఆ ప్రతిఘటన చాలా తీవ్రమైనదిగానూ

దుఃఖకరమైందిగానూ పరిణమించింది. శత్రు వలయాన్ని ఛేదించుకొని వెళ్లడమనేది అసంభవమని ప్రతి ఒక్కరూ గుర్తించారు. వాళ్లకు మిగిలిందల్లా ఒకేఒక తరుణోపాయం. అదేమిటంటే తూర్పువైపునుండి సహాయం వచ్చేంతవరకూ, లేదా తుపాకులను ఎత్తిపట్టుకునే సత్తువ యిక తమ చేతులకు లేనంతవరకూ పోరాడి ఏవిధంగానైనా సరే దుర్గాన్ని శత్రువుల వశంకాకుండా నిలబెట్టడం.

ఈ ఆఖరి దుర్గరక్షకుల పట్టుదలను చూసి శత్రువుల ఆఫీసర్లూ, సైనికులూ ఆశ్చర్యపోయారు ఆ పట్టుదల ఎందువల్లనో శత్రువులకి అర్థం కాలేదు. అది ఏదో కారణం తెలియసాధ్యం కానటువంటిది. అసంభవమైనటువంటిది. దుర్గరక్షకులు దేనిని ఆశిస్తున్నారు? వాళ్లకి ఆ శక్తి ఎక్కడ్నుంచి వచ్చింది? దుర్గంకోసమై ఆఖరి యుద్ధాలలో పాల్గొన్న జర్మన్ ఆఫీసర్లు ఈ ప్రశ్నలను అడగటం బ్రెస్ట్ పట్టణవాసులు విన్నారు.

అది నమ్మశక్యం కాకుండా వుంది. మరణించిన సోవియట్ సైనికులూ, ప్రాణాలతో పట్టుబడ్డ కొద్దిమందీ వీళ్లంతా కూడా సంపూర్ణంగా శల్యావశిష్టులైపోయారు. ఆ నడుస్తున్నది ఖైదీలు కాదు, వారి అస్థిపంజరాలే. వారు ఆకలితో తమ పాదాలపైన ఊగిసలాడిపోతున్నారు. వాళ్లని చూసీచూడ్డంతోటే గుండెలు చెదిరిపోయి, పల్లెలలోని స్త్రీలు కంట తడి పెట్టారు. భరింపరాని దాహంతో విపరీతమైన బాధ పడుతున్నారేమో, వారివెంట వున్న పహరా సైనికులు మంచినీళ్లు త్రాగడానికి అనుమతి యివ్వడంతోటే వారు చెంబులు చెంబులుగా నీళ్లనీ త్రాగగలిగారు. ఈ జీవచ్ఛవాలు ఆయుధాలని మోయగలిగి, వాటిని పైకెత్తి కాల్చగల్గి, ముఖాముఖి పోరాడగలుగుతాయనడం నమ్మశక్యం కానటువంటి విషయం. కాని దుర్గంలోని మనుషులు అదే నిరాశాపూరితమైన పరిస్థితిలో వున్నప్పటికీ కూడా

కాల్పులను సాగిస్తూ, చేతిబాంబులను విసరుతూ, బాయొనెట్లతో పోరాడుతూ, జర్మన్ 45 వ డివిజన్‌లోని స్థూలకాయులైన తుపానుదాడి సైనికులను తమ తుపాకుల మడమలతో మోదుతూ దుర్గంలో యుద్ధాన్ని కొనసాగిస్తున్నారు. వీళ్లకి ఆ శక్తి ఎక్కడనుంచి వచ్చింది? శత్రువులలో ఎవరికీ అది అర్థం కాలేదు.

కాని వారి శక్తి దాదాపు ఉడిగిపోయిందనే చెప్పాలి. సోవియట్ సైనికులు తమ తుపాకులని పట్టుకోలేకుండా వున్నారు. బాగా అలసిపోవడంవల్ల కదలలేకుండా వున్నారు. శత్రువులంటే ఏర్పడిన పట్టరాని పగా, విపరీతమైన కోపమూ, యివే వారికి పోరాటంలో ఊతనొసగింది. ఈ పోరాటం మానవ ఓరిమి అవధులను అధిగమించింది. బ్రెస్టు దుర్గం అనే సలసలకాగే ఒక పెద్ద అగ్నిభాండంలో ఎంతో ఓరిమితో గడపిన సుదీర్ఘ దివసాలు వారికి ద్వేషాన్ని నేర్పిన గుణపాఠశాలలయ్యాయి. వారికళ్ల ఎదుటనే నిస్సహాయులైన స్త్రీలూ, చిన్నపిల్లలూ బాంబులవల్లనూ, ఫిరంగిగుండ్లవల్లనూ తుత్తునియలైపోయారు. వారి స్నేహితులు వారి సరసనే పోరాడి మరణించారు. జూన్ 22 వ తేదీన హిట్లరుమూక తలవనితలంపుగా తమపైబడి తమ జీవితాలను కాలరాసి ధ్వంసం చేసిన విషయాన్ని ఏవిధంగా మరచిపోలేరో అదే విధంగా పై విషయాలను కూడా వారు మరచిపోలేరు. బూడిద వర్ణము, పచ్చరంగూగల దుస్తులలోని యీ నరహంతకులంటే సోవియట్ వీరుల హృదయాలలో విపరీతమైన ద్వేషం కుప్పలుకుప్పలుగా పేరుకుపోయింది. వారు ఆ పగను ఆపుకోలేరు. ఆకలిదప్పులకంటే కూడా ప్రతీకారాన్ని తీసుకోవాలనే ఆకాంక్ష బలీయమైపోయింది. వారియొక్క యీ నిశిత భావనే, సైనికుని విధినిర్వహణా, బానిసత్వాన్ని సహించక చావుకైనా తలయెగ్గ గలిగే స్వేచ్ఛామానవుని సగర్వమూ, బాగా తూర్పు దిశను మొత్తం

దేశమంతా కూడా పాల్గొంటూ దేశంఎత్తునా బ్రహ్మాండంగా జరిగే పోరాటంలో పాల్గొనడమనే చైతన్యతా మొదలైనవాటి సమ్మేళనమే. వారికి యీ పోరాటంయొక్క వివరాలు ఏవీ తెలియకపోయినప్పటికీ ప్రతి వ్యక్తీ కూడా యీ విషయాన్ని తన హృదయంలో చావో బ్రతుకో తేల్చుకునే విషయంగా పరిగణించాడు.

రోజురోజూ జర్మన్ ఫిరంగిదళంవారూ, సబ్ మెషీన్‌గన్నర్లూ దుర్గంలోని అంతిమ ప్రతిఘటనా జ్వాలలను ఒక క్రమపద్ధతిలో ఆర్పివేయడానికి కృషిచేశారు. కాని యీ మంటలు ఆరిపోవడానికి బదులు మళ్ళీ ప్రజ్వరిల్లడం చూసి వారు చకితులైపోయారు. దుర్గంలోని బారకాసులు తదితర భవనాల బేస్‌మెంటులనుండీ, మట్టిగట్లలో లోతుగా వున్న గదులనుండీ మెషీన్‌గన్ కాల్పులూ, రైఫిల్ కాల్పులూ సాగి, నిశ్శబ్దత అకస్మాత్తుగా పటాపంచలమవుతోంది. 45 వ నాజీ డివిజన్‌యొక్క శ్మశాన వాటిక ఇంకా విస్తృతమైపోతోంది. శత్రువులు కొట్లనూ, నేలమాళిగలనూ అతి జాగ్రత్తగా గాలించారు. ఎక్కడైతే సోవియట్ సేనలు ప్రతిఘటనను కొనసాగిస్తున్నాయో ఆ భవనాలను గది వెంట గదిని పేల్చివేశారు. కాని కొంత సేపయిన తర్వాత ఆ శిథిలాలనుండి మళ్ళీ కాల్పులు మొదలయ్యేవి. హిట్లరు సైనికులు చాలా కాలంగా తమ స్వాధీనంలో ఉన్నాయని భావించిన విభాగాలలోకి దుర్గరక్షకులలోని కొన్ని గ్రూపులు దారిచేసుకున్నాయి. ఎన్నడూ తల పోయనటువంటి ప్రదేశాలలో ఈ దుర్గరక్షక సమూహాల తూటాలు ఫాసిస్టులను చీల్చి చెండాడాయి. దుర్గరక్షకులు లోతుగా వున్న నేలమాళిగల కిందికి వెళ్ళి, జర్మన్లకు తెలియనటువంటి భూగర్భ మార్గాలద్వారా శత్రువులు ఆక్రమించుకున్నటువంటి విభాగాలను వొదలిపెట్టి వేరే చోట్లలో మళ్ళీ ప్రత్యక్షమయ్యేవారు.

జులై 8 వ తేదీన 45 వ డివిజన్ కమాండర్లు, మిగతా ప్రతిఘటనా కేంద్రాలని కొన్ని గంటలలో అణచివేయ వచ్చునుకదా అన్న ధీమాతో, దుర్గాన్ని పట్టుకున్నామని తమ హెడ్‌క్వార్టర్సుకు ఒక నివేదికను పంపించారు. కాని ఆ మర్నాడు యీ ప్రతిఘటనా కేంద్రాల సంఖ్య అధికమైపోయింది. పోరాటం కొనసాగుతూందన్నది స్పష్టమైంది.

బారకాసుల పశ్చిమ విభాగంలోనూ, 333 వ రెజిమెంటుయొక్క నేలమాళిగల్లోనూ, మధ్య దీవికి చెందిన ఆ మొత్తం భాగమంత టానూ వున్న దుర్గరక్షకుల సమూహాలు శత్రువుల అదుపులో లేనేలేవు. పశ్చిమ దీవిలో సరిహద్దు రక్షకుల మెషీన్‌గన్ కాల్పుల ధ్వనీ, రైఫిల్ కాల్పుల ధ్వనీ యింకా వినవస్తూనే వుంది. పశ్చిమ కోటకు అంటి పెట్టుకొని వున్న బ్లాక్‌హౌసు ఉత్తరవిభాగంలో యింకా కాల్పులను సాగి స్తూనే వుంది. ఆకీమొచ్కిన్ నాయకత్వంకింద వున్నటువంటి ఆఖరి ఫిరంగి దళపు మనుషులు తూర్పుగేటువద్ద ప్రాణాలకు తెగించి పోరాడుతున్నారు. రాజకీయ ఆర్గనైజరు వెనెదీక్తొవ్ నాయకత్వం కింద వున్న కొద్దిమంది రైఫిల్ మనుషులూ ఉత్తర మట్టిగట్లులోని ఒక కొట్టును కాపాడుకుంటూ వున్నారు. ప్రాణంగలదేదీ కూడా జీవించి ఉండడం అసంభవమన్నంత భయంకరంగా శత్రువులచే దాడిచేయబడిన తర్వాత తూర్పు కోటలో సహితం అకస్మాత్తుగా మళ్లీ జీవం ఉట్టిపడింది. ఆ మట్టిగట్లులోపలినుండి తేలిక మెషీన్‌గన్‌లు కాల్పులను సాగించాయి. వీటిని సాగించినది నాజీదాడినుండి ప్రాణాలు దక్కించుకున్న మేజర్ గవ్రీలొవ్, అతని మనుషులే.

గవ్రీలొవ్ ఖైదీగా చిక్కడంగానీ, స్వయంగా ఆత్మహత్య చేసుకో వడంగానీ సంభవింపలేదు. కోట మట్టిగట్లులో వున్న ఒక చీకటి కొట్టును అతడు కొద్ది రోజుల నుండీ తన కమాండ్ పోస్ట్‌గా చేసుకున్నాడు. నాజీ

మెషీన్‌గన్నర్లు ఆ కొట్లని వెతుకుతూండగా ఇక బయటి రావడానికి వీల్లేకుండా అతడు ఆ కొట్లో చిక్కుకున్నాడు. ముట్టడి మొదటినుండీ కూడా ఒక సరిహద్దు రక్షకసైనికుడు మేజర్ గ్రవీలొవ్‌వద్ద అడ్జుటెంట్‌గా పని చేస్తున్నాడు. మిగతా గారిజన్‌నుండి వీళ్లిద్దరూ విడిపోయి చేతిబాంబులను విసరుతూ, తమ ఆఖరి తూటాలతో జర్మన్ల కాల్పులకు సమాధానం చెప్పుతూ ఒక గదినుండి మరొక గదికి పరుగెత్తారు. కాని గారిజన్‌యొక్క ప్రతిఘటన అంతమైందని త్వరలోనే స్పష్టమైపోయింది. జర్మన్లు దాదాపు మొత్తం కోటనంతటినీ తమ స్వాధీనంలోకి తీసుకున్నారు. గ్రవీలొవ్‌వద్దా, అతని సహాయసైనికునివద్దా మందుగుండు సామగ్రి చాలా కొద్దిగా మాత్రమే వుంది. కాబట్టి జర్మన్లు కోటను విడిచి వెళ్లిపోయేవరకూ కూడా వాళ్లు అక్కడనే దాక్కొని వుండాలని నిశ్చయించుకున్నారు. కోటనుండి ఈశాన్య దిశగా బెలొవేజ్‌స్కయ పూశ్చయొక్క అడవుల వైపుకు దారిచేసుకోవడం సంభవమేనని వారికి అనిపించింది. ఆ అడవులలో సోవియట్ పార్టిజాన్‌లు అప్పటికే యుద్ధం చేస్తూ వుండవచ్చునని వారు ఆశించారు.

అదృష్టవశాత్తూ వారికి దాక్కొనేందుకు వీలుగా వుండే ఒక భద్రమైన స్థలం దొరికింది. రక్షణ తొలి రోజుల్లో, కోట మట్టిగట్లలో ఒక సొరంగ మార్గం తవ్వమని మేజరు తన మనుషులను ఆజ్ఞాపించాడు. కొట్లలోని యిటికె గోడలో ఒక కన్నం తవ్వారు. కొంతమంది మనుషులు ఒకరి తర్వాత ఒకరు ఆ సొరంగాన్ని తవ్వేందుకు పూనుకున్నారు. ఏమైతేనేం కోట మట్టిగట్లు ఇసుకతో కట్టినట్టు తేలింది. సొరంగం పైభాగం పడిపోతూ వున్నందువల్ల ఆ పనిని విడిచివేయవలసి వచ్చింది. కాని గోడలోని ఆ కన్నం మాత్రం అలాగే ఉండిపోయింది. దాని వెనకాల కోట మట్టిగట్టు మందంలో లోతుగా వున్న ఒక మోస్తరు బొరియ వుంది. ఈ బొరి

యనే గ్రవీలోవ్వా, అతని అడ్జుటెంటూ కలిసి తాము దాక్కోవలసిన రహస్యస్థలంగా ఎన్నుకున్నారు. సరిగ్గా ఆ సమయంలోనే ఆ స్థలానికి సమీపంలో వున్న గదులను వెతుకుతూన్న నాజీసైనికుల కంఠధ్వనులు వారికి వినిపించాయి.

దుర్గరక్షకులు తవ్వి వదలినటువంటి సన్నని సొరంగపు మార్గంలోని ప్రాకి మేజరూ అతని అడ్జుటెంటూ కుడివైపుకీ, ఎడమ వైపుకీ తవ్వడం మొదలుపెట్టారు. ఇసుక బులబులాగ్గా వుందేమో తవ్వడానికి తేలికైపోయింది. వారు క్రమక్రమేణా గోడలో చేసిన ఆ కన్నంనుండి ముందుకు కదలి వెళ్లడం ప్రారంభించారు. గ్రవీలోవ్ ఎడమవైపుకు బొరియ చేస్తున్నాడు. అతని అడ్జుటెంట్ కుడివైపుకు కన్నంచేస్తున్నాడు. వాళ్లిద్దరు తమ వెనుకనున్న సొరంగాన్ని మూసివేసి పందికొక్కులవలె విపరీతమైన వేగంతో ముందుకు తవ్వుతున్నారు. శత్రుసైనికులు ఆ గదిని ప్రవేశించే లోపునే ఆవిధంగా ఒక అరగంట గడచిపోయింది. ఈ సమయంలో మేజరూ, అతని అడ్జుటెంటూ ప్రవేశపుబిలంనుండి గోడ లోపలి భాగం వెంట మూడు గజాల మేరకు బొరియ చేయగలిగారు.

నాజీసైనికులు ఆ గది వెతుకుతూ ఒకరితో ఒకరు మాట్లాడుకోవడం గ్రవీలోవ్ స్పష్టంగా విన్నాడు. ఒక్క అడుగు వేసినా ఆ శబ్దాన్ని శత్రువులు వింటారని తెలుసుకొని అతడు ఊపిరి బిగబట్టేశాడు. నాజీలు ఆ కన్నాన్ని కనిపెట్టేశారనేది స్పష్టమైనట్టే కనపడింది. ఎందువల్లనంటే వారు ఆ కన్నంవద్ద కొద్ది నిముషాలవరకూ నిలబడి ఏ విషయాన్నో చర్చించుకుంటున్నారు. తర్వాత వాళ్లలో ఒకడు తన సబ్‌మెషీన్‌గన్‌ను ఆ కన్నంలోకి కాల్చాడు. ఒక్కక్షణం సేపు ఆ హిట్లరు సైనికులు చెవులు నిక్కపెట్టుకొని వింటూ నిశ్శబ్దంగా వున్నారు. అక్కడ ఎవరూ లేరని సంతృప్తి

చెందిన తర్వాత వారు యితర గదులను సోదా చేయడానికి వెళ్లి పోయారు.

గ్రవీలొవ్ తన బొరియలో కొద్ది రోజులపాటు కటికిచీకటిలో కాలం గడిపాడు. వెలుపల పగలో రాత్రో కూడా అతనికి తెలియదు. ఆకలిదప్పులు అతనిని రోజురోజూ చిత్రహింస చేసి పారేస్తున్నాయి. అతని జేబులో రెండు రస్కు రొట్టెలున్నాయి. అతడు వాటిని కొంచంకొంచంగా కొరికి తిన్నప్పటికీ కూడా అవి ఎన్ని రోజులో రాలేదు. దాహాన్ని కొద్దిగా ఉపశమనం చేసుకొనేందుకు అతనికొక మార్గం కనిపించింది. అతడు తన నాలుకను ఆ గది యిటుక గోడకు అంటిపెట్టి వుంచాడు. ఆ యిటుకలు చెమ్మగా వున్నాయి. వాటిమీద తడిచుక్కలున్నట్లున్నాయి. అతడు ఆకలినీ దప్పికనీ మరిచి పోయేట్టుగా చేసింది నిద్రాదేవత. తాను ఎక్కడ అజాగ్రత్తగా అటూ యిటూ కదుల్తానో అనీ, లేదా ఎక్కడ పెద్దగా మూలుగుతానో అనీ అతడు భయబడిపోయి ఒక కునుకు తీయడమూ, హఠాత్తుగా లేవడమూ యీ విధంగా నిద్రపోయాడు. శత్రువులు యింకా కోటలోనే వున్నారు. వారి కంఠ ధ్వనులు యింకా వినిపిస్తూనే వున్నాయి. ఒకటి రెండు సార్లు హిట్లరు సైనికులు ఆ గదిలోకి వచ్చారు.

మేజర్ ప్యోత్ర్ గ్రవీలొవ్,
1941

గ్రవీలొవ్‌కీ, అతని స్నేహితునికీ మధ్య యినుకగట్టు అడ్డుగా

వుంది. ఆ అడ్డుగా వున్న యిసుక ఆవల తన స్నేహితుడు బ్రతికి ఉన్నదీ లేనిదీ గ్రవీలోవ్‌కు తెలియదు. అతనిని యీల వేస్తూ పిలవాలంటే ఫాసిస్టులు సమీపంలో వుండి వింటారేమోనని గ్రవీలోవ్ భయపడ్డాడు. ఒక్క తప్పటడుగు వేస్తే సర్వమూ నాశనమైపోతుంది. ఇక మిగిలిందల్లా ఒక్కటే, జర్మన్లు కోటని విడిచి వెళ్ళిపోయేవరకూ తాను నిర్బంధంగా వేచి వుండటమే. తప్పించుకొని పారిపోయి పోరాటాన్ని కొనసాగించాలంటే అదొక్కటే తరుణోపాయం. ఎంత ఆకలిగా వున్నా, ఎంత దాహంగా వున్నా అతడు పోరాటాన్ని గురించి ఎన్నడూ మరవలేదు. అతని చేతులు అనేకసార్లు గుండ్లతో సిద్ధంగా వున్న తన పిస్తోలుమీదికీ, తన జేబులలో మిగిలి వున్న కొద్దిపాటి చేతిబాంబులమీదికీ అతి జాగ్రత్తగా వెళ్లుతూండేవి.

జర్మన్ల గొంతులు వినిపించడం నానాటికీ తగ్గిపోతూ వచ్చింది. చివరికి నిశ్శబ్దం నలువైపులూ అలముకొన్నట్లనిపించింది. తాను యిక బయటికి రావచ్చునని గ్రవీలోవ్ నిశ్చయించుకున్నాడు. ఇంతలోకే మట్టిగట్లపైన, సరిగ్గా తన నెత్తికిమీదుగా ఒక మెషీన్‌గన్ను కాల్పులను సాగించడం మొదలుపెట్టింది. ఆ శబ్దాన్నిబట్టి అది రష్యన్ తేలిక మెషీన్‌గన్ను అని అతడు పోల్చుకోగలిగాడు.

దానిని ఎవరు ఉపయోగిస్తున్నారు – తనవారేనా? లేక శత్రువులా? అతడు ఆ సందేహంతోనే బాధపడుతూ కొద్ది గంటలవరకూ అలాగే పడుకొని వున్నాడు. ఆ మెషీన్‌గన్ను ఏకధాటిగా కాల్చకుండా అప్పుడప్పుడు కొద్ది కొద్దిగా కాల్చడం జరుగుతోంది. ఆ మెషీన్‌గన్ను ఉపయోగించే వ్యక్తి తన మందుగుండు సామగ్రిని బహుజాగ్రత్తగా కాపాడుకుంటున్నట్టుంది. దాంతో గ్రవీలోవ్‌లో ఒక అస్పష్టమైన ఆశ జనించింది.

చిట్టచివరికి అతడు కృతనిశ్చయుడై తన అడ్జుటెంటుని అతి రహస్యంగా పిలిచాడు. సమాధానాన్ని అందుకున్నాడు. వారిద్దరూ చీకటిగా వున్న గదిలో ప్రాకుకుంటూ వచ్చారు. వాళ్లు మొదలు చేసిన పనేమిటంటే, అక్కడే తవ్వినటువంటి బావిలోని నీటిని కడుపునిండా తాగారు. తర్వాత తమవద్దనున్న చేతిబాంబులను సిద్ధంగా వుంచుకొని కోటయొక్క ఇరుకాటి ఆవరణలోకి తొంగిచూశారు. అది రాత్రి సమయం. పైనుండి ప్రశాంత మైన కంఠధ్వనులు వినిపిస్తున్నాయి. వారు రష్యన్‌లో మాట్లాడు కుంటున్నారు.

ఆ మట్టిగట్లమీద మూడు తేలిక మెషీన్‌గన్‌లతో పన్నెండు మంది సోవియట్ సైనికులు వున్నట్టు తేలింది. శత్రువులు కోటని పట్టుకున్న ప్పుడు వారు కూడా గవ్రీలొవ్‌లాగానే దాక్కోగలిగారు. జర్మన్ సబ్‌మెషీన్ గన్నర్లు అక్కడ్నుంచి వెళ్లిపోయిన తర్వాత వారు ఆ దాక్కున్న స్థలంనుండి వెలుపలికి వచ్చి మరొకసారి తమతమ రక్షక స్థానాలను చేరుకున్నారు. వారు పగటిపూట గదిలో దాక్కొని రాత్రిపూట కోట దగ్గరికి వస్తూన్న శత్రు సైనికులపై కాల్పులు సాగిస్తున్నారు. కోటలో ఎవరూ లేరని హిట్లరు సైనికులు భావించారు. మెషీన్‌గన్ కాల్పులు కోటనుండి వస్తూన్నాయని వారింత వరకూ కనిపెట్టలేదు. అందుకు కారణం ప్రధానంగా ప్రతిచోటా కూడా అప్పుడప్పుడూ కాల్పులు సాగుతూండడమే. పశ్చిమ కోటయొక్క బ్లాక్‌హౌస్ మెషీన్‌గన్ తీవ్రంగానే కాల్పులు కొనసాగిస్తూంది. ఆఫీసర్ల బసలనుండి కాల్పుల శబ్దం వినవస్తోంది. ఒకప్పుడు వినిపించీ వినిపించనట్టూ మరొకసారి పెద్దగా వినిపిస్తూ, పేలిపోతోన్న బాంబుల శబ్దంతో మిళిత మైపోయిన కాల్పుల ధ్వానం మధ్యదీవినుండి వినవస్తోంది.

గవ్రీలొవ్ తన మొత్తం గ్రూపును బెలొవేజ్‌స్కయ పూశ్చలోనికి తీసుకు వెళ్లేందుకు ప్రయత్నం చేయాలని నిశ్చయించుకున్నాడు.

పగటిపూట కోట గోడమీద ఒక్క పర్యవేక్షకుని మాత్రమే వుంచే వారు. కాని రాత్రిపూట వాళ్లంతా పైకి వెళ్లేవారు. అవకాశం చిక్కినప్పుడు కాల్పులను సాగించేవారు కూడాను ఆవిధంగా కొన్నాళ్లు కొనసాగింది. పోరు మాత్రం ఆగలేదు. తరచూ నాజీ సైనికుల సమూహాలు ప్రత్యక్ష మౌతుండేవి. కోటను విడిచి వెళ్లడం యింకా అసాధ్యంగానే వుంది. అతి భయంకరమైన విషయం ఏమిటంటే దుర్గరక్షకులకి తినడానికి ఏమీలేదు. ఏదో కొద్దిగా నిల్వలున్న రస్కురొట్టెలు కాస్తా అయిపోయాయి. ఆకలి హెచ్చిపోతోంది. ఆ మనుషుల్లో మిగిలిన చిట్టచివరి శక్తి కూడా క్షీణించి పోసాగింది. ప్రాణాలకు తెగించైనా శత్రుసేనలని ఛేదించుకొనిపోయే ప్రయత్నం చేయాలనే సంకల్పం గవ్రీలొవ్‌కు కలగడం మొదలైంది. కాని అనుకోనటువంటి సంఘటనలు అతని పథకాలని తల్లకిందులు చేసివేశాయి.

ఒక జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్ల సమూహం పగటిపూట కోట గోడపైనున్న పర్యవేక్షకుని కంటబడకుండా కోటవద్దకు వచ్చింది. వచ్చిన మరుక్షణమే రష్యన్ సైనికులని గుర్తుపట్టేశారు. వెలుపలి ఆవరణనుండి "ఏయ్ రష్యన్, లొంగిపో!" అన్న కేకలూ, ఆ కేకలని అనుసరిస్తూనే పేలిన చేతిబాంబుల ధ్వనులూ ఒక మూలగా కునుకు తీస్తూన్న గవ్రీలొవ్ చెవిని బడ్డాయి.

జర్మన్ల సంఖ్య చాలా తక్కువగా వుండేమో వాళ్లల్లో అధికసంఖ్య మరణానికి గురికావలసి వచ్చింది. కాని కొంతమంది పారిపోయారు. ఒక గంట తర్వాత శత్రుసేనలు కోటని చుట్టివేశాయి.

మొదటి శత్రుదాడులను దుర్గరక్షకులు తిప్పికొట్టారు. ఫాసిస్టులు మోర్‌టార్‌లనూ, ఫీల్డుగన్‌లనూ తెచ్చారు. త్వరలోనే దుర్గాన్ని రక్షిస్తోన్న ఆ చిన్న గ్రూపులోని కొందరు మరణించారు. మరికొందరు

గాయపడ్డారు. ఆ తర్వాత శత్రువుల దాడి అన్నివైపులనుండీ జరిగింది. కేవలం సంఖ్యాబలంతోనే వారు ఆ కోటను పట్టుకోగలిగారు. సబ్ మెషీన్ గన్నర్లు కోటగోడ పై భాగం చేరుకున్నారు. కిందనున్న కోటలోని ఆవరణ వారి చేతిబాంబుల దయాదాక్షిణ్యాలకింద వుంది.

దుర్గరక్షకులు కోటగోడలోని కన్నంలో మరో సారి దాగున్నారు. కాని యీ సారి ముగ్గురయ్యారు. గ్రవీలొవ్వా, అతని అడ్జుటెంటూ, మరో సైనికుడూనూ.

అదృష్టవశాత్తూ ఆ సమయానికి చీకటి పడింది. నాజీసైనికులకు ఆ చీకటిలో గదులను వెదికే ధైర్యం చాలలేదు. తెల్లవారిన తర్వాత కోట లోని ప్రతి అంగుళం మేరనీ వెతుకుతారనీ తాము దాగున్న స్థలాన్ని శత్రువులు సులభంగా కనిపెట్టేస్తారనీ గ్రవీలొవ్ తెలుసుకున్నాడు. వెంటనే ఏదో ఒకటి చేయాలి.

రహస్యంగా ఒకరినొకరు సంప్రతించుకున్నాక వారు ముగ్గురూ అతి జాగ్రత్తగా ప్రాకుకుంటూ ఆ గదిలోకి వచ్చారు. గది నిర్మానుష్యంగా వుంది. కోటలోని ఆవరణలో కూడా ఎవ్వరూ లేరు. కాని వారు కోటగేటు వద్దకి ప్రాకుకుంటూ వెళ్ళేసరికి అక్కడికి కొద్ది దూరంలోనే నెగళ్ల చుట్టూ కూర్చుని వున్న శత్రు సైనికులు అగపించారు. కోట రక్షకులలో ఏ ఒక్కరు కూడా తప్పించుకొని పారిపోకుండా వుండేందుకని శత్రువులు కోటచుట్టూ వున్నారు. ఎప్పుడు తెల్లవారుతుందా అని ఎదురుచూస్తున్నారు.

తప్పించుకొని పారిపోవాలంటే అది కేవలం పోరువల్లనే సాధ్యపడు తుంది. గ్రవీలొవ్ ఆజ్ఞప్రకారం, నెగడి చుట్టూ కూర్చుని వున్న నాజీ సైనికులమీదికి ఆ ముగ్గురూ తలా ఒక చేతిబాంబూ విసరాలనీ, తర్వాత ఆ ముగ్గురూ మూడు దిక్కులకూ, అంటే గ్రవీలొవ్ అడ్జుటెంటు ఆఫీసర్లు

బసల వైపుగా దక్షిణానికీ, సైనికుడు వెలిపలిగోడ వైపుగా తూర్పుకీ, గవ్రీలొవు ఉత్తరపు గేటునుండి మధ్యదీవికి వెళ్లే రోడ్డువైపుగా పశ్చిమానికీ వెళ్లాలని నిశ్చయించుకున్నారు. గవ్రీలొవ్ వెళ్లే దారి మాత్రం చాలా ప్రమాదకరమైనటువంటిది. ఆ దారి వెంట హిట్లరు పటాలాలు తరచూ వెళ్తుంటాయి.

వారు కరస్పర్శచేసుకున్నారు. వాళ్లల్లో ఎవరైనా బతికి బాగుంటే తాము ఏ గమ్యాన్ని చేరుకోవాలనుకున్నారో ఆ బెలొవేజ్‌స్కయ పూశ్చవద్ద కలుసుకుందామని ఒక అంగీకారానికి వచ్చారు. అప్పుడు గవ్రీలొవ్ రహస్యంగా "కాల్చండి!" అని ఆజ్ఞాపించాడు. వారు వెంటనే తమ చేతిబాంబుల్ని విసిరారు.

జర్మన్ పర్యవేక్షక స్థావరాల శ్రేణిని తాను ఏవిధంగా దూసుకు పోయిందీ గవ్రీలొవ్‌కు జ్ఞాపకం లేదు. విసిరిన చేతిబాంబులు బద్దలయిన శబ్దమూ, నాజీ సైనికుల కేకలూ, తన నెత్తిపైనుండి రంయ్యిమని వెళ్తూన్న తూటాల శబ్దమూ, ధగధగ మండుతూన్న నెగళ్లవెలుగు తరువాత మరింత అంధకారంగా వున్న రాత్రి చీకటీ, యివన్నీ అతని మెదడులో నాటుకు పోయాయి. పిస్తోలునూ, రెండవ చేతిబాంబునూ చేతబట్టుకొని కాళ్లల్లో శక్తి వున్నంత వరకూ పరుగెత్తాడు. తన వెనకాలే పరుగెడుతూన్న అడుగుల శబ్దమూ అరుపులూ అతడు వినగలిగాడు. ఆ క్షణంలో అదృష్టవ శాత్తూ నిర్మానుష్యంగా వున్న రోడ్డువెంట పరుగెత్తినప్పుడు అతని మెదడు తేటపడింది. దమ్ము తీసుకొనేందుకై ఒక క్షణం ఆగాడు. ఆ సమయంలోనే మెషీన్‌గన్ గుండ్లు రంయ్యిమంటూ అతని తలమీదుగా వెళ్లాయి.

పశ్చిమ కోటకు పక్కగా వున్న బ్లాక్‌హౌస్‌నుండి అనామకుడైన ఒక రష్యన్ మెషీన్‌గన్నర్ కాల్పులు సాగిస్తున్నాడు. అరుపులు, కాల్పుల

శబ్దం వినే అతడు ఆ కనబడుతూన్న నెగళ్ల వెలుగు వైపుకే అతడు గురి పెట్టి తన మెషీన్‌గన్‌తో సుదీర్ఘమైన బారులు ప్రేల్చాడు. దెబ్బని తప్పించుకునేందుకై గ్రవీలొవ్ ఒక శిథిలమైపోయిన భవనం గోడపక్కన నేలకి అతుక్కుపోయి పడుకున్నాడు. తాను ఇంకొకరిని రక్షిస్తున్నట్లు తెలియకుండానే ఆ మెషీన్‌గన్నరు తనను కాపాడాడు. మేజర్‌ని వెంబడిస్తోన్న జర్మన్లు అనామకుడు సాగిస్తోన్న కాల్పులకు గురికావలసి వచ్చిందేమో, వారు ఒకరినొకరు కేక వేసుకొని వెనక్కి మళ్లారు.

సుమారు పదిహేను నిమిషాలు గడిచిపోయాయి. మళ్లీ అంతటా నిశ్శబ్దత నెలకొంది. తన శరీరాన్ని నేలకు అంటిపెట్టుకుని గ్రవీలొవ్ క్రమక్రమేణా రోడ్డుకు దూరమైపోతూ, వెలుపలి గోడ దిక్కుకు ప్రాకాడు.

గాఢాంధకారంగా వుందేమో, అతడు ఆ గోడని సమీపించేంతవరకూ దానిని చూడ్లేదు. అది మట్టిగట్లలోని కొట్లలో ఒక కొట్టుయొక్క యిటుకగోడ. తలుపుకోసం తడవులాడుతూ లోపలికి వెళ్లాడు.

ఒక గంట వరకూ కూడా అతడు నీళ్లు కారుతూ పాకుడుపట్టి వున్న గోడలని తడుముకుంటూ నడిచాడు. అప్పుడు చివరికి తానెక్కడున్నదీ తెలుసుకున్నాడు. యుద్ధానికి పూర్వం అది గుర్రాలసాల. అక్కడ రెజిమెంటుయొక్క ఫిరంగి దళానికి చెందిన గుర్రాలు వుండేవి. అతడిప్పుడు దుర్గం వాయవ్య విభాగంలో వున్నట్లు తెలుసుకున్నాడు. దాంతో అతనికి సంతోషంవేసింది. ఆ ప్రదేశం బెలొవేజ్‌స్కయ పూశ్చకు దగ్గరలోనే ఉండడమే అతని సంతోషానికి కారణం.

అతడు వెలుపలికి వెళ్లి మట్టిగట్లని అతి జాగ్రత్తగా ఎక్కి అగడ్త గట్టుకు చేరుకున్నాడు. తూర్పు దిశను ఆకాశాన పొద్దు పొడుస్తూ భళ్లున తెల్లవారుతోంది. అతడు మరో పనిని చేపట్టే లోపున గట్టుమీద బోర్లా

పడుకొని, చలనం లేకుండా నిలచి వున్న నీటిని చాలా సేపటివరకూ త్రాగాడు. తర్వాత ఆ నీళ్లల్లో అవతలి గట్టుకు నడుచుకుంటూ వెళ్లాడు.

అతడు అకస్మాత్తుగా ఆ చీకట్లో జర్మన్ల మాటలను విని నిశ్చేష్టుడై పోయి నివ్వెరపోతూ ముందుకు చూశాడు.

క్రమక్రమేణా ఆవలి గట్టున చూచాయగా అగపడుతోన్న గుడారాలను గుర్తింప మొదలుపెట్టాడు. ఎవరో అగ్గిపుల్లని వెలిగించారు. దాంతో సిగరెట్టును కాల్చుకున్నారేమో దాని కొన ఎర్రగా వెలుగుతోంది. అవతలి గట్టున శత్రువుల దళం ఒకటి బసచేసినట్టు స్పష్టమై పోయింది.

అతడు నిశ్శబ్దంగా నీటినుండి వెలుపలికి వచ్చి తిరిగి మట్టిగట్టు వద్దకి ప్రాకుకుంటూ వెళ్లాడు. ఇక్కడ అతడు కిందుగా వున్న ఒక ద్వారం అతనికి చీకట్లో అగపడితే, లోపలికి వెళ్లాడు. అది సన్నగా వున్న ఒక మూల గది. ఆ గదిలో కాల్పులను సాగించే రెండు నిలువు బీటలు వివిధ దిశలవైపు వున్నాయి. ఆ గదినుండి మట్టిగట్ల లోలోతులకు దారితీసే ఒక మార్గం వుంది. అతడు ఆ మార్గంగుండా వెళ్లాడు. మళ్లీ మొదటి గుర్రాలసాలకే తిరిగి వచ్చాడు.

తెల్లవారింది. వెలుగు స్పష్టంగా అగుపిస్తోంది. పగలు దాక్కోనేందుకై ఏదైనా ఒక స్థలాన్ని వెతుక్కోవాలి. కొంచం ఆలోచించిన తర్వాత అతడు ఆ మూలగదినే ఎంచుకున్నాడు. ఆ గది గోడలు మందంగా వున్నాయి. అక్కడ వున్నటువంటి కాల్పులని సాగించే రెండు నిలువు బీటలూ అతనికి ఉపయోగపడొచ్చు. ఒక వేళ నాజీసైనికులు అతని జాడ కనిపెట్టినట్లైతే, ఆత్మరక్షణకు అది మంచి అవకాశం ఇస్తుంది.

అతడు మరొకసారి ఆ గదిని పరీక్షించాడు. ఒక విషయం మాత్రం అతనికి ఆందోళన కలిగించింది. అతను దాక్కోనేందుకు అక్కడ ఏవిధమైన

మాటూ అగపడలేదు. శత్రుసైనికులు గుమ్మంలోంచి చూస్తే ఆ మరుక్ష ణాన్నే అతడ్ని చూడగలుగుతారు.

అప్పుడు అతనికి ఆ గది తలుపు దగ్గర్లోనే కాలవగట్టున గుర్రాల సాలలను పరిశుభ్రం చేస్తున్నప్పుడు కుప్పలుకుప్పలుగా పోగువేసిన గుర్రపు పెంట ప్రోగులు వున్నట్టు జ్ఞాపకం వచ్చింది. అతడు గబగబా దోసిళ్లతో ఆ పెంటను తీసుకువెళ్లి గది మూలను పోయడం మొదలుపెట్టాడు. తెల్ల వారేలోపునే తాను దాక్కొనే స్థలం సిద్ధమయింది. అతడు ఆ పెంట కుప్పలోకి వెళ్లి దాక్కున్నాడు. తన అయిదు చేతిబాంబులనీ, గుండ్లతో నింపిన రెండు పిస్తోళ్లనీ (ఒకటి సోవియట్ పిస్తోలు, రెండవది జర్మన్‌ది) సిద్ధంగా వుంచుకొంటూ శత్రువుల రాకను కనిపెట్టేందుకై ఒక చిన్న కన్నం చేసుకున్నాడా పెంటకుప్పలో.

ఆ మర్నాడు పగలంతా కూడా అతడా గదిలోనే దాగున్నాడు. కాలవ గట్టున ఏదో చేస్తూ ఒకరితో ఒకరు మాట్లాడుకుంటూ శత్రుసైనికులు అతనికి చాలా దగ్గర్లోనే అటూ యిటూ నడిచారు. ఒకసారి వాళ్లల్లో కొంత మంది ఆ గదిగుండా గుర్రాలసాలలోకి వచ్చారు. గ్రిలోవ్ తన పిస్తోలును కాల్చడానికి సిద్ధంగా వుంచుకున్నాడు. కాని వాళ్లు గదిమూలనున్న పెంట కుప్పను చూసుకోనే లేదు.

రాత్రిపూట అతడు మళ్లీ అగడ్త గట్టుకు వెళ్లి నీళ్లు తాగాడు. ఆవలి గట్టునున్న జర్మన్ గుడారాల నల్లని ఆకృతులను అతడింకా చూడ గలుగుతున్నాడు. సైనికుల కంఠధ్వనులను వినగలుగుతున్నాడు. కాని వారు వెళ్లిపోయేవరకు కూడా అతడు అక్కడే వేచి వుండాలని నిశ్చయించు కున్నాడు. అందుకు ప్రధాన కారణం ఏమిటంటే దుర్గంలోని కాల్పులు తగ్గిపోతున్నట్టున్నాయి. అంటే ఆఖరి ప్రతిఘటనా కేంద్రాలను శత్రువులు అణచి వేస్తున్నారన్నమాట.

అతడు మూడు రోజులు తిండిలేకుండా గడిపాడు. ఆతర్వాత ఆకలిని యిక అణచుకోలేకపోయాడు. గుర్రాలసాల సమీపంలో ఏదో ఒక పశువుల మేత ఉండి వుంటుందనీ అక్కడ బహుశా బార్లీగానీ ఓట్సుగానీ లభ్యమవగలదనీ అతనికి తట్టింది.

అతడు చాలాసేపటివరకూ ఆ గుర్రాలసాలను చేతులతో తడుము కుంటూ వెతికాడు. చివరికి ఒక మూలను ఏదో ఒక గట్టిగా వున్న కొన్ని ముక్కలు అతని చేతులకు తగిలాయి. ఒక ముక్క కొరికి చూశాడు. అది తినదగ్గ పదార్థమేనని తెలుసుకున్నాడు.

అది గుర్రాలకు పెట్టే గానుగపిండి అచ్చు. అందులో ధాన్యం, తవుడు, గడ్డి యింకా యితర పదార్థాలు వున్నాయి. ఏమైతేనేం ఆ అచ్చులు అతని ఆకలిని తీర్చగలిగాయి. అవి రుచిగా వున్నాయి కూడానూ. ఇప్పుడ తనికి ఆహార పదార్థాలు ఉన్నాయి. బెలొవేజ్‌స్కయ పూశ్చ రోడ్డు ఖాళీ అవడానికి ఎంత కాలం పట్టినా సరే అంతవరకు కూడా వేచి ఉండడానికి నిశ్చయించుకున్నాడు.

సుమారు అయిదు రోజులవరకూ అంతా సవ్యంగానే నడిచింది. అతడు గానుగపిండి అచ్చు తిన్నాడు. రాత్రిపూట అగడ్తలోని నీళ్లని తాగాడు. కాని ఆరవ రోజున అతనికి కడుపులో విపరీతమైన నొప్పిలేవడం మొదలు పెట్టింది. ఆ నొప్పి గంటగంటకీ అధికమైపోతూ అతనికి భరింపరాని బాధ కలుగజేసింది. ఆ పగలంతానూ, ఆ రాత్రంతానూ నొప్పితో మూల్గినట్లైతే అతడు శత్రువుల పాల్పడవలసి వస్తుందనే అతడు తన పెదవులను కొరుక్కోవలసి వచ్చింది. తర్వాత అతనికి మైకం కమ్మిందేమో ఎంత కాలం గడచి పోయిందీ అతనికి తెలియదు. తెలివి వచ్చిన తర్వాత చూసుకుంటే అతని వంట్లో ఏమాత్రం సత్తువ లేనట్లనిపించింది. చాలా బలహీనంగా వున్నాడు.

అతనికి వ్రేలు కదిపే ఓపిక లేకపోయినా కూడా పిస్తోళ్లకొరకూ చేతి బాంబులకొరకూ అప్రయత్నంగా వెతుక్కున్నాడు.

తన మూల్గులవల్లనే శత్రువులకి అతని జాడ చిక్కింది. కాని చాలా దగ్గరనుండి వినవస్తోన్న కంఠధ్వనుల చప్పుడువల్ల అతనికి అకస్మాత్తుగా మెలుకువ వచ్చింది. అతడు తన రహస్యపు కన్నంగుండా వెలుపలికి చూశాడు. ఇద్దరు సబ్‌మెషీన్‌గన్నర్లు తానున్న పెంట కుప్పమీద నిలుచుని వున్నారు. విచిత్రం ఏమిటంటే గవ్రీలొవ్‌కు శత్రువులను చూసీ చూడ్డంతోటే అతని బలం అతనికి తిరిగి వచ్చింది. అతడు తన జబ్బుస్థితిని మరచిపోయాడు. జర్మన్‌పిస్తోలును పట్టుకొని దాని 'సేఫ్టీ' మీటను పక్కకు మళ్లించి కాల్చడానికి సిద్ధంగా వుంచుకున్నాడు.

జర్మన్లు అతని కదలికను కనిపెట్టేశారన్నది స్పష్టమైపోయింది. వాళ్లు ఆ పెంటకుప్పను పక్కలకు తన్నడం మొదలుపెట్టారు. అప్పుడ తను పిస్తోలును పైకెత్తి అతి కష్టంమీద ట్రిగ్గర్‌ను నొక్కగలిగాడు. అది ఆటొమేటిక్ పిస్తోలు. ఆ సంగతిని అతడు తెలుసుకొనే లోపునే అతడు పిస్తోలు మేగజైనులో వున్న మొత్తం తోటాలన్నిటినీ పేల్చివేసేశాడు. నాజీసైనికులు పెద్దగా అరచుకుంటూ బూట్లను శబ్దం చేసుకుంటూ తలుపువద్దకు పరుగెత్తారు.

అతడు తన శక్తినంతటినీ కూడతీసుకొని, తనమీది గుర్రపు పెంట అంతా కింద పడిపోయేట్టు ఒళ్లు విదలించుకున్నాడు.

ఇది తన ఆఖరి పోరాటమని అతనికి తెలుసు. మృత్యువును ఒక సైనికునివలె, ఒక కమ్యూనిస్టువలె ఎదుర్కొని పోరాడేందుకని అతడు ఉక్కులాగా తయారయ్యాడు. తన అయిదు చేతిబాంబులనూ ఒక క్రమంలో పెట్టుకొని తన సోవియట్ పిస్తోలును చేత్తో గట్టిగా పట్టుకున్నాడు.

నాజీసైనికులు అతనిని ఎంతోసేపు అలా వేచి ఉండనివ్వలేదు. అయిదు నిముషాల్లోనే మెషీన్‌గన్‌లు అతడున్న గదిల్లో బీటకి కాల్పులని సాగించాయి. గుండేదేనా తుల్లి తనకి తగలడం తప్పిస్తే మిగతా దేనివల్ల కూడా అతనికి అపాయం కలుగదన్నట్టుగా ఆ నిలువు బీటలు ఆమరి వున్నాయి.

ఆతర్వాత అతడు తనని లొంగిపొమ్మంటూ అరుస్తూన్న నాజీ సైనికుల అరుపులను విన్నాడు. వాళ్ళు గోడవెంట అతి జాగ్రత్తగా ప్రాకుకుంటూ వస్తూంటారని వూహించాడు. వాళ్ళు బాగా దగ్గరకి వచ్చి అరచేవరకూ కూడా అతడు వేచివున్నాడు. అప్పుడతను ఆ నిలువు బీటలనుండి కుడివైపుకూ, ఎడమవైపుకూ రెండు చేతిబాంబులని విసిరాడు. జర్మన్లు చెల్లా చెదరై పోయారు. తాను విసిరిన చేతిబాంబులు వృథాకాలేదని శత్రువులనుండి వినవచ్చే మూలుగులవల్ల గ్రహించగలిగాడు.

ఒక అరగంట తర్వాత దాడి మళ్లీ కొనసాగింది. అతడు మళ్లీ నిరీక్షించి తన చేతిబాంబులని విసిరాడు. జర్మన్లు వెనక్కి మళ్ళారు. కాని యిప్పుడతనికి ఒకేఒక చేతిబాంబూ, పిస్తోలూ మిగిలాయి.

శత్రువులు తమ ఎత్తుగడలను మార్చుకున్నారు. గ్రవీలొవ్ నిలువు బీటలను ఒక కంట కనిపెట్టుకుంటూ వున్న సమయంలో సబ్‌మెషీన్‌గన్ కాల్పుల శబ్దం వినిపించింది. ఒక జర్మన్ సైనికుడు గుమ్మం వద్ద ప్రత్యక్షమయ్యాడు. గ్రవీలొవ్ తన ఆఖరి చేతిబాంబును ఆ జర్మన్ మీదికి విసిరాడు. మరో జర్మను సైనికుడు తన సబ్‌మెషీన్‌గన్ గొట్టాన్ని ఒక నిలువు బీటగుండా లోపలికి బలవంతంగా చొప్పించాడు. గ్రవీలొవ్ రెండు పర్యాయాలు పిస్తోలును కాల్చాడు. దాంతో ఆ మెషీన్‌గన్ గొట్టం అదృశ్యమైపోయింది. ఆ సమయంలో రెండో నిలువు బీటనుండి ఏదో లోపలికి ఎగిరి వచ్చి గదిలోని

నేలకేసి కొట్టుకుంది. దాంతో ఒక పెద్ద మంట మండింది. గ్రవిలోవ్ స్పృహ కోల్పోయాడు.

బ్రెస్ట్‌కు దక్షిణాన ఉన్న మిలిటరీ కంటోన్‌మెంటులో హిట్లరు కమాండ్ సోవియట్ ఖైదీలకొరకై ఒక పెద్ద క్యాంపు ఏర్పరచారు. అక్కడికి యుద్ధరంగం వివిధ విభాగాలలోనుండి యుద్ధ ఖైదీలను తీసుకు వెళ్తారు. అక్కడ ప్రతిరోజూ కూడా వందలాది ప్రజలు ఆకలితోనూ వ్యాధుల తోనూ మరణానికి గురికావలసి వచ్చేది. అప్పటికే అక్కడ ఒక ఆస్పత్రి వుంది. యుద్ధం ప్రారంభ దివసాలలో పట్టుబడ్డ సోవియట్ డాక్టర్లను ఆ ఆస్పత్రిలో పనిచేసేందుకు వుంచారు. వీళ్లల్లో కొంతమంది డాక్టర్లు, అంటే ఖైదు అనుభవించి ప్రాణాలతో బయటబడ్డవాళ్లు యిప్పుడు సోవియట్ యూనియన్‌లోని వివిధ పట్టణాలలో వున్నారు. వారు యీకింది విధంగా చెప్పారు. 1941 జులై 23 వ తేదీన, అంటే యుద్ధం మొదలైన ముప్పై రెండవ రోజున, అప్పుడే పట్టుబడినటువంటి ఒక సోవియట్ ఆఫీసరును ఆ ఆస్పత్రిలోకి తీసుకువచ్చారు. అతడు చాలా భయంకరమైన స్థితిలో వున్నాడు. అతని శరీరం నిండా గాయాలు తగిలాయి. గడ్డం పెరిగి వుంది. ఒంటినిండా దుమ్మూ, ధూళినీ. ఆహారాన్ని మింగే సత్తువ కూడా అతనికి లేకపోయింది. అతని ప్రాణాలను కాపాడేందుకని కృత్రిమ పద్ధతులతో అతనికి ఆహారం ఇవ్వవలసి వచ్చింది. అతనిని ఆస్పత్రికి తీసుకువచ్చిన హిట్లరుసైనికులు యీవిధంగా అన్నారు: "మేము అతనిని దుర్గంలోని గదులలో ఒక దానిలో చూసి ఖైదీగాపట్టుకో బోయినప్పుడు యీ మనిషి అప్పుడు ఎంతటి చావుబతుకుల్లో వున్నప్పటికీ కూడా తన శక్తిని కోలుకొని తన పిస్తోలుతోనూ, చేతిబాంబులతోనూ మా వాళ్లను కొంతమందిని చంపుతూ ఒక గంటవరకూ పోరాడాడు."

ఆ ఆఫీసరే మేజర్ ప్యోత్ గవ్రీలొవ్.

శత్రువులు అతని అద్భుతచర్యకి మెచ్చుకొని అతనిని బతుక నిచ్చారు. ఆ తర్వాత మూడు రోజులపాటుగా జర్మన్ ఆఫీసర్లు ఆ క్యాంపు ఆస్పత్రికి అలాంటి అపూర్వ ధైర్యాన్నీ, నైతిక శక్తినీ ప్రదర్శించినటు వంటి సోవియట్ మేజర్‌ను చూడ్డానికని వస్తూనే వున్నారు.

అయినా గవ్రీలొవ్ దుర్గాన్ని రక్షించే వారిలో ఆఖరివాడు మాత్రం కాదు. ఆగస్టు నెలలో కూడా నేలమాళిగలనుండీ, బేస్‌మెంట్లనుండీ తుపాకీ కాల్పులూ, చేతిబాంబుల ప్రేలుళ్లూ వినవస్తుండేవి అని అన్నారు. దండ యాత్ర చేస్తున్నవారిలో చాలామంది ఆ దుర్గనగర శిధిలాల మధ్య మర ణానికి గురికావలసి వచ్చింది. సోవియట్ కమాండర్లూ మనుషులూ వున్న గ్రూపులు లోతుగా వున్న నేలమాళిగల్లో దాక్కొని శత్రువులకు ఎంతటి అపాయకరంగా తయారయారంటే ఆ ఫాసిస్టులకు తాము పట్టుకున్న దుర్గంలో ఒంటరిగా తిరగాలంటే ఎంతో భయం వేసేది. బూగ్ నదీ జలాలతో దుర్గంలోని నేలమాళిగలను నింపివేయవలసిందిగా చివరికి జర్మన్ కమాండ్‌వారు ఆజ్ఞ ఇచ్చారని హిట్లరు ఆఫీసర్లు బ్రెస్ట్ పట్టణవాసులకు తెలియచేశారు. అనామకులు, అమరులైన ఆ బ్రెస్ట్ దుర్గపు ఆఖరి రక్షకులు ఓటమిని ఎరుగకుండా ఆవిధంగా మరణించారు.

అప్పటికీ, ఫాసిస్టులు దుర్గాన్ని సంపూర్ణంగా స్వాధీనపరచుకున్న తర్వాత కూడా కొద్దినెలల వరకూ సోవియట్ ఆఫీసర్లూ, మనుషులూ వ్యక్తిగతంగా అక్కడి శిధిలాలలో దాక్కొని కూడా అప్పుడప్పుడు రాత్రిపూట కాల్పులను సాగిస్తూ ఏవిధంగా పోరాడిందీ బ్రెస్ట్ పట్టణవాసులూ ఆ చుట్టుపట్ల పల్లెటూళ్లవాళ్లూ అప్పుడప్పుడు అద్భుతమైన కథలుగా చెప్పు తుంటారు. 1941–42 శీతాకాలంలో దేశాన్ని ఆక్రమించుకుంటోన్న

దురాక్రమణ సైన్యాలు దుర్గంలోని రాళ్లనీ రప్పలనీ శుభ్రం చేయమని ప్రజలని నిర్బంధంచేసి పంపినప్పుడు ఒక్కొక్కప్పుడు ఆ శిధిలాల మధ్య చినుగు గుడ్డలతో ఎర్రసైన్యపు దుస్తులను తొడుక్కొని వున్న మనుషులను చూసినట్టు స్థానిక ప్రజలలో కొంతమందికి బాగా జ్ఞాపకం వుంది. ఒక అనామకుడు సగం కూలిపోయిన గోడలమీద: "జర్మన్ దండయాత్రికులకి మరణమే!" అన్న మాటలను అనేక సార్లు వ్రాశాడు.

దుర్గరక్షకులలో ఒకడైన అలెగ్జాండర్ దురాసావ్ యింకా అద్భుతమైన కథ చెప్పాడు. అతడు ఒకప్పుడు 84 వ రెజిమెంటులో సార్జెంట్-మేజర్‌గా పనిచేశాడు. ఇప్పుడు బైలొరష్యాలోని మొగిలోవ్ పట్టణంలో నివసిస్తున్నాడు.

దుర్గంకొరకు పోరాడుతోన్న సమయంలో గాయపడిన సార్జెంట్-మేజర్ దురాసావ్‌ను శత్రువులు ఖైదీగా పట్టుకున్నారు. బ్రెస్ట్‌కు సమీపంలో వున్న ఖైదీల క్యాంపులో అతడు కొన్ని నెలలు గడిపాడు. 1942 వసంతఋతువులో అతని గాయం మానినప్పుడు అతనిని బ్రెస్ట్‌కు పంపించారు. జర్మన్ ఆస్పత్రిలో నిర్బంధంగా పనిచేస్తున్న కార్మికుల జట్టులో అతనిని కూడా చేర్చారు.

బ్రెస్ట్ బస్తీలో నాజీలు నెలకొల్పినట్టి యూదులు నిర్బంధంగా నివసించాల్సిన "ఘెట్టో"లోని ఒక యూదుల గ్రూపు కూడా ఖైదీలతో పాటు పనిచేసింది. ఖైదీలకు కాపలా ఉన్నట్టుగా యూదులకు కాపలాలేదు. అయినా దండయాత్ర చేస్తోన్న నాజీలూ ఆ నాజీలపై ఆధారపడిన యితరులూ పెట్టిన బాధలనీ అవమానాలనీ ఈ యూదులేమీ తక్కువ అనుభవించలేదు. "ఘెట్టో"నుండి వచ్చిన యూదుల గ్రూపులో వయొలినిస్టు ఒకడున్నాడు. అతడు యుద్ధానికి ముందు పట్టణంలోని రెస్టారెంటు

జాజ్ బ్యాండు మేళంలో ఫిడేలు వాయిస్తుండేవాడు. ఇప్పటికీ కూడా అతనిని పట్టణవాసుల్లో చాలా మంది ఎరుగుదురు.

ఒక రోజున (దురాపావ్ చెప్పినదాని ప్రకారంగా 1942 ఏప్రిల్ నెలలో) ఆ వయొలినిస్టు పనికి ఆలస్యంగా వచ్చాడు. అతడు ఉద్రిక్తుడై తన స్నేహితుల్తో తనకేం జరిగిందీ చెప్పాడు.

అతడు ఆస్పత్రికి వస్తున్నాడు. దార్లో హిట్లరుసైనికుల మోటారుకారు చటిక్కున అతనిని దాటివేసింది. అందులో ఒక ఆఫీసరు వున్నాడు. ఆ కారు సరిగ్గా అతనికి ఎదురుగా బ్రేకుపడి ఆగింది. కార్లో వున్న ఆఫీసరు ఆ వయొలినిస్టుని దగ్గరకి రమ్మనమని పిలిచాడు.

"లోపలికి ఎక్కు!" అని అతడు కారు తలుపు తెరుస్తూ ఆజ్ఞాపించాడు.

వయొలినిస్టు లోపలికి ఎక్కాడు. కారు దుర్గంలోకి వెళ్లింది. వారు కారును మధ్య దీవికి పోనిచ్చారు. ఆ వయొలినిస్టు దురాపావ్‌కు చెప్పిన దాని ప్రకారంగా ఆలోచించిచూస్తే వారు 333 వ రెజిమెంటు స్థావరాల సమీపాన ఆగారు.

అక్కడి శిధిలాలలో ఒక లోతైన సొరంగంలాంటిది తీసి వుంది. ఆ గోతి చుట్టూ జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్ల జట్టు ఆయుధాలని సిద్ధంగా వుంచుకొని నిలబడి వుంది.

"నువ్వు లోపలికి వెళ్లాలి," అని ఆ ఆఫీసరు వయొలినిస్టుని ఆజ్ఞాపించాడు: "ఆ నేలమాళిగల్లో ఒక రష్యను యింకా దాక్కొనే వున్నాడు. అతడు లొంగి పోవడంలేదు. కాల్పులు సాగిస్తున్నాడు. అతనిని బయటికి వచ్చి లొంగిపొమ్మనమని ఒత్తిడిచెయ్యి. అతనిని చంపమని వాగ్దానం చేస్తున్నాం. ఈ పనిలో విజయాన్ని సాధించలేకపోయినట్లైతే

నువ్వు వెనక్కి తిరిగి రానక్కర్లేదు. నిన్ను నేను పిస్తోలుతో కాల్చివేస్తాను.''

వయొలినిస్టు అతి కష్టంతో ఆ గోతిలోకి దిగాడు. అతడు భూగర్భం లోని ఒక బాటలోకి వచ్చాడు. అనామకుడైన ఆ సోవియట్ సైనికుడు తనని కాల్చిచంపకుండా వుండేందుకని ఆ వయొలినిస్టు తానెవరో, ఎందుకు వస్తున్నదీ పెద్దగా తెలుపుతూ చేతులతో తడుముకుంటూ నడిచాడు.

అకస్మాత్తుగా తూపాకీ పేలింది. భయకంపితుడైన వయొలినిస్టు చిత్తడిగా వున్న బాటమీద బోర్లపడి పడుకున్నాడు. అదృష్టవశాత్తూ గుండు దెబ్బ తప్పిపోయింది. తర్వాత అతడు వినిపించీ వినిపించని కంఠధ్వనిని విన్నాడు.

''ఇక్కడికి రా. భయపడబోకు,'' అని కంఠధ్వని అంటోంది. ''నేను గాలిలోకి పేల్చాను. అది నా ఆఖరి తూటా. నేను వెలుపలికి రాబోతున్నాను. నా ఆహారపదార్థాలు ఏనాడో ఆఖరైపోయాయి. దగ్గరకొచ్చి చేయి అందిచ్చు.''

వయొలినిస్టు నెమ్మదిగా లేచి ముందుకు నడిచాడు. త్వరలోనే గోడకి ఆనుకొని కూర్చున్న ఒక మనిషిని చూశాడు. ఆ మనిషి తన చేతులతో వయొలినిస్టుని చుట్టేసి కాళ్లమీద లేచాడు. వాళ్లిద్దరూ సొరంగం ద్వారం వద్దకి వచ్చారు. ఆ మనిషి వయొలినిస్టు భుజాలమీద బరువుగా ఆనుకొని వున్నాడు.

వాళ్లిద్దరూ ఆ గోతిలోనుంచి కష్టంతో పాకుకుంటూ వెలుపలికి వచ్చారు. ఆ అనామకుడైన సైనికుడు తన కళ్లని మూసుకున్నాడు. పూర్తిగా అలసిపోయి రాళ్లమీద పడిపోయాడు. అర్ధచంద్రాకారంలో ఫాసిస్టులు అతని చుట్టూ నిలబడ్డారు. మౌనంగా, ఆశ్చర్యంతో అతని వైపు చూస్తున్నారు. నమ్మశక్యంకానంత సన్నంగా శల్యావశిష్టుడై వున్నాడా వ్యక్తి.

బాగా ఎదిగిన గడ్డం అతని ముఖాన్ని కప్పివేసింది. అతని వయస్సు కనుక్కోవడం అసంభవమై పోయింది. అతని సైనిక దుస్తులు చింకి గుడ్డలై పోవడం వల్ల అతడు ఆఫీసరైందీ కానిదీ తెలుసుకోవడం అసాధ్యమై పోయింది.

తన బలహీనతను యితరులకు చూపడం యిష్టం లేనటువంటి ఆ అనామకుడైన వ్యక్తి లేచి నిలబడాలని ప్రయత్నించాడు. కాని లాభం లేక పోయింది. ఆఫీసరు ఆజ్ఞప్రకారం ఒక సైనికుడు ఆ వ్యక్తిముందు ఒక మాంసండబ్బానూ, బిస్కత్తులనీ వుంచాడు. కాని అతడు మాత్రం వాటిని ముట్టుకొనే ప్రయత్నమైనా చేయలేదు. అప్పుడు ఆఫీసరు ఆ నేలమాళిగలో యింకా ఎవరైనా రష్యన్లు వున్నారా అని అడిగాడు.

"లేరు", అని అనామకుడైన వ్యక్తి సమాధానం చెప్పాడు. "నేనొక్కడ్నే. రష్యాలో మీరు ఎంతటి అసహాయక స్థితిలో వున్నారో చూడ్డానికని వెలుపలికి వచ్చాను. నా ఆఖరి తూటాని గాలిలోకి ప్రేల్చాను. అయినా నన్ను కాల్చేందుకు మీకు ధైర్యం చాలడం లేదు."

వయొలినిస్టుని దుర్గంనుండి వెలుపలికి తీసుకుపొమ్మనమని ఆఫీసరు ఒక సైనికుని ఆజ్ఞాపించాడు. తర్వాత ఆ ఖైదీకి ఏంజరిగిందో ఎవరికీ తెలియకుండా వుండిపోయింది.

పది నెలల పాటుగా బ్రెస్టు దుర్గపు నేలమాళిగల్లో కాలం గడిపినటువంటి ఆ ఆఖరి వీరుడు ఎవరు? అతడు ఎలా జీవించి ఉండగలిగాడు? ఏవిధంగా పోరాడగలిగాడు? తర్వాత అతనికి ఏంజరిగింది? బహుశ ఆ విషయం నిరంతరం రహస్యంగానే ఉండిపోతుందేమో? ఇప్పుడిప్పుడే మనకు తన ఆవేశపూరితమైన రహస్యాలను బయటపెడుతూన్న అద్భుతమైన బ్రెస్ట్ దుర్గపు రక్షణ గాథవలె ఈ రహస్యం కూడా దివ్యమైన హృదయ విదారకమైన వీరచిహ్నంతో చిరాంకితమై ముద్రితమై శోభిలుతూంది.

# ప్రజల సంస్మరణ

ప్రజల స్మృతే చరిత్ర. ఆ స్మృతిని నిల్పుకోవాలంటే, ఆ సంగతిని తెలుసుకోవాలి యుద్ధం ఆరంభమైన మొదటి మాసాలలో బ్రెస్ట్ దుర్గంలో ఏంజరిగిందీ చాలా కాలంవరకు కూడా ప్రజలకు తెలియకుండా వుండి పోయింది, లేదా సగం నమ్మిన పురాణగాథవలె ఆనోట ఆనోట చెప్పుకునే జనశ్రుతి కథగా నిల్చిపోయింది.

1941 వేసవిలో సోవియట్ సైన్యం మొత్తం యుద్ధశ్రేణి అంతటా మాస్కో వైపుకు వెనక్కి నొక్కివేయబడిన సమయంలో జర్మన్ శ్రేణి వెనుకభాగాన ఎంతో దూరాన్న వున్న బ్రెస్టుకు సమీపంగా సరిహద్దుపైన శత్రు డివిజన్ల వలయంలో చిక్కుకున్న కొన్ని సోవియట్ దళాలు తమ సోవియట్ భూమి మొదటి గజాల మేరలలో చాలా రోజులవరకూ కూడా పట్టుదలతో వీరోచితమైన యుద్ధాన్ని కొనసాగిస్తున్నాయని అప్పుడప్పుడు అస్పష్టమైన పుకార్లు వినవచ్చేవి. శత్రు వలయాన్ని ఛేదించుకుంటూ ప్రథమ యుద్ధశ్రేణిని దాటి వచ్చిన గ్రూపులే యీ పుకార్లని తీసుకు వచ్చేవి. శత్రువుల వెనుకభాగంలో బాంబులు వేయడానికై బ్రెస్ట్ మీదుగా ఎగిరినటువంటి సోవియట్ బాంబరు వైమానికులు పై పుకార్లను ధ్రువపరచారు. పట్టణానికి కొద్ది దూరంలో ఆరనిమంటల వెలుతురునీ బాంబుల ప్రేలుళ్ల వెలుగునూ, చీకటిని చీల్చుకుంటూ వెళ్తూన్న ట్రేసర్ తూటాలయొక్క తళతళా మెరిసిపోయే రేఖలనీ ఆ వైమానికులు చూశారు.

కాని ఆ బూగ్‌నదిపైన ఏ పటాలాలు యుద్ధం చేస్తున్నాయి? అక్కడ ఎన్ని పటాలాలు ఉన్నాయి? తమ అసమానమైన పోరాటంలో వారు

ఏవిధంగా యుద్ధం చేస్తున్నారు? ఇదంతా కూడా ఎవరికీ తెలియకుండానే ఉండిపోయింది. అందుకు కారణం దుర్గంతో రేడియో సంబంధం లేక పోవడమే. యుద్ధం ఆరంభమైన మొదటి నెలలలో ప్రళయంలా ముంచు కొచ్చిన ఘోర సన్నివేశాలకారణంగా బ్రెస్ట్ దుర్గంయొక్క వీరోచిత రక్షణకు చెందిన వదంతుల గురించి ఎవ్వరూ అంతంగా పట్టించుకోలేదు. ఏనాడో గడచిపోయిన పురాణగాథలక్రింద అవి మారిపోయాయి. తజా యుద్ధాలూ కొత్త పరీక్షలూ ప్రజల మనస్సులలో వున్న ఆ గాథని తరిమివేశాయి.

తొమ్మిది నెలలు గడచిపోయాయి. ఒర్యోల్ ప్రాంతపు యుద్ధ రంగంలోని ఒక విభాగంపైన సోవియట్ ఆఫీసర్లు అంతకుముందే చుట్టేసి పట్టుకొన్నటువంటి 45 వ జర్మన్ కాల్బలపు డివిజన్ సిబ్బంది కాగితాలని పరీక్షిస్తున్నప్పుడు వారికి "బ్రెస్ట్-లితోవ్స్క ముట్టడికి చెందిన సమర నివేదిక" దొరికింది. 1941 జూన్ ఆఖరి రోజుల్లో రోజువారిగా జరిగిన యుద్ధవివరాలు ఆ నివేదికలో వున్నాయి. సోవియట్ గారిజన్ తమ దుర్గాన్ని తొమ్మిది రోజులవరకూ నిలబెట్టుకున్నట్లూ, వారి ప్రతిఘటనని చివరికి జులై 1 వ తేదీకల్లా సంపూర్ణంగా అణచివేసినట్లూ ఆ నివేదికనుబట్టి తెలుస్తుంది. పొడి మాటలతో వున్న ఆ అధికారపూర్వకమైన పత్రాన్ని చదు వుతున్నప్పుడు శత్రువులు సోవియట్ గడ్డపై అడుగుపెట్టిన కొద్ది గజాల మేరలోనే, పశ్చిమ యూరప్‌లోని విజయోపేతమైన యుద్ధాలలో తమ కిదివరకెన్నడూ తటస్థపడనటువంటి సోవియట్ సైన్యాల వీరోచితమైన ధైర్యసాహసాలనీ, పట్టుదలనీ చవిచూసి గౌరవపూర్వకమైన ఆశ్చర్యాన్ని పొందినట్లు సులభంగా అర్థంచేసుకోవచ్చు. ఆ నివేదికలోని ఆఖరి పేరాలో ఒక ప్రధానమైన ఒప్పుకోలు వుంది: "గారిజన్‌వారు ధైర్యసాహసాలతో సంరక్షించుకుంటోన్న దుర్గంపైకి విపరీతమైన శక్తితో దాడులను

చేయడంవల్ల ఎంతో రక్తాన్ని ధారపోయవలసి వచ్చింది. ఈ సుస్పష్టమైన సత్యం బ్రెస్ట్-లితోవ్స్క్‌ను పట్టుకున్నప్పుడు మరొక పర్యాయం రుజువయింది... బ్రెస్ట్-లితోవ్స్క్‌లోని రష్యన్లు అసాధారణమైన పట్టుదలతోనూ, కృతనిశ్చయంతోనూ పోరాడారు, ఘనమైన ఇన్‌ఫెంట్రీ శిక్షణనీ, అద్భుతమైన ప్రతిఘటనా సంకల్పాన్నీ వారు ప్రదర్శించారు."

"బ్రెస్ట్-లితోవ్స్క్ ముట్టడికి చెందిన సమరనివేదిక"ను రష్యన్‌లోకి అనువదించారు. 1942 జూన్ 21 వ తేదీన "ఎర్ర నక్షత్రం" వార్తాపత్రిక "బ్రెస్ట్‌లో ఒక ఏడాదిక్రితం" అన్న శీర్షికతో ఆ పట్టుబడిన జర్మన్ పత్రంలోని కొన్ని అంశాలను ముద్రించింది.

ఆవిధంగా జర్మన్లే స్వయంగా వీరోచితమైన బ్రెస్ట్ దుర్గరక్షణకు చెందిన ప్రథమ వివరాలను సోవియట్ ప్రజలకు తెలియజేశారు. అస్పష్టంగా వున్న పురాణగాథ వాస్తవగాథగా పరిణమించింది. ఆ గాథ యింకా పూర్తిగా స్పష్టమవకపోయినా అప్పటికే అది సోవియట్ దేశానికి ప్రియమైనదిగానూ, జాతి హృదయాన్ని ఉత్తేజపరచేట్టుగానూ తయారైంది.

మరో రెండు సంవత్సరాలు గడచి పోయాయి. 1944 జులై 28 వ తేదీన బైలొరష్యాలోని కొన్ని సోవియట్ యుద్ధరంగాలు శత్రువులపైకి మహత్తరమైన దాడులను సాగించడం ప్రారంభించినప్పుడు సోవియట్ సైనికదళాలు బ్రెస్ట్ దుర్గాన్ని శత్రువులనుండి విడుదలచేసి, ఆ దుర్గాన్ని ప్రవేశించాయి.

దుర్గం అంతా కూడా వాస్తవానికి నేలమట్టమైపోయివుంది. ఆ దుర్గ శిథిలాలని చూసీ చూడ్డంతోటే అక్కడ ఎంతటి తీవ్రమైన, భయంకరమైన యుద్ధం జరిగిందీ తెలుస్తుంది. పతనమైపోయిన దుర్గరక్షకుల




గారిజన్ క్లబ్బు గోడపైన శాసనం

అవిచ్ఛిన్నమైన ఉత్సాహం యింకా ఆ శిథిలాలలో సజీవంగా ఉందా అన్నట్టు ఆ దుర్గ శిథిలాలు రాజీలేనితో నిండిన కఠినత్వాన్ని ప్రదర్శిస్తున్నాయి. భయంకరంగా అగపడుతోన్న రాతికుప్పలు సగం గడ్డితోనూ పొదలతోనూ పెరిగివున్నాయి. ఈ రాతికుప్పలు తుపాకీ గుండ్లవల్లనూ బాంబుల తునకల వల్లనూ లోతైన గోతులు పడిపోయి మచ్చలుమచ్చలను కలిగి వున్నాయేమో, అవి గతయుద్ధాల మంటలనీ నెత్తుర్నీ జీర్ణించుకొని వున్నట్లనిపిస్తున్నాయి. ఇప్పుడు ఈ శిథిలాలలో తిరిగేవారు యీ శిలలు ఎటువంటి దృశ్యాలని చూశాయో, ఏదైనా అద్భుతం సంభవించి ఆ రాళ్లకేగనక నోరువిప్పి మాట్లాడే

శక్తి వచ్చినట్లైతే అవి ఏమేం చూసిందీ ఎంత వరకు చెప్పగలుగుతాయో ఊహించుకోవడం సహజం.

ఆ అద్భుతం సంభవించింది. అకస్మాతుగా ఆ శిలలు మాట్లాడటం మొదలుపెట్టాయి. ఇంకా నిలిచి వున్న గోడల భాగాలపైనా, తలుపుల చట్రాలపైనా కిటికీల చట్రాలపైనా, నేలమాళిగల సరంబీలపైనా, వంతెనల దన్నుగోడలపైనా గారిజన్ సభ్యులు చెక్కిన వ్రాతలని ప్రజలు కనిపెట్టడం మొదలుపెట్టారు. ఈ శిలాశాసనాలలో కొంతమంది సంతకం చేసినవి వున్నాయి. సంతకాలు లేనివి కొన్ని వున్నాయి. పెన్సిల్‌లో గబగబా వ్రాసినవి కొన్ని వున్నాయి. కొన్ని కేవలం తుపాకీ కొనకున్న సన్నీతోనో లేదా తూటాలతోనూ గీచినటువంటివి వున్నాయి. మరణించేవరకు కూడా పోరాడాలనే దుర్గరక్షకుల నిర్ణయమూ, వారు దేశానికీ స్నేహితులకీ పంపిన అంతిమ శుభాకాంక్షలూ, ప్రజలయెడలా కమ్యూనిస్టు పార్టీయెడలా వారికున్న భక్తీ యీ శాసనాలలో వ్యక్తమౌతూంది. 1941 వీరుల సజీవ కంఠ ధ్వనులే ఆ శాసనాలలో మాట్లాడుతున్నాయా అని అనిపిస్తుంది. తమ కర్తవ్యాన్ని నిర్వర్తించామనీ సగర్వంగా జీవితానికి వీడుకోలు చెబుతూన్న దుఃఖాన్నీ, మృత్యు సందర్శనమప్పుడు ప్రశాంతమైన ధైర్యాన్నీ, ప్రతీకారాన్ని తీసుకోవాలనే పిలుపునూ పలికిన యీ కంఠధ్వనులను, 1944 నాటి సైనికులు ఎంతో బాధపడుతూ, ప్రగాఢహృదయవేదనతో విన్నారు.

"మేం అయిదుగురం: సెదోవ్, ఐ. గ్రూతౌవ్, బొగొల్యూబ్, మిహాయ్‌లొవ్, వి. సెలివానొవ్. మేం మొదటి దాడిని 22.6.1941 న ఎదుర్కొన్నాం. మేం మరణిస్తామే గాని వెన్నుచూపం!" అని తెరేస్పోల్‌స్కి గేటు సమీపంలో వున్న వెలుపలి గోడ యిటుకలపైన చెక్కి వుంది.

“1941 జూన్ 26 వ తేది. మేం ముగ్గురం. చాలా కష్ట సమయంలో వున్నాం. అయినా మేం ధైర్యాన్ని కోల్పోలేదు. మేం వీరులవలె మరణిస్తాం!” అని బారకాసుల పశ్చిమ విభాగపు గదులలోని ఒక గది గోడ పైన గీచి వుంది.

క్రైస్తవగుడి క్లబ్బుగా మారిన రోజుల్లో సినిమా ఆపరేటరుయొక్క ప్రొజెక్టరు ఆ పూర్వపు గుడియొక్క ప్రార్థనబృందపు గ్యాలరీలో వుండేది. అక్కడ ఒక శాసనం దొరికింది. దానిని ఆతర్వాత అక్కడి గోడనుండి తీసేసి యిప్పుడు మ్యూజియంలో వుంచారు: “మేం ముగ్గురం. మాస్కోవాళ్లం. మా పేర్లు ఇవనోవ్, స్తెపాన్‌చికొవ్, జున్‌త్యాయెవ్. ఈ గుడిని పరిరక్షించాం. దీనిని శత్రువులకు ఎన్నటికీ ఒప్పగించమని మేం ప్రతినబూనాం. జులై 1941.” ఈ శాసనం కిందనే మరో శాసనం వుంది: “నేనొక్కడ్నే మిగిలాను. జున్‌త్యాయెవ్, స్తెపాన్‌చికొవ్‌లు మరణించారు. జర్మన్లు గుళ్లో వున్నారు. ఒక్క చేతిబాంబు మాత్రమే మిగిలింది. అయినా లొంగేది లేదు. కామ్రేడ్స్, ప్రతీకారాన్ని తీసుకోండి! 1941.”

ఈ విధంగా తెలిపింది యీ శిలలే కాదు. వేరేవారు వున్నారు. 1941 జూన్–జులై సన్నివేశాలలో పాల్గొన్నవారూ, లేదా ఆ సన్నివేశాలను స్వయంగా కళ్లారాచూసినవారూ బ్రెస్ట్‌లోనూ దాని చుట్టూ వున్న గ్రామ సీమలోనూ వున్నారు. ముట్టడి సమయంలో తమ భర్తలతోనూ, తండ్రుల తోనూ దుర్గంలో వుండి ఆతర్వాత జర్మన్ జైలుల క్యాంపులలోని పైశాచికత్వాన్ని సహించినవారు పైవారిలో చేరే వున్నారు. వీరంతా కూడా దుర్గరక్షకులలోని చాలామంది పేర్లను యివ్వగలిగారు. దుర్గం కొరకై చేసిన యుద్ధానికి సంబంధించిన వివిధ వివరాలనీ, కథలనీ వారు జ్ఞాపకం చేసుకునేవారు.

అప్పుడే ఒక వింతైన, పరస్పర విరుద్ధమైన అభిప్రాయం గమనింపబడింది. 45 వ కాల్బలపు డివిజన్ హెడ్‌క్వార్టర్స్ వద్ద 1942 లో పట్టుబడ్డ జర్మన్ స్టాఫ్ పత్రంలో బ్రెస్ట్ దుర్గాన్ని 1941 జూన్ 30 వ తేదీన పట్టుకున్నట్టు వుంది. అయినా ఆ దుర్గంలోనే వున్న ప్రజలూ, దూరంనుండి అక్కడి యుద్ధాన్ని చూసిన యితరులూ, వీళ్లందరూ కూడా యుద్ధం ఇంకా కొనసాగిందనీ, జులై ఆఖరి రోజుల్లో మాత్రమే అంతమయిందనీ, లేక ఆగస్టు మొదటి రోజుల్లో అంతమయిందనీ ఖచ్చితంగా చెప్పారు. జులై 14–15 తేదీలలో కొంతమంది స్త్రీలని ఖైదీలుగా తీసుకువెళ్లారు. వారు జర్మన్ కాపలా సైనికులకింద ఖైదీలుగా నడచివెళ్లినప్పుడు, దుర్గంలో అనేకచోట్ల యిది వరకటివలె యుద్ధం చాలాతీవ్రంగా కొనసాగుతున్నట్టు చూశారు. ఆ సంగతి వారికి బాగా జ్ఞాపకం వుంది. జర్మన్ ఫిరంగుల గర్జన, మెషీన్‌గన్ కాల్పుల చప్పుడూ జులై ఆఖరి రోజుల్లో కూడా వినవచ్చినట్టూ, క్షతగాత్రులైన సైనికులనీ ఆఫీసర్లనీ పట్టణంలో వున్న జర్మన్ మిలిటరీ ఆస్పత్రికి అప్పటికింకా తీసుకువస్తున్నట్టూ బ్రెస్ట్ పట్టణవాసులు ధ్రువపరచారు. క్లుప్తంగా చెప్పాలంటే కళ్లారా చూసినవారి నివేదికలు ఒక విషయాన్ని స్పష్టం చేస్తాయి. అదేమిటంటే 45 వ డివిజన్ నివేదికలో తెలిపినట్టు రష్యన్ సైనికులు తమ దుర్గాన్ని ఒక వారం రోజులవరకే శత్రుపరం కాకుండా చేశారనేది నిజం కాదనీ, వారు ఒక నెలరోజులవరకూ కూడా ఆ దుర్గాన్ని శత్రువులకు లొంగకుండా చేశారనేది నిజమనీ కళ్లారాచూసినవారి నివేదికలు స్పష్టం చేస్తాయి.

ఏమైతేనేం యిందుకు సరియైన, నిర్దిష్టమైన సాక్ష్యం మాత్రం దొరకలేదు. దుర్గరక్షకులు దుర్గకుడ్యాలపైన వ్రాసిన శాసనాలలోని తేదీలు స్పష్టంగా లేవు. ''జూన్'' లేదా 1941 ''జులై'' అని మాత్రమే వున్నాయి.

బారకాసుల గోడపైన శాసనం

కొన్ని శాసనాలలో తేదీలు అసలే లేవు. బారకాసుల నైరుతి విభాగపు గదులలో ఒక లోపలి గదిలోని గోడపైన తేటతెల్లంగా వున్న కొన్ని మాటలు వున్నట్లు ఒక మాస్కో మ్యూజియం కార్యకర్త 1952 లో మాత్రమే కనిపెట్టగలిగాడు. ఒక అనామక సైనికుడు గోడ గిలాబాపైన వంకరటింకరగా ఆరు రష్యన్ మాటలని వ్రాశాడు. సంతకం లేదు:

"నేను చనిపోతున్నాను. కాని లొంగను. మాతృదేశానికి సెలవు!"

ఆ మాటలకింద "20/VII–41" అని తేదీ వుంది.

ఈ మాటలనీ యీ తేదీనిగల గోడ గిలాబానీ జాగ్రత్తగా తీసి మాస్కోకు తీసుకు వెళ్లడమూ, దరిమిలా దానిని సోవియట్ సైన్యం మ్యూజియం హాలులలో ఒక దానియందు ప్రదర్శించడమూ జరిగింది. బ్రెస్టు దుర్గం పతనం జరిగింది 1941 జూన్ 30 వ తేదీ అని తెలిపిన జర్మన్ పత్రం నివేదిక తప్పు అని యిప్పుడు నిర్వివాదాంశమైన నిదర్శనం వుంది.



లెఫ్టినెంట్ అలెక్సేయ్ నగానొవ్

దుర్గరక్షణ వివరాలు ఎక్కువ కెక్కువగా క్రమక్రమంగా వెలుగు లోకి వచ్చాయి. యుద్ధానంతరం దుర్గంయొక్క భవనాలలో కొన్నిటిని పునర్నిర్మించడం జరిగింది. భవన నిర్మాణం కోసమని కూలిపోయిన రాళ్ల నుండి యిటుకలని వేరుచేయడం జరిగింది. భవన నిర్మాణ కాలంలో ఆ శిధిలాలలో దుర్గరక్షకుల అస్థిగలు, వారి దుస్తులూ ఆయుధాలు దొరికాయి. బ్రెస్ట్‌పట్టణవాసులు ఆ వీరులను సైనిక గౌరవాలతో పట్ట ణంలోని శ్మశానంలో భూస్థాపితం చేశారు. వారి ఆయుధాలనీ, శిధిలాలలో దొరికిన యితర వస్తువులనీ వివిధ పట్టణాలలో వున్న మ్యూజియ ములల్లో ఉంచారు.

1949 లో తెరేస్పొల్‌స్కి గేటు శిధిలాలని శుభ్రం చేసినప్పుడు, 333 వ రెజిమెంటుకు చెందిన దుర్గరక్షణ ప్రథమ దివసాలలో నేలకొరిగిన లెఫ్టినెంట్ అలెక్సేయ్ నగానొవ్‌యొక్క శరీరవశేషాలు కనబడ్డాయి. అతని జేబులో వున్న యువకమ్యూనిస్టు లీగ్ సభ్యత్వపు కార్డువల్లనే అతనిని గుర్తించడం జరిగింది. ఆ మరణించిన లెఫ్టినెంటు శరీరం పక్కనే ఎక్కుపెట్టి వుంచిన అతని పిస్తోలు ఉంది.

అదే విధంగా, దుర్గరక్షణ కొరకై వీరోచితపోరాటాన్ని నడిపినటు

వంటి వారి పేర్లను స్థాపించడానికి సహాయపడిన "ఆర్డర్ నెం. 1" యొక్క తునకలూ, ఒక జెండా, గారిజన్‌యొక్క యితర సభ్యులకు చెందిన ఉత్తరాలూ, కాగితాలూ లభ్యమయ్యాయి. రాళ్ల గుట్టలకింద సోవియట్ సైనికులయొక్క పగిలిపోయి తప్పుపట్టిన రైఫిళ్లూ, పిస్తోళ్లూ, సబ్ మెషీన్‌గన్‌లూ దొరికాయి. పిస్తోళ్ల మేగజైన్‌లో తూటాలు వున్న సందర్భాలలో ఆ ఆయుధాలను ధరించినవాళ్లు వాటిని కాల్చడానికి సిద్ధంగా వుంచినట్టూ, వారు యుద్ధంచేస్తూ చేస్తూ మరణించినట్టూ తేటతెల్లమయింది.

చివరికి యుద్ధం చేసిన వారి ఆయుధాలే కాకుండా, ఆ మనుషులు కూడా అగుపించారు. కొంతమంది దుర్గరక్షకులు యింకా బ్రతికివున్నట్టు తేలింది. వాళ్ల సంఖ్య చాలా తక్కువే: కొంతమంది జర్మన్ కాన్‌సెంట్రేషన్ క్యాంపులలోని సమస్త ఘోరాలనీ అనుభవించారు. ఇతరులు ఎలాగో ఒక లాగున తప్పించుకొని పారిపోయి మొదట పార్టిజాన్ సేనాభాగాలలో చేరి యుద్ధం చేశారు. ఆతర్వాత తిరిగి సైన్యంలో చేరారు.

## వారు మనమధ్యనే జీవించివున్నారు

క్రస్నాదార్ పొలిమేరల్లో, త్వరితగతిని పెరిగిపోతున్న యీ పట్టణం కొత్త వీధుల్లో ఒక దాని యందు పించను పుచ్చుకున్న ఆఫీసర్లు నిర్మించు కున్న యిళ్లవరుసలో అతిజాగ్రత్తగా పెంచినటువంటి దట్టమైన ద్రాక్ష చెట్లతో చుట్టుకొని వున్న ఒక చిన్న తెల్లని కుటీరం వుంది. వేడిగా వున్న వేసవి రోజుల్లో, వసంత ఋతువులోని ప్రాతఃకాలాన, శరత్తు చీకటిలో ఒక

వయసుమళ్లిన మనిషి సైనికుల చొక్కాన్నూ, పెద్ద బూట్సులనూ తొడుక్కొని ద్రాక్షతీగెలని కట్టుతూ, పనికిరాని కొమ్మల్ని నరికివేస్తూ ఆ పచ్చని ఆకుల మధ్య గంటల కొద్దీ కాలం గడిపివేస్తున్నాడు. వెడల్పాటి ముఖం. ఎత్తైన బుగ్గ ఎముకలు. అతని నల్లని కళ్లల్లో పట్టుదలతో నిండిన నిశ్చితమైన చూపు.

ఇతడే మేజర్ ప్యోత్ గవ్రీలొవ్ ఇప్పుడితను పింఛను పుచ్చుకొని యింటివద్దనే వుంటున్నాడు. ఇతడు బ్రెస్ట్ దుర్గం వీరులలో ఒకడు. తూర్పు కోటయొక్క కమాండరు. యుద్ధం ముప్పైరెండవ రోజున కోట గదులలో ఒక దానియందు జర్మన్లచే పట్టుబడిన యితడు తన శత్రువులతో అసమానమైన పోరాటాన్ని సాగించాడు. తాను చావుబ్రతుకులలో ఉన్నప్పటికీ కూడా తన ధైర్య సాహసాలతోనూ, సమరోత్సాహంతోనూ శత్రువులు చకితులయ్యేట్టు చేసివేశాడు.

అతడు హిట్లర్ కాన్‌సెంట్రేషన్ క్యాంపులలో నాలుగు సంవత్సరాలు కఠినమైన బాధలుపడి గడిపాడు. 1922 నుండీ అతడు కమ్యూనిస్టు. అంతర్యుద్ధంలో పాల్గొన్నాడు. అతడు ఖైదులో వున్నప్పుడు ఒక బోల్షెవిక్కుకూ ఒక సోవియట్ ఆఫీసరుకూ లాయఖైన తీవితో, అష్టకష్టాలలో కూడా సోషలిస్టు మాతృభూమియొక్క పౌరుని గౌరవాన్ని నిలబెట్టుకుంటూ మెలిగాడు.

విముక్తి సిద్ధించిన తర్వాత అతడు తన దేశానికి తిరిగి వచ్చాడు. మళ్లీ మేజర్ హోదాను స్వీకరించాడు. త్వరలోనే సైబీరియాలోని జపాను ఖైదీల సోవియట్ క్యాంపుకు కమాండెంట్‌గా నియమింపబడ్డాడు. నాజీ కాన్‌సెంట్రేషన్ క్యాంపులోని ఘోరాలు అతని మెదడులో యింకా తాజాగా మెదులుతూ వుండడంచేత గవ్రీలొవ్ తన క్యాంపులో ఖైదీలకు సరియైన

పరిస్థితులను కల్పిస్తూ దానినొక ఆదర్శవంతమైన క్యాంపుగా తయారు చేశాడు. టైఫస్ అంటువ్యాధి జపానీయులలో వ్యాపించకుండా వుండేట్టు చేశాడు. తమ మనుషులకు భోజన పదార్థాలు పంచిపెట్టేటప్పుడు జపాను ఆఫీసర్లు ఏవిధమైన అక్రమాలు జరపకుండా చూశాడు. తాను చూపిన నిష్కళంకమైన మానవప్రేమకు, తాను గావించిన నిష్కళంకమైన సోవియట్ కృషికీ గ్రవీలొవ్ తన కమాండింగ్ ఆఫీసర్లనుండి ఆ సంవత్సరాలలో అనేక కృతజ్ఞతా సందేశాలను అందుకున్నాడు.

ఆ తర్వాత అతడు ఉద్యోగం నుండి విరమించుకున్నాడు. అతనికి పింఛను యిచ్చారు. వివిధ సైనిక దళాలు తన కమాండు కింద ఉన్న రోజుల్లో అతడు చాలా కాలం ఎక్కడైతే నివసించాడో ఆ క్రస్నొదార్‌లో నివసించేందుకనే అతడు తన భార్యతో అక్కడికి వెళ్ళిపోయాడు. ఇప్పుడు పి. గ్రవీలొవ్ సోవియట్ యుద్ధ వెటరన్స్ కమిటీలో సభ్యుడు. ప్రజా రంగంలో చురుకుగా పని చేసే వ్యక్తి. క్రస్నొదార్‌లోని సైనిక యూనిట్లలోనూ, ఫ్యాక్టరీలలోనూ బ్రెస్ట్ దుర్గంలో తాను చూసినదాని గురించీ అనుభూతి పొందిన విషయాల గురించీ అనేకసార్లు అతడు మాట్లాడాడు.

వీరోచితమైన దుర్గరక్షణలో పాల్గొన్న యితరులు కూడా క్రస్నొదార్‌లోనే నివసిస్తున్నారు. గ్రవీలొవ్‌యొక్క యుద్ధకాలపు స్నేహితులు తరచూ అతని యింటికి వెళ్ళి కలుస్తూంటారు. ఇంట్లో సొంతంగా తయారు చేసిన ద్రాక్షాసవాన్ని అతనితో కలసి రుచిచూస్తూంటారు. సార్జెంట్ అనతోలియ్ కోర్జ్ యిప్పుడు ఇంజనీరు. ప్రస్తుతం టర్నర్‌గా ఉంటోన్న అనతోలియ్ బెస్సొనొవ్, సెకండరీ పాఠశాలలో ఉపాధ్యాయుడుగా పని చేస్తోన్న ప్యోత్ర్ తెలెన్‌గా, గెలెన్‌ద్జిక్ సెలవు గృహం సిబ్బందిలో పనిచేస్తోన్న వ్లదీమిర్ పుజకోవ్, వీళ్ళంతా కూడా సైనికులుగా వుంటూండేవారు. వీళ్ళంతా కలసి

గ్రవీలొవ్ యింట్లో కూర్చుని ద్రాక్షాసవం రుచిచూస్తూ ప్రణాలకు తెగించి తామేవిధంగా పోరాడిందీ, యుద్ధంలో మరణించిన తమ స్నేహితులని గురించీ జ్ఞాపకం చేసుకుంటారు. నాజీ కాన్సెంట్రేషన్ క్యాంపులో చిత్రహింసలకు గురియై మరణించిన కాప్టెన్ ఇవాన్ జుబచోవ్‌ను, తమ మాతృభూమి కుబాన్ నుండి వచ్చిన వసీలియ్ బిత్కోను ఇంకా అనేకమందినీ సంస్మరించుకుంటూంటారు. వారు అప్పుడప్పుడు ఆబిన్‌స్కాయ పల్లెలో వున్న వసీలియ్ బిత్కో కుటుంబాన్ని చూడ్డానికి వెళ్తుంటారు. వాళ్ల ప్రాణస్నేహానికి మించింది వేరే ఏం ఉండగలదు! ఆ స్నేహం రష్యన్ దుర్గ కుడ్యాల నడుమ జరిగిన దేశభక్తియుత పోరాటంయొక్క ప్రాణాపాయకరమైన అగ్నితో అతుక్కుపోయింది.

కాకసస్ ఆవలి వైపున, బాగా దక్షిణానికి, సరిగ్గా టర్కిష్ సరిహద్దువద్ద, భీకరంగా వున్న ఆర్మేనియన్ పర్వతాల మధ్య అమూల్యమైన లోహాలని వెతికేందుకని ఆ శిలామయమైన భూభాగం పైకి భూగర్భశాస్త్రానికి చెందిన ఒక పరిశోధక దళం వెళ్లింది. ఆ దళానికి నాయకుడు యాభై సంవత్సరాల వయసుగల ఒక యింజనీరు. పొట్టిగా వుంటాడు. ఉల్లాసంతో నిండిన చురుకైన కళ్ళు. శక్తివంతమైన అంగవిన్యాసాలు.

ఈ ఇంజనీరు పేరు సమ్‌వేల్ మతెవొస్యాన్. దుర్గరక్షణ తొలి రోజుల్లో రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్‌యొక్క సన్నిహితమైన సహాయకులలో ఒకరై, యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శిగా వుండిన మతెవొస్యాన్ యితడే. మధ్యదుర్గంలోకి చొచ్చుకు వచ్చిన జర్మన్ సబ్‌మెషీన్‌గన్నర్ల మొదటి డిటాచ్‌మెంటుపైకి తెగువతో తన యువకమ్యూనిస్టు లీగ్ వారిని బాయొనెట్లతో నడిపించి ఆ శత్రువుల డిటాచ్‌మెంటును నాశనం చేసింది యితడే.

మతెవొస్యాన్ మొదటి రోజున రెండుసార్లు గాయపడ్డాడు. అయినా అతడు తన గాయాలకు తానే కట్టుకట్టుకొని తన మనుషులకి ఆజ్ఞల నొసగడం కొనసాగించాడు. మూడవ రోజున ఉదయాన అతనికి తీవ్రమైన గాయం తగిలింది. దాంతో అతడు యిక ఏమీ చేయలేకపోయాడు. అతనిని శ్వేత భవనం నేలమాళిగలోకి పంపించేశారు. అక్కడ కొన్నాళ్ల తర్వాత అతడు స్పృహలేని స్థితిలో వున్నప్పుడు శత్రువులు అతనిని ఖైదీగా తీసుకు పోయారు.

అతనిని దక్షిణ మిలిటరీ కంటోన్‌మెంటులోని కాన్‌సెంట్రేషన్ క్యాంపుకు పంపించారు. అతని గాయం నయం అయీ అవడంతోటే మతెవొస్యాన్ క్యాంపునుండి తప్పించుకొని పారిపోయే పథకాన్ని వేసుకోవడం మొదలు పెట్టాడు. 1941 శరదృతువులో ఆరుగురు ఆఫీసర్లు, సైనికులూ మతెవొస్యాన్ నాయకత్వం కింద రాత్రిపూట ఇనుప ముళ్లతీగె కింద దారి చేసుకొని చుట్టుపట్ల వున్న అడవులలోకి పారిపోయారు.

పశ్చిమ యుక్రేనియాలోనూ పశ్చిమ బైలొరష్యాలోనూ యుద్ధం చేస్తోన్న పార్టిజాన్ డిటాచ్‌మెంటుతోపాటు మతెవొస్యాన్ యుద్ధం చేశాడు. మళ్లీ తీవ్రంగా గాయపడ్డాడు. జర్మన్లచే నియమింపబడ్డ పోలీసుబలగం నుండి తప్పించుకొని ఫాసిస్టువ్యతిరేకపు రహస్యపు ఉద్యమంయొక్క ఆర్గనైజర్లలో ఒకడుగా లూత్స్క్ పట్టణంలో పని చేశాడు. సోవియట్ పటాలాలు ఆ పట్టణంమీదికి దాడి వెడలినప్పుడు మతెవొస్యానూ అతని స్నేహితులూ ఒక తిరుగుబాటును సంఘటిత పరచి సోవియట్ సైన్యం ఆ పట్టణాన్ని వేగిరంగా పట్టుకొనేందుకై సహాయపడ్డారు.

అతనిని ఆఫీసర్ల శిక్షణ కోర్సుకు పంపారు. ఆతడు గార్డ్స్ లెఫ్టినెంటుగానూ, గార్డ్స్ అస్సాల్ట్ కంపెనీ కమాండర్‌గానూ యుద్ధరంగానికి

తిరిగివెళ్లిపోయాడు. ఈ కంపెనీకి నాయకుడుగా అతడు బెర్లిన్‌పై దాడిచేసి ఆ నగరాన్ని ఆక్రమించడంతో అంతమయిన మహా యుద్ధంలో పాల్గొన్నాడు. రైశ్చటాగ్ గోడలపై పేర్లను వ్రాసిన వాళ్లల్లో ఇతడొకడు. దేశభక్తియుత మహాసంగ్రామంలో ఆఫీసరుగా పాల్గొన్న సమ్వేల్ మతెవొస్యాన్ ఏడు యుద్ధ గాయాలతోనూ, రెండు మిలిటరీ ఆర్డర్లతోనూ పేరు పొందాడు.

బ్రెస్ట్ దుర్గ వీరుల్లోకల్లా చిన్నవాడైనటువంటి బ్యాగ్లర్ పేత్యా క్లీప కూడా జీవించే వున్నాడు. శత్రువలయాన్ని ఛేదించుకొని వెళ్లేందుకు ప్రయత్నంచేసినటువంటి పొతాపొవ్ సమూహంలోని ఇతడు మరో ఏడుగురు వ్యక్తులతో దుర్గంనుండి వెలుపలికి వచ్చేశాడు. కాని ఆ మర్నాడు బూగ్ నది ఆవలి గట్టున జర్మన్లచే పట్టుపడ్డాడు. పోలిష్ భూభాగం లోని క్యాంపులో ఖైదీగా వున్నాడు.

అక్కడ అతను యితర రెజిమెంట్లలోవున్న తనలాంటి యితర కుర్ర సైనికులను కలుసుకున్నాడు. వాళ్లంతా అతనికంటే పెద్ద వాళ్లైనప్పటికీ కూడా అతని అణచరాని చొరవకూ ధైర్యానికీ మెచ్చుకొని త్వరలోనే అతనిని తమ నాయకునిగా అంగీకరించారు. అతడు ఆ క్యాంపునుండి తప్పించుకొని పారిపోయే యత్నం చేశాడు. కొద్ది కాలంలోనే అయిదుగురు కుర్రాళ్లు ఎలాగో ఒకలాగున ఆ క్యాంపునుండి వెలుపలికి జారుకో గలిగారు. వారు బ్రెస్ట్‌కు సమీపంలోని ఒక గ్రామానికి దారిచేసుకుని అక్కడి రైతులతో పనిచేయడం మొదలుపెట్టారు.

కాని పేత్యా కన్న కలలు వేరు. యుద్ధరంగం ముందుశ్రేణిని దాటి మళ్లీ సైన్యంలో చేరుకోనేందుకుగాను, సోవియట్ సైన్యాలవెంట తూర్పువైపుకు వెళ్లాలని పేత్యా తన స్నేహితులతో పదపదే చెప్పి వారిని

ఒప్పించేందుకు ప్రయత్నించాడు. శత్రువులతో మళ్ళీ యుద్ధం చేయాలని అతడు వాంఛించాడు.

చివరికి ఆ కుర్రాళ్లల్లో ఒకడైన వాలోద్య కజ్మీన్ పేత్య సలహాను అంగీకరించాడు. ఆ యిద్దరు స్నేహితులు కలసి బైలొరష్యా అడవుల గుండానూ చిత్తడి నేలల గుండాను తమ ఎదుట వున్న సుదీర్ఘమైన బాటను కాలి నడకని పయనమయ్యారు. జర్మన్‌లచే నియమితమైన గ్రామ పోలీసుచే పట్టుబడేలోగా వారు కొన్ని వందల మైళ్ళు నడిచారు. ఆ కుర్రాళ్ళ నిద్దరినీ జర్మనీలో పని చేసేందుకై పంపేశారు.

పేత్య క్లీప అనేక కష్టాలు పడ్డాడు. అవన్నీ యిప్పుడు అంతమొందాయి. అతడిప్పుడు బ్ర్యాన్స్క్‌లోని "స్ట్రాయ్‌మష్ఖీన" వర్క్సులో సుశిక్షణను పొందిన టర్నరుగా పనిచేస్తున్నాడు. బ్రెస్ట్ దుర సంరక్షుడైన యీ కుర్రవానియొక్క వీరత్వాన్ని లక్షలాది సోవియట్ ప్రజలు ఎరుగుదురు. అందువల్లనే వారు అతనిని "సోవియట్ గవ్రోచి"గా పరిగణిస్తారు.

పేత్య క్లీపతోపాటే యుద్ధరంగం ముందుశ్రేణికి వెళ్లిన వాలోద్య కజ్మీన్ కూడా జీవించే వున్నాడు. అతడిప్పుడు ఇలెక్ట్రికల్ ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. వారి స్నేహితులలో మరొకరు ప్యోత్ర్ కొతేల్నికొవ్ యిప్పుడు ఆఫీసరు. అతడు బాల్టిక్ ప్రాంతంలో పనిచేస్తున్నాడు.

దుర్గరక్షణలో పాల్గొన్న వీరవనిత, రయీస అబకూమొవ మొన్న మొన్నటి వరకు కూడా మరణించిందనే భావించడం జరిగింది. కాని ఆమె ఒర్యోల్ ప్రాంతంలోని ట్యూబర్క్యులోసిస్ ఆస్పత్రిలో పని చేస్తున్నట్టు తెలిసింది. అక్కడికి సమీపంలోనే మ్త్సేన్స్క్ పట్టణంలో, యుద్ధం మొదటి

రోజున జర్మన్ బాంబు రవ్వతో గాయ పడినటువంటి వలెన్‌తీన రయేవ్‌స్కయ ఒక ఆస్పత్రిలో నర్సుగా పనిచేసింది. ఇప్పుడు ఆమె పింఛను పుచ్చుకుంది.



అలెగ్జాండర్ ఫీల్, 1956

పురాణగాథగా పరిణమించిన ఆ దుర్గరక్షణ వీరులలో చాలా మంది సోవియట్ యూనియన్ వివిధ ప్రాంతాలలో జీవించి వున్నారు. శత్రువలయాన్ని ఛేదించుకొని వెళ్లేందుకై మధ్య దీవినుండి వెడలిన డిటాచ్‌మెంటుకు ఒక సీనియర్ లెఫ్టినెంటుగా నాయకత్వం వహించిన అనతోలియ్ వినొగ్రాదొవ్ వోలొగ్దలోని ఒక ఫ్యాక్టరీలో ఫోర్డ్ ఆపరేటరుగా పనిచేశాడు. అతడిప్పుడు పింఛను పుచ్చుకున్నాడు. ఐక్యమైన సైనిక గ్రూపు ఛిఫ్ ఆఫ్ స్టాఫ్ కామ్రేడ్ వసీలియ్ బీత్కో స్నేహితుడైన సర్వీసు కోర్‌యొక్క సీనియర్ లెఫ్టినెంటు అలెగ్జాండర్ సెమేనెన్‌కొ యిప్పుడు యుక్రేనియాలోని నికొలాయెవ్ పట్నంలో డ్రైవరుగా పనిచేస్తున్నాడు. ఫొమీన్, జుబచోవ్‌లతోపాటు యుద్ధం చేసిన, 84 వ రెజిమెంటుకు చెందిన అలెగ్జాండర్ ఫీల్ దూరంలో వున్న యకూతియా బంగారు గనులలోని ఒక అటవీ విభాగానికి పెద్దగా పనిచేస్తున్నాడు. అతని సైనిక స్నేహితుడు, అదే రెజిమెంటులో ఒక సీనియర్ సార్జెంట్‌గా వుండిన అలెగ్జాండర్ రెబ్‌జాయెవ్ వెలికొలూక్‌స్కయ ప్రాంతంలోని పల్లెపాఠశాలకు ప్రధానోపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడు.

తెరేస్పోల్‌స్కి గేటు ప్రాంతంలో పొతాపొవ్, కిజెవాతొవ్‌లతోపాటు తన మనుషులకు ఆజ్ఞలనిచ్చిన 333 వ రెజిమెంటు పూర్వపు లెఫ్టినెంట్ అలెగ్జాండర్ సానిన్ ఇప్పుడు ఓమ్‌స్క్‌లోని ఒక పాఠశాలలో డ్రాయింగు ఉపాధ్యాయుడుగా పనిచేస్తున్నాడు. పేత్య క్లీప స్నేహితుడూ, ఆ తర్వాత బైలొరష్యన్ పార్టిజాన్‌లలో పరాక్రమశాలిగా పేరుగాంచినట్టి ఇవాన్ బుగాకొవ్ సరాతొవ్ ప్రాంతంలోని ఒక పెద్ద ప్రభుత్వ వ్యవసాయక్షేత్రంలో ఎలెక్ట్రీషియన్‌గా పనిచేస్తున్నాడు. అన్‌ద్రేయ్ కిజెవాతొవ్‌తో కలసి పోరాడి, తొమ్మిదవ సరిహద్దు స్థానానికి చెందిన సెర్గేయ్ బొబ్ర్యోనొక్ యిప్పుడు ల్వొవ్ పట్టణంలోని నాటకశాలలో నటుడుగా పనిచేస్తున్నాడు.



అలెగ్జాండర్ రెబ్‌జూయెవ్, 1956

నిరహంకారులూ, నిరాడంబరులూ అయిన సోవియట్ ప్రజలు, ఒకప్పుడు తమ దేశరక్షణకై అగ్రశ్రేణిలో పనిచేసినట్టే, దేశంయొక్క సోషలిస్టు ఆర్థిక రంగపు వివిధరంగాలలో శ్రామిక అగ్రశ్రేణిలో పనిచేస్తున్నారు.

బ్రెస్ట్ దుర్గంయొక్క అమరరక్షణలో పాల్గొన్న ప్రతివ్యక్తీ ఆ వీరోచితమైన రోజులనూ, ఆ విషాదభరితములైన రోజులనూ పవిత్రస్మృతులుగా ఉంచుకుంటాడు. వారి స్మృతులు, దేశభక్తియుత మహాసంగ్రామం

మొదటినెలలలో సోవియట్ వీరులు సాధించిన సమరానికి చెందిన ఒక గొప్ప అద్భుత చర్యయొక్క వివరాలను ఎక్కువకెక్కువగా స్థిరపరచుటకు సహాయపడతాయి.

## వారు యీ గడ్డపై యుద్ధంచేశారు

1954 లో కళకళలాడుతోన్న వేసవి రోజున బ్రెస్ట్ దుర్గం మధ్య ఆవరణలో కొన్ని వందల మంది ప్రజలు సమావేశమయ్యారు. వాళ్లల్లో బ్రెస్ట్ పట్టణవాసులు, బ్రెస్ట్ గారిజన్ సైనికులు, యుద్ధ కాలంలో చిన్న కుర్రవాళ్లగా వుండి యిప్పుడు తమ సర్వీసు మొదటి సంవత్సరాలలో వున్న యువకులూ, తమ చొక్కాలపై మాస్కో, వాల్గొగ్రాడ్, బుడాపెస్ట్, వియన్నా, బెర్లిన్ యుద్ధాలలో పాల్గొన్నందుకు పతకాలనీ ఆర్డర్లనీ ధరించిన అనుభవజ్ఞులైన ఆఫీసర్లూ వున్నారు.

జనమంతా ఒక పెద్ద అర్ధచంద్రాకృతిలో గడ్డిపైన కూర్చున్నారు. వారి వెనుక తూటాల దెబ్బలకి కన్నకన్నాలు పడిపోయి సగంశిధిలావస్థలో వున్న దుర్గపు దేవాలయం వుంది. ఇది ఒకప్పుడు గారిజన్ క్లబ్బు. ముక్కలు ముక్కలైపోయి, పడిపోతూ వున్న గోడలతోనూ, నోరు తెరచుకున్న కిటికీలతోనూ, గడ్డి పొదలూ పెరుగుతోన్న రాళ్లకుప్పపైన శిధిలావస్థలో వున్న గోపురంతోనూ వున్న యీ స్థూలమైన భవన దృశ్యం భయంకరంగా వుంది. ఎడమవైపున వికృతాకారంగా వున్నకుప్పలో శ్వేత భవన శిధిలాలు పడివున్నాయి. కుడివైపున ముహవేత్స్ బూగ్ నదుల సంగమం వద్ద తెరే

స్పాల్‌స్కి గేటు శిథిలాలూ, వలయాకృతి ఎ(్రర యిటుకల బారకాసుల శిథిలాలూ అవుపడతాయి.

బెంచీలనీ, పొడుగుపాటి బల్లనీ అక్కడి గడ్డి మొలుస్తూన్న నేల పైన అమర్చారు. ఆడవాళ్ళూ మగవాళ్ళూ కొందరు అక్కడ కూర్చున్నారు. పదమూడు సంవత్సరాల(క్రితం దుర్గాన్ని రక్షించినవాళ్లే వీరందరూనూ.

శిథిలావస్థలో వున్న ఆ దుర్గానికి తన నివాళులను అర్పించేందుకని పూర్వపు యువకమ్యూనిస్టు లీగ్ కార్యదర్శి, 84 వ రెజిమెంటుయొక్క అసిస్టెంట్ రాజకీయ సహాయకుడు సమ్‌వేల్ మతెవొస్యాన్ చాలా దూరంలో వున్న ఎరెవాన్‌నుండి వచ్చాడు. అతడు యీ శిలలపై మూడు పర్యాయాలు తన రక్తాన్ని ధారవోశాడు. అతని స్నేహితులలో చాలామంది యీ గడ్డపై పూడ్చివేయబడ్డారు.

బైలొరష్యా రాజధాని మిన్‌స్క్‌నుండి దుర్గరక్షణలో పాల్గొన్న ప(త్రిక విలేఖరి ఒకడు వచ్చాడు. అతడు వెనుకటి లెఫ్టినెంట్ అలెగ్జాండర్ మహ్నాచ్. 455 వ ఇన్‌ఫెం(ట్రీ రెజిమెంటులోని ప్లాటూన్ కమాండరు. ఇప్పుడు బైలొరష్యాలో ప(త్రికా రచయితగా పనిచేస్తున్నాడు. అతడు మతెవొస్యాన్ వలెనే యుద్ధం చేసి దుర్గకుడ్యాలపై రక్తాన్ని ధారవోశాడు. సోవియట్ సైనికుని వేషంలో వున్న ఒక నాజీ ఏజెంటు అతనిని వెనుక నుండి తుపాకీతో కాల్చి తీ(వ్రంగా గాయపడేట్టు చేశాడు.

స్థానిక వైద్య పాఠశాలలో విద్యార్థినిగా వుంటోన్న కాప్టెన్ షబ్లోవ్‌స్కి కుమార్తె తాన్య, దుర్గం నేలమాళిగల్లో తమ పిల్లలతోపాటు తలదాచుకున్న ఆఫీసర్లు అర్షినొవ్-నికీతిన్, బులీగిన్‌ల భార్యలూ అక్కడ హజరయ్యారు.

దుర్గంలో సమావేశమైన వారందరూ 1941 లో అక్కడ ఏం జరిగిందో ఆ భయభక్తులతో ఆవేశితపరచే గాథని కళ్లనిండా నీళ్లు నింపుకొని విన్నారు. తమ స్నేహితుల అద్భుత చర్యలనూ, అసమానమైన పోరాటాన్ని కొనసాగించడంలో వారి వీరత్వాన్నీ, వారి కృతనిశ్చయతనీ, పోరాటంలోని అమానుషమైన కష్టాలని దాటేందుకై సహాయపడిన వారి మాతృదేశ భక్తిని గురించీ, శత్రువుల యెడల మండిపోతోన్న వారి ద్వేషాన్ని గురించీ మతెవొస్యాన్, మహ్నోచ్‌లు ఉపన్యసించారు. అది మనసున నాటుకు పోయే కథ. యువసైనికులు తమ ధ్యానాన్నమంతా అటువైపే కేంద్రీకరించి, తమ తండ్రులూ, అన్నలూ చూపిన వీరోచిత శీలంనుండి గుణపాఠాన్ని నేర్చుకుంటూ, విన్నారు. ఆ తర్వాత దుర్గరక్షకులు ఆ యువకుల కోరిక పైన వారికి దుర్గశిథిలాలన్నిటినీ చూపించారు.

"మేం క్షతగాత్రులందరినీ ఉంచిన గది యిక్కడే వుండేది," అని మహ్నోచ్ అన్నాడు, గడ్డిమొలచిన బారకాసుల ఉత్తర విభాగపు శిథిలాల వరకూ వెళ్లి. "ఒక జర్మన్ టాంకు లోపలికి వచ్చి ఆ క్షతగాత్రులందరినీ మట్టివేసింది," అని అతడు జోడించాడు. ఆ విషయాన్ని వినగానే యువ సైనికుల ముఖాలు చిట్లించుకుని గంభీర ముద్రధరించాయి. నాజీ టాంకు మనుషులు వాడికట్టిన ఆ భయంకరమైన ఘోరకృత్యాలను తెలిపినప్పుడు వారు తమ పడికిళ్లని బిగపట్టారు.

కమిస్సార్ ఫొమీన్‌చే ఒకప్పుడు పరిరక్షించమని తనకు వొప్పజెప్పిన శ్వేత భవనం శిథిలాలవద్దకి ఒక పెద్ద సైనికుల సముదాయాన్ని తీసుకు వెళ్లాడు మతెవొస్యాన్. ఇప్పుడక్కడ రాళ్లూ రప్పలు తప్ప ఆ భవనానికి చెందినది బహుస్వల్పంగా మాత్రమే మిగిలింది. కాని కొన్నిస్థలాలలో మందమైన



1954 బ్రెస్ట్ నగరంలో అలెగ్జాండర్ మహ్నోచ్,
సమ్వేల్ మతెవాస్యాన్

ఇనుప కంచెలుగల వెలుపలి కాంక్రీటు గోడ మాత్రం యింకా చెక్కు చెదరకుండానే వుంది.

వాళ్లంతా కూడా ఆ గోడవద్ద ఒక మూలగా గుమిగూడి నిలబడ్డారు.

"ఇక్కడ మాకొక మెషీన్‌గన్ వుండేది. ఫాసిస్టులు పట్టుకొన్న క్లబ్బు భవనం కిటికీలమీదికి కాల్పులను సాగిస్తుండేది. ఇక్కడి భూమి లోపల బహుశ బోలెడన్ని తూటాల పెట్టెలు దొరక వచ్చు," అని మతెవాస్యాన్ అన్నాడు.

ఒక సైనికుడు పారని తెచ్చి తవ్వడం మొదలుపెట్టాడు. అతడు తవ్విన ప్రతిసారీ కూడా కాలంతోపాటు పచ్చబడిపోయిన సోవియట్ మెషీన్

గన్ కొలతకు సరిపోయే తూటాల ఖాళీ గొట్టాలు నిజంగానే వెలుపలికి వచ్చాయి. తూటాల గొట్టాల కంటెనూ అధికమే వుంది ఇక్కడ. తవ్వుతూ వున్న మట్టిలో ఏదో తెల్లగా గోచరించింది. దానిని అందుకొనేందుకై మతెవాస్యాన్ వెంటనే ముందుకు వంగాడు. అది మనిషి పుర్రెకు చెందిన తునుక. దాని మధ్యలో రంపంవలె కోసుకుపోయిన తూటా కన్నం వుంది. మతెవాస్యాన్ ఆ పుర్రెను మౌనంగా పరీక్షించాడు. అతని ముఖంలో నెత్తురు చుక్క లేదు. ఆ పుర్రెను పట్టుకొని వున్న చెయ్యి కొద్దిగా వణికింది.

బొంగురు గొంతుతో అన్నాడు: "మా మనుషులలో ఒకడు. ఫాసిస్టులు వారి సైనికులను పట్టణంలో భూస్థాపితం చేశారు."

అతని కళ్లనిండా నీళ్లు క్రమ్మాయి. అతడు తలపైకెత్తి తన చుట్టూ గుమిగా చేరుతోన్న సైనికుల వైపు చూశాడు.

"ఈ రాళ్లకింద మన వాళ్లు ఎంతో మంది వున్నారు," అని అతడు గద్గద స్వరంతో అన్నాడు. "కామ్రేడ్స్, వాళ్లని సంస్మరించండి."

అతనికెవరూ సమాధానం చెప్పలేదు. మాటలు అవసరం లేదని వాళ్లందరికీ తెలుసు. కాని ఆ యువసైనికుల ముఖాలనిబట్టి, ఆ పాత దుర్గం శిథిలాలమధ్య యుద్ధంలో నేలకొరిగిన 1941 నాటి ఆ అనామకులైన వీరుల చర్యలను వారు చాలా కాలం జ్ఞాపకం వుంచుకుంటారనీ, దుర్గరక్షకుల చర్యలు ధైర్యానికీ దేశభక్తికీ చిహ్నంగా వారి మనస్సులలో శాశ్వతంగా వుండిపోతాయనీ, వారు దుర్గరక్షకుల ధైర్యస్థైర్యాలకి వారసులైనట్టు భావిస్తున్నారని పోల్చుకోవచ్చు.

వారు సైనికులకొరకు వేచివున్న లారీలవద్దకు తిరిగి వెళ్తూన్నప్పుడు, యుద్ధకాలంనుండీ దాదాపు పది సంవత్సరాలపాటు బ్రెస్ట్‌లో వుంటూ చాలా కాలం సర్వీసులో వున్న సార్జెంటు-మేజరు బోరిస్ ఒర్లోవ్ దుర్గంలో

ఒకప్పుడు గారిజన్ సభ్యుడుగా వున్న ఒకానొక వ్యక్తిని తానే విధంగా కలుసుకున్నదీ తెలిపాడు.

అది 1951 లేదా 1952 వ సంవత్సరంలోని వేసవి. ఒర్లోవ్ నాయకత్వాన ఒక సైనికుల గ్రూపు మధ్య దీవి పశ్చిమ విభాగంపైన పనిచేస్తోంది. పట్టణం నుండి ఒక టాక్సీ వంతెన మీదుగా వెళ్లింది. అది హోల్మ్‌స్కి గేటువద్ద ఆగింది. ఒక ఆఫీసరు కారునుండి దిగాడు. అతడు టోపీని తీసివేసి, చుట్టూ చూస్తూ నెమ్మదిగా బారకాసులవెంట తెరేస్పోల్‌స్కి గోపురం వైపుకి ఒర్లోవ్ మనుషులు పనిచేస్తున్న స్థలానికి సమీపాన వున్న చోటుకు నడుచుకుంటూ వెళ్లాడు.

ఆ ఆఫీసరు గోపురపు శిధిలాలవద్ద ఆగాడు. నలభై సంవత్సరాల వయసుగల మేజరు అతడు. అతని నల్లని తలవెంట్రుకలలో స్పష్టంగా అగపడుతోన్న తెల్లని వెంట్రుకలు అక్కడక్కడ కనబడుతున్నాయి. రూపురేఖలు కఠినంగానూ తీరుగానూ వున్నాయి. ఛాతిమీద రెండు వరసలు ఆర్డర్లు పతకాలు తళతళ్లాడుతున్నాయి.

తలపైనున్న టోపీని తీసివేసి, ఆ శిధిలాల గుట్టవైపు రెప్పవాల్చకుండా ధ్యానిస్తూ నిలబడ్డాడు ఆ మేజరు. అక్కడ వున్న సైనికులను అతడు గమనించినట్టే లేదు, వాళ్లూ అతనిని గురించి ఏమంతగా పట్టించుకోనూ లేదు కూడాను. విదేశాలలో డ్యూటీ చేయడానికి వెళ్లుతూన్న ఆఫీసర్లూ, విదేశాలనుంచి స్వదేశానికి తిరిగి వచ్చేస్తూన్న ఆఫీసర్లూ తమ రైలుకోసం ఆగుతూ, ఆ కాస్త వేళావెళ్లబుచ్చేందుకు, ఎన్నో అద్భుత గాథలు ప్రజలు చెప్పుకుంటూన్న ఆ దుర్గాన్ని చూచి పోదామని తరుచు అక్కడకు వస్తూంటారు. అలాంటి ఆగంతకులకు ఆ సైనికులు చాలాకాలంగా అలవాటు పడిపోయారు.

కాని తరువాత ఏం జరిగిందో అది మాత్రం అసాధారణమైన విషయమే. అందుచేతనే ఆ సైనికులు దానిని గమనించకుండా వుండలేక పోయారు. అతడెవడో వారు ఎరగని ఆ ఆఫీసరు తటాలున మోకాళ్లమీద పడి, ధూళిధూసర వర్ణంతో మురికిగా వున్న ఆ రాళ్లనీ రప్పల్నీ తన హృదయంతో తాకి, వాటిని తన గుండెలకి హత్తుకుని, చేతుల్లో ముఖం పెట్టుకుని వలవల ఏడ్చేశాడు. ఆపుకొన శక్యంకాకుండా పొంగి పైకి వచ్చేస్తున్న ఆ ఏడుపు ఆ సైనికుల చెవిని పడింది.

ఆ సార్జెంట్-మేజరూ, అతని మనుషులు ఇద్దరూ వెంటనే ఆ ఆఫీసరు దగ్గరకి వెళ్ళారు.

"ఏమిటి, కామ్రేడ్ మేజర్?" అని అడిగాడు ఒర్లోవ్ సానుతాపంతో.

మేజరు త్రుళ్లిపడి, చూట్టూ పరికించాడు. ఆ సైనికులని చూసి, అతడు సంబాళించుకుని, లేచి నిలబడ్డాడు. అతని ముఖం కన్నీళ్లతో చెమ్మగిలింది. అతని బరువైన కనుబొమల మధ్య విచారంతో నిండిన ఒక లోతైన రేఖ ఉంది.

"మేం యిక్కడ నలభై ఒకటో సంవత్సరంలో యుద్ధం చేశాం," అని అతడు క్లుప్తంగా సమాధానం చెప్పాడు.

అతడు ఆ సంస్మరణీయమైన రోజుల గురించి మాట్లాడవచ్చునని తలపోస్తూ సైనికులంతా ఆ మేజరును సానుభూతితోనూ ఆశ్చర్యంతోనూ అతనివైపు చూశారు. అతడు కొద్ది నిముషాలపాటు అలాగే నిలబడి పోయాడు. చేతిరుమాలుతో కళ్లని తుడుచుకొని సార్జెంట్-మేజరుకీ అతని మనుషులకీ సైనిక వందనం చేసి తన కారువద్దకి వెళ్లిపోయాడు.

"అతని పేరు అడుగుదామనుకున్నాను. ఎందువల్లనో అడగ లేక పోయాను. అతడు ఎంతో విచారంలో వున్నాడు," అని ఒర్లోవ్ అన్నాడు.



మాస్కోలో బ్రెస్ట్ దుర్గ రక్షకులు. ఎడమనుండి కుడికి: ప్యోత్ర్ కాష్కారొవ్, సమ్వేల్ మతెవొస్యాన్, ఎఫ్. జబీర్కొ, కొన్స్తన్తీన్ కసాత్కిన్, ప్యోత్ర్ క్లీప

"మనకు తెలిసినవాళ్లకంటే యింకా ఎక్కువ మందే జీవించి వుండవచ్చు," అని ఒక ఆఫీసరు ధ్యానపరుడై అన్నాడు. "వారు బహుశ దేశం అంతటా అక్కడక్కడ వుండవచ్చు..."

ఆ ఆఫీసరు అభిప్రాయం సరియైనదే. ఇప్పుడు సోవియట్ యూనియన్‌లో పట్టణాలలోనూ, పల్లెలలోనూ, బ్రెస్ట్‌నుండి మగదాన్‌వరకూ, మూర్మన్స్క్‌నుండి ఎరెవాన్‌వరకూ నివసించి వున్న పూర్వపు దుర్గరక్షకుల సంఖ్య మూడు వందలకు పైగా వున్నట్టు ప్రజలకి తెలియవచ్చింది.

... దుర్గంలో జరిగిన సమావేశానంతరం సుమారు రెండు సంవత్సరాలు గడచిపోయాయి. 1956 జులైలో సోవియట్ ప్రజలు బ్రెస్ట్ దుర్గరక్షణయొక్క పదిహేనవ వార్షికోత్సవం జరుపుకున్నారు. ఈ ఉత్సవం గౌరవర్థం మాస్కోలో ఏర్పాటు చేసిన బహిరంగ సభకు యుద్ధకాలంలో దుర్గరక్షణలో పాల్గొన్నవారిలో కొంతమంది హాజరయ్యారు.

సోవియట్ సైన్యంయొక్క కేంద్రభవనపు హోటల్‌లో జరిగిన సమావేశాలు హృదయాన్ని కలచివేస్తాయి. తూర్పు కోట కమాండరు ప్యోత్ర్ గవ్రీలొవ్ తన పూర్వపు ఛీఫ్ ఆఫ్ స్టాఫ్, యిప్పుడు యరొస్లావ్ల్ ఫ్యాక్టరీలో యింజనీరుగా పనిచేస్తున్న కాప్టెన్ కొన్‌స్తన్‌తీన్ కసాత్కిన్‌ను కలుసుకున్నాడు. అతడు రయీస అబకూమొవను, తన పూర్వపు రెజిమెంటులోని స్నేహితుడు అలెగ్జాండర్ సెమేనెన్‌కొను కలుసుకున్నాడు. ఇప్పుడు కలీనిన్ ప్రాంతంనుండి మాస్కోకు వచ్చిన తన పాతస్నేహితుడు, దుర్గరక్షణసమయంలో చెయ్యిని కోల్పోయిన రెజిమెంటల్ క్వార్టర్‌మాస్టర్ నికొలాయ్ జోరికొవ్‌ను సెమేనెన్‌కో కౌగలించుకొని దుఃఖించాడు. ఈనాడు మిన్స్క్‌లోని ఫిల్‌హార్‌మోనిక్ ఆర్కెస్ట్రా సభ్యులలో తన పూర్వపు రెజిమెంటు స్నేహితులలో ఒకరైన మిహయీల్ గురేవిచ్‌ని పేత్య క్లీప కలుసుకున్నాడు.

ప్రస్తుతం వాలొగ్ద కొలిమి ఆపరేతటరుగా పనిచేస్తోన్న వెనుకటి లెఫ్టినెంట్ అనతోలియ్ విన్యోగ్రాదొవ్, ఈనాడు మాస్కో గ్యారేజి మేనేజరుగా పని చేస్తోన్న రాజకీయ ఆర్గనైజరు ప్యోత్ర్ కొష్కారొవ్‌లు ఒకరినొకరు కలుసుకొనేందుకై ఆనందంతో పరుగెత్తారు. కీర్తిశేషుడైన తన కమిస్సార్ ఫొమీన్‌యొక్క కుమారుడు, ప్రస్తుతం కీయెవ్‌లో బారిస్టరుగా పనిచేస్తున్న యూరిని సమ్వేల్ మతెవొస్యాను ఆనందంతో కౌగలించుకున్నాడు.

వీరోచితమైన దుర్గరక్షణలో పాల్గొన్నవారు టెలివిజన్‌లో అగుపడ్డారు. రాజధానీ నగరంలోని సైనిక దళాలనీ, ఫ్యాక్టరీలనీ సందర్శించారు. వారిని ప్రతిచోటా కూడా మాస్కో ప్రజలు ఆనందంతో ఆహ్వానించారు. తర్వాత సోవియట్ సైన్యంయొక్క కేంద్రభవనం ఎర్రజెండా హాలులో ఉత్సవ వేడుకలు జరిగాయి. వందలాది మాస్కోవాసులు, సోవియట్ సైన్యానికి చెందిన జనరళ్లు, ఆఫీసర్లు, సైనికులూ ఆ ఉత్సవానికి హాజరయ్యారు.

ఆ తర్వాత కొద్ది రోజులకి మాజీ దుర్గరక్షకుల గ్రూపు ఒకటి దుర్గాన్ని సందర్శించింది. దారిలో, ప్రస్తుతం మిన్‌స్క్‌లో నివసిస్తోన్న అలెగ్జాండర్ మహ్నోచ్, ఫ్యోదొర్ జురవ్‌లేవ్, మిహయీల్ గురేవిచ్, అలెగ్జాండర్ పెత్లీత్‌స్కిలు గవ్రీలొవ్, మతెవొస్యాన్, క్లీప, అబకూమొవ, విన్యోగ్రాదొవ్‌లను కలుసుకున్నారు.

రైలు బ్రెస్ట్ స్టేషన్‌లోకి ప్రవేశించే సమయానికి తెల్లవారింది. ఆ రోజు ఉదయం చిమ్మచీకటిగానూ తడిగానూ వున్నప్పటికి కూడా తమ అతిథులని ఆహ్వానించేందుకని వందలాది పట్టణ ప్రజలు పూలతోనూ మిలిటరీ బ్యాండు మేళంతోనూ స్టేషన్‌కు వచ్చారు. బ్రెస్ట్ పట్టణ ప్రజలు తమ వీరులను తమ ప్రాణ స్నేహితులవలె పరిగణిస్తూ ఆహ్వానించారు. ఆ జన సందోహంలో దుర్గాన్ని పరిరక్షించిన యితరులు వున్నారు. వారిప్పుడు



దుర్గరక్షకులు దుర్గాన్ని సందర్శిస్తున్నారు

బ్రెస్ట్ ప్రాంతంలో నివసిస్తున్నారు: తూర్పు కోటని పరిరక్షించిన లెఫ్టినెంట్లలో ఒకరైన యాకొవ్ కొలొమీయెత్స్, 44 వ రెజిమెంట్‌లో సైనికుడుగా పనిచేసిన గ్రిగోరియ్ గుదీమ్, సిరిసంపదలతో తులతూగుతోన్న సమిష్టి వ్యవసాయక్షేత్రంలో ప్రస్తుతం అధ్యక్షుడుగా పనిచేస్తోన్న మాజీ సిగ్నలర్ మార్క్ పిస్కూన్, కీర్తిశేషుడైన కాప్టెన్ జుబచోవ్‌యొక్క భార్యా అతని కుమారుడు, వీరుడైన నికొలాయ్ నెస్తెర్చూక్‌యొక్క భార్యా అతని కుమార్తె, యుద్ధంలో ధైర్యసహసాలతో మరణించిన యితర ఆఫీసర్ల కుటుంబాలు వీళ్లంతా కూడా ఆ జనసమూహంలో వున్నారు. అది మరువరాని సన్నివేశం. ఆ రోజునే దుర్గరక్షకులూ, మరణించిన వీరుల కుటుంబాలవారూ ఆ

దుర్గాన్ని సందర్శించారు. వారు, హృదయాలు ద్రవించిపోగా, గంభీరమైన మౌనంతో, పెద్దపెద్ద పూలగుత్తులని పట్టుకొని ఆ దుర్గద్వారాలను ప్రవేశించారు. తమ స్నేహితులు మరణించిన ఆయా శిధిలాలపైన తమతో తెచ్చిన పూలను సమర్పించారు. మొదట కాప్టెన్ జుబచోవ్ భార్యా కొడుకు తమ పూలగుత్తులని ఆ కాప్టెన్ హెడ్క్వార్టర్సుగా చేసుకున్న నేలమాళిగ పైకప్పుమీద ఉంచారు. ఫాసిస్టులు రెజిమెంటల్ కమిస్సార్ ఫామీన్‌ను కాల్చివేసిన గోడ అడుగు భాగాన సమ్‌వేల్ మతెవొస్యాన్ తన పూలను జాగ్రత్తగా వుంచాడు. క్లిష్టమైన ముట్టడి రోజుల్లో తన తండ్రితోనే వున్న నెస్తెర్చ్యుక్ కుమార్తె తన పూలని తండ్రి చనిపోయిన స్థలంలో వుంచుతున్నప్పుడు కంటనీరు పెట్టుకొని దుఃఖించింది.

రెండు రోజుల తర్వాత పట్టణపు స్టేడియంలో పది వేలమంది హాజరైన బ్రెస్ట్ పట్టణప్రజల సభజరిగింది. దుర్గరక్షణ వీరులను కలకలంతో



శిథిలాలపై

నిండిన ఉత్సాహ సూచకమైన కేకలతోనూ హర్షధ్వానాలతోనూ ఆహ్వానించారు. వారిపై పూలవర్షాన్ని కురిపించారు. అనేక హృదయపూర్వకమైన ఉపన్యాసాలనిచ్చారు. వేదికపైనుండి సమాధానం చెప్పుతూ, తాము రక్తం ధారవోసినట్టి, తమ స్నేహితులు అసువులు కోల్పోయినట్టి ఆ పట్టణమూ, దాని పాత దుర్గమూ తమకు నిరంతరం ప్రాణప్రదంగానూ పవిత్రంగానూ ఉంటాయని ఆ దుర్గరక్షణ వీరులు అన్నారు.

ఆ మర్నాడు ఉదయం దుర్గం వెలుపలి గోడను హద్దుగా వుంచుకొని, ప్రశాంతంగా పచ్చగా వున్న శ్మశానానికి చాలా మంది వచ్చారు. ఇక్కడ ఒక ఉమ్మడి సమాధి వుంది. దుర్గాన్ని బాగుచేస్తున్న సమయంలో దొరికినటువంటి అనేక అనామక వీరుల అస్థిశేషాలను యీ ఉమ్మడి సమాధిలో వుంచారు.

ఈ సమాధివద్ద తమ పూజలని అర్పించేందుకై దుర్గరక్షకులు వచ్చారు. "రక్షిస్తున్న వారితోపాటు యుద్ధంచేసి వీరులవలె అసువులు బాసిన మా తోటిసైనికసోదరులకు," అని వ్రాసి వున్న ఎర్ర రిబ్బనునూ, ఒక పెద్ద పూలగుత్తినీ ఎంతో జాగ్రత్తగా ఆ మట్టి సమాధిపైన వుంచారు.

అదే రోజున బ్రెస్ట్ పట్టణ ప్రజలు తమ అథితులకు సంతోషపూర్వకమైన వీడ్కోలు ఇచ్చారు.

...కొన్ని నెలలు గడిచిపోయాయి. బ్రెస్ట్ దుర్గ సందర్శనార్థమై వచ్చిన మరో ఆదరణీయుడైన అతిథి అక్కడకు వచ్చాడు. అతడు చాలా దూరంలో వున్న సైబీరియానుండి వచ్చిన రోదిఓన్ సెమెన్యూక్. కేమెరోవా యినుము-ఉక్కు కర్మాగారంలో పనిచేస్తున్నాడు. పూర్వం 393 వ విమానవిధ్వంసక ప్రత్యేక బటాలియన్‌లో జూనియర్



రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్‌ను నాజీలు తూపాకితో కాల్చివేసిన కుడ్యపాదంవద్ద బ్రెస్ట్ దుర్గ రక్షకులు పుష్పములను సమర్పిస్తున్నారు

సార్జెంట్‌గా పనిచేసిన వ్యక్తి. బటాలియన్ జెండాను భద్రంగా వుంచే బాధ్యని అప్పగించింది యితనికే. కోట శత్రువులకు లొంగిపోయే ముందు యితడు దుర్గనిర్మాణాల కిందవున్న కొట్లలో ఒక దానియందు ఆ జెండాని పూడ్చివేశాడు. ఆ దాచిన జెండాను కనుగొనేందుకై రొదిఓన్ సెమెన్యూక్ యిప్పుడు వచ్చాడు.

అతడు ఉద్రేకంతో బిగుసుకుపోయి ఆ అమూల్యమైన జెండాను తానెక్కడ దాచిందీ జ్ఞాపకం చేసుకొనేందుకై శ్రమపడుతూ తూర్పుకోట వద్దకు నడిచి వెళ్లాడు. అతడు నేలమీద కాలితో తన్ని గద్గద స్వరంతో అన్నాడు: "ఇక్కడే!" అతనితో వున్న వాళ్లందరి హృదయాలూ దడదడమని వేగంగా కొట్టుకున్నాయి.

సెమెన్యూక్ స్వయంగానే పారను తీసుకున్నాడు. అతని పార ఏదో ఒక లోహపు వస్తువుకి తగిలింది. తాను పొరబడలేదని అతడు వెంటనే గ్రహించాడు. అతడు జెండాని దాచినటువంటి లోహపు పాత్రే అది.

పదిహేను సంవత్సరాలైపోయిందేమో ఆ పాత్ర తుప్పుపట్టిపోయి చిల్లులు పడిపోయింది. ఆ పాత్రని భూమినుండి అతడు వెలుపలికి తీసినప్పుడు జెండా ఏమైపోయిందోనని ఆత్రతపడ్డాడు. అతడు జాగ్రత్తగా కాన్‌వాసు బాల్చీని ఆ లోహపు పాత్రనుండి వెలుపలికి తీశాడు. అది కూడా అతని చేతులలో గుండగుండైపోయింది. జెండాను చుట్టి వుంచిన టార్పాలిన్ కూడా పెళుసుబారిపోయి వుంది. వణికిపోతోన్న వేళ్లతో అతడు ఆ టార్పాలిన్‌ను చించి వేశాడు.

జెండా చెక్కు చెదరకుండా వుంది. కాలగతి కూడా దానిని పాడుచేయ లేకపోయింది. అందరి సమక్షంలోనూ సెమెన్యూక్ ఆ జెండాని విప్పాడు.

సింధూరపు వర్ణంతో వున్న ఆ ముఖమల్ జెండాపైన బంగారపుటక్షరాలు తళాతళా మెరిసిపోయాయి:

"ప్రపంచ కార్మికులారా, ఏకముకండి!"

దానికింద యీ విధంగా వుంది:

"393 వ విమానవిధ్వంసక ప్రత్యేక బటాలియన్."

దుర్గం ఆవరణలో పటాలాలు శ్రేణులుగా ఏర్పడి గంభీరంగా నిలబడ్డాయి. ధ్వజాన్ని పట్టుకున్న వ్యక్తీ, అతని సహాయకులూ చురుగ్గా వేగంగా కవాతు తొక్కారు.



393 వ విమానవిధ్వంసక బటాలియన్ జెండాను వీక్షిస్తూన్న రొదిఓన్ సెమెన్యూక్

సిందూర వర్ణపు జెండా ఆ గాలిలో వారి ముందు విప్పారుకుంది. కోల లేనటువంటి మరొక జెండా ఈ జెండా వెనుకను గబగబా శ్రేణులని దాటి కదిలింది. మామూలు పౌరుని దుస్తుల్లో వున్న పొడగరికాని ఒక వ్యక్తి యీ జెండాను అతి జాగ్రత్తగా తన చాచిన చేతులలో మోసుకు వెళ్తున్నాడు. మాతృదేశం కొరకు చేసిన భయంకర యుద్ధాల ధూమంలో ఎగిరిన జెండా అది. అతడు దానిని తన ఛాతీకి చుట్టేసుకొని శత్రువులతో పోరాడి దానిని భావితరాలకై భద్రంగా దాచిపుంచాడు. అలాంటి బ్రెస్ట్ దుర్గం వీరుల పవిత్ర ధ్వజానికి మౌనంగా నిలబడ్డ సైనిక శ్రేణులు తమ జోహార్లను అందజేశాయి.

జూనియర్ సార్జెంట్ రొడిఒన్ సెమెన్యూక్ కాపాడినటువంటి ఆ జెండాని 1956 నవంబరు 8 వ తేదీన అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం 39 వ వారికోత్సవ సందర్భంలో, మధ్య దీవిలోని పాత బార కాసులలోని ఒక భాగమందు ప్రారంభించిన బ్రెస్ట్ దుర్గ వీరోచిత పరిరక్షణ మ్యూజియంకు బహూకరించారు. ఆ మ్యూజియం గదులలో వందలాది ప్రదర్శన వస్తువులు వున్నాయి. వాటిల్లో దుర్గ శిధిలాలకింద అగపడిన ఆయుధాలూ పత్రాలూ, దుర్గరక్షకుల అసంఖ్యాకమైన ఫోటోలూ, ఆ పౌరాణిక పోరాటానికి అంకితమొనర్చిన వర్ణచిత్రపటాలూ, ఆ విషయానికి సంబంధించిన అనేక వ్యాసాలూ పుస్తకాలూ వున్నాయి.

మ్యూజియంని చూడ్డానికి శిధిలాలని పరీక్షించేందుకూ ప్రతిరోజూ అనేక మంది సందర్శకులు వస్తుంటారు. బ్రెస్ట్ పట్టణంనుండీ, యితర పట్టణాల నుండీ తరచూ ఇక్కడికి అనేకమంది ఎక్స్‌కర్షన్లపై వస్తుంటారు.

బ్రెస్ట్ పట్టణం సోవియట్ యూనియన్‌యొక్క ప్రవేశద్వారం. దానితలుపు పశ్చిమ యూరప్‌లోకి దారి తీస్తుంది. ప్రతి రోజూ అనేక రైళ్లు ప్రయాణీకులను ఆ సరిహద్దు అవతలికీ లోపలికీ తీసుకు వెళ్తుంటాయి. అనేక విదేశీ ప్రతినిధి వర్గాలవారు బ్రెస్ట్‌నుండే సోవియట్ యూనియన్‌లోకి ప్రవేశిస్తుంటారు.

బ్రెస్ట్ స్టేషన్‌లో ఆగే ప్రతి వ్యక్తీ కూడా, తనకు కొద్ది సమయమే వున్నప్పటికీ వేగిరపడుతూ ఆ ప్రఖ్యాతమైన దుర్గాన్నీ దాని మ్యూజియంనీ సందర్శించి, అక్కడి శిధిలాలకు తన జోహారులను అర్పిస్తాడు. బ్రెస్ట్ దుర్గం వీరుల పరాక్రమ కృత్యం ప్రపంచమంతటా ఖ్యాతిని పొందింది. అది మానవుని చరిత్రలో అత్యంత అద్భుతమైన సైనిక చర్యలలో ఒకటిగా ఆచంద్రార్కం నిలుస్తుంది.

ఈ అద్భుత చర్యని సోవియట్ ప్రజలూ, సోవియట్ ప్రభుత్వమూ గొప్పగా గుర్తించారు. 1957 ఆరంభంలో, సోవియట్ యూనియన్ సుప్రీమ్ సోవియట్ అధ్యక్షవర్గంవారి ఉత్తరవు ప్రకారం బ్రెస్ట్ దుర్గరక్షణ వీరులలో ఒకరైన ప్యోత్ గవ్రీలొవ్‌కు సోవియట్ యూనియన్ వీరుడనే బహూకరించారు. మధ్య దుర్గంయొక్క గారిజన్ కమాండరైన రెజిమెంటల్ కమిస్సార్ ఫొమీన్‌కు లెనిన్ ఆర్డర్‌ను మరణాంతరం బహూకరించారు. యుద్ధంలో మరణించిన వీరులు ఇవాన్ జుబచోవ్, కాప్టెన్ వ్లదీమిర్ షబ్లోవ్‌స్కి, సీనియర్ రాజకీయ ఆర్గనైజరు నికొలాయ్ నెస్తెర్చ్యూక్, లెఫ్టినెంట్ అలెక్సేయ్ నగానొవ్‌లకు దేశభక్తియుత మహాసంగ్రామం ప్రథమశ్రేణి ఆర్డర్‌లను వారి మరణాంతరం బహూకరించారు. సమ్‌వేల్ మతెవొస్యాన్, రయీస అబకూమొవ, అనతోలియ్ వినొగ్రాదొవ్, ప్యోత్ కొష్కారొవ్, రొదిఒన్ సెమెన్యూక్ మొదలైన ప్రఖ్యాత దుర్గరక్షకులకు "రెడ్ బేనర్" ఆర్డర్‌ను బహూకరించారు. ఇంకా యితరులు అనేకులకు వివిధ ఆర్డర్‌లనూ పతకాలనూ బహూకరించారు.

దుర్గరక్షకులయొక్క ప్రఖ్యాత చర్యలనూ, దేశభక్తియుత కార్యాలనూ సోవియట్ మాతృభూమి ఎన్నడూ మరువదు. వారికి సోవియట్ ప్రజలు తగు కానుకలని అర్పిస్తారు. స్వార్థరహితమైన వారి ధైర్యాన్నీ, కమ్యూనిజం కొరకై పోరాడిన వారి అచలితమైన సహసాన్ని సోవియట్ దేశపు యువకులు గుణపాఠంగా నేర్చుకుంటారు.

పాఠకులకు మనవి

ఈ పుస్తకాన్ని గురించిగాని దీని పేర్వా కూర్వా గురించిగాని మీ అభిప్రాయాలనూ మీ సలహాలనూ భావిప్రచురణల సహాయార్థం మాకు పంప ప్రార్థన. మా చిరునామా:

Progress Publishers 21, Zubovsky Boulevard, Moscow, U.S.S.R.

29